# పలుకుబడి



డా॥ తిరుమల రామచంద్ర

ప్రచురణ:
**వయోధిక పాత్రికేయ సంఘం**






తిరుమల రామచంద్ర
శతజయంతి ప్రారంభ సభ
దృశ్యాలు



# పలుకుబడి



డా॥ తిరుమల రామచంద్ర

ప్రచురణ:
**వయోధిక పాత్రికేయ సంఘం**

**PALUKUBADI by Dr. Tirumala Ramachandra**

| | | |
|---|---|---|
| Published by | : | **Veteran Journalists' Association** |
| Publication No | : | 08 |
| First Edition | : | December, 2013 |
| Copy Right | : | **Veteran Journalists' Association** |
| Price | : | Rs. 100 |
| For Copies | : | **Veteran Journalists' Association**<br>Plot No. 24, Journalists' Colony,<br>Road No. 3, Banjara Hills,<br>Hyderabad - 34<br>and All leading Book sellers |
| Cover | : | **Pinisetty** |
| DTP | : | **L. RAMA KRISHNA** |
| Design | : | **Efforts design**<br>www.efforts.co.in |
| Printed at | : | **Sai Lakhita Printers**<br>Khairatabad, Hyderabad. |

# మున్నుడి

తెలుగు భాషా వికాస సంవత్సరంగా కొలువబడుతున్న 1913లో ముగ్గురు మహామనీషుల శతజయంతులు రావడం, తెలుగు భాషోన్నతికి వారు చేసిన మహత్తర కృషిని స్మరించుకునే ప్రత్యేక అవకాశాన్ని భాషాప్రియులకు కలిగించినది. ఆ మహనీయులు తిరుమల రామచంద్ర, పుట్టపర్తి నారాయణా చార్యులు, కాళోజీ నారాయణరావు. చివరి ఇద్దరు కవిత్వ ప్రక్రియలో సాటిలేనివారు. పుట్టపర్తివారు 'శివతాండవం' వంటి లయాత్మక పద్యకావ్యం రచించి అఖండ ఖ్యాతిని ఆర్జిస్తే. కాళోజీ ప్రజల గోడును తనగోడుగా అనితర సాధ్యమైన ఫణితిలో వచన కవిత్వంగా అందించి ప్రజాకవిగా కీర్తి గడించారు. రామచంద్ర ప్రధానంగా పత్రికా రచయిత గనుక వచనాన్నే కవిత్వమంత భావస్ఫోరకంగా, సర్వాంగ సుందరంగా అందించి వాసికెక్కారు.

రామచంద్ర గొప్ప పండితుడు, బహుభాషావేత్త. నిర్విరామ పరిశోధకుడు. విమర్శకుడు, సాహిత్యసమీక్షకుడు, అనువాదకుడు, బహుగ్రంథకర్త. వీటన్నిటినీ పత్రికా రచనా వ్యాసంగాన్ని ఆలంబనగా చేసుకునే సాధించగలిగాడు. ఆయన పాత్రికేయ జీవనయానం 1944లో కాన్పూరులో 'డెయిలీ టెలిగ్రాఫ్' ఆంగ్లపత్రికతో ఆరంభమైంది. తర్వాత 'తెలంగాణ పత్రిక', మళ్లీ 'ఆంధ్రపత్రిక', తానే స్థాపించి సంపాదకత్వం వహించిన 'పరిశోధన', 'ఆంధ్రభూమి' దినపత్రిక, 'హిందుస్తాన్ సమాచార్' వార్తా సంస్థలలో అర్థ శతాబ్దికిపైగా దిగ్విజయంగా సాగింది. పలుపత్రికలలో ఆయన విశేష పాఠకాదరణ పొందిన శీర్షికా రచయితగా కూడా నిజ నామంతో, కలంపేర్లతో గొప్ప భాషాసేవచేశారు. రామచంద్రకు ఎన్నో పురస్కారాలు, బిరుదులు లభించాయి. కాని ఆయన 'పత్రికార్ శిరోమణి' బిరుదును మాత్రమే తమపేరు ముందు వ్రాసుకోడానికి ఇష్టపడేవారు. భాషా సేవకుడు అనే తనను తాను వర్ణించుకొనేవారు.

పత్రికారచనలో విషయపరిధి పెరిగిన కొద్దీ కొత్తపదజాలం అవసరమవుతుంది. శాస్త్ర, సాంకేతిక పరిభాష అవసరమవుతుంది. మనకు వైద్యం, శరీర నిర్మాణ శాస్త్రం, రసాయనశాస్త్రం, లోహశాస్త్రం, గణితం, ఖగోళ విజ్ఞానంలో సంస్కృత గ్రంథాలలో కావలసినంత పరిభాష అందుబాటులో ఉంది. కాని లోపభూయిష్టమైన విద్యావిధానం వల్ల సంస్కృతం నేర్చుకునే అవకాశం లేదు. కనుక గ్రంథస్థం అయి ఉన్న భాషా సంపద కూడా పూర్వికులు భూగర్భంలో దాచిన ధన సంపత్తిలాగ వాడుకోలేని దుస్థితి.

కొత్త శాస్త్రీయాంశాల ఆవిష్కరణలు జరిగినప్పుడు కొత్త పదసృష్టి అవసరమవుతుంది. ముందుగా ఈ సమస్య పత్రికా రచయితల ముంగిట్లో వాలుతుంది. 175 ఏళ్లుగా తెలుగు పత్రికారచనలో ఇది అందరూ ఎదుర్కొన్న సమస్యే శక్తిమేరకు పరిష్కరించుకొంటూ వస్తున్నదే. వీరేశలింగం పంతులు నుంచి ప్రారంభించి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, నార్ల వెంకటేశ్వరరావు, ఆ తర్వాత మాతరం వరకు అందరి కృషి ఉంది. ఆ కృషిలో రామచంద్ర వంటి పాళీ, ప్రాకృత, సంస్కృత తదితర భాషలు క్షుణ్ణంగా తెలిసినవారి పాత్ర అవిస్మరణీయమైంది, ఆదర్శవంతమైంది.

తిరుమల రామచంద్ర శతజయంతి సభ జరిపి స్ఫూర్తి పొందాలని ఆరునెలల క్రితం వయోధిక పాత్రికేయసంఘం సంకల్పించినప్పుడు ఆయన వదలివెళ్లిన అమూల్య భాషా సంపదను ఈతరం భాషా వ్యవహర్తలకు అందుబాటులోకి తెస్తే అదే ఆయనకు సముచిత నివాళి అవుతుందని భావించాము. ఆ ఆలోచనను ఆచరణలో పెట్టడానికి, సాధన సంపత్తిని సమకూర్చుకోడానికి తొలి అడుగుగా 'తిరుమల రామచంద్ర శతజయంతి సంస్మృతి' అనే చిన్న పుస్తకాన్ని వెలువరించాము. దాని ముందుమాటలో "భాషాభివృద్ధికి తోడ్పడటం ప్రభుత్వ లక్ష్యాలలో ఒకటి గనుక అధికార భాషా సంఘమో, తెలుగు విశ్వవిద్యాలయమో, తెలుగు అకాడమీయో ఈ సాహితీకృషీయుని రచనలన్నిటినీ సమగ్ర సాహిత్య సంపుటాలుగా ప్రచురించాలని" కోరాము. శతజయంతిని ఆయన విశిష్ట వ్యక్తిత్వానికి తగిన స్థాయిలో జరపాలని కేంద్రసాహిత్య అకాడమీని సంప్రదించగా, వారికీ ఆ ఆలోచన ఉండటంతో రామచంద్ర శతజయంతి సదస్సును నిర్వహించడానికి ముందుకు వచ్చారు. ఈ సదస్సు సందర్భంగా రామచంద్ర అముద్రిత రచనలలో 'పలుకుబడి' శీర్షికన వెలువడిన వ్యాసాలను గ్రంథస్థం చేసి మా అభిమానాన్ని చాటుకుంటున్నాము. భాషా సేవలో ఇది ఇంకొక ముందడుగు అవుతుందని విశ్వసిస్తున్నాము. ఈ గ్రంథాన్ని భాషా ప్రియులు, ముఖ్యంగా నవతరం పత్రికా రచయితలు సద్వినియోగం చేసుకుంటారని ఆశిస్తున్నాము.

**డా॥ జి. యస్. వరదాచారి**

అధ్యక్షులు, వయోధిక పాత్రికేయ సంఘం

హైదరాబాద్
22-12-2013

## పాత్రికేయుల రచనలు – 'పలుకుబడి' – అన్వీక్షణం

పదాలు భావగర్భితాలు. అవి దట్టించిన ఫిరంగిలాంటివి. గురితప్పకుండా ప్రయోగిస్తే లక్ష్యాన్ని ఛేదించవచ్చు. లేదా ఆ ప్రయోగం నిష్ప్రయోజనమవుతుంది.

ప్రయోగించే మందుగుండు సామాగ్రి స్థానికంగా లభిస్తే మంచిదే. లేదా సరైన సామాగ్రి విదేశీయమైనదైనా ఫరవాలేదు. లక్ష్యాన్ని సాధించడమే దాని పరమార్థం.

మన తెలుగు తేనెలొలుకుతుంది. సందేహం లేదు. అంతేకాదు అజంతమైంది కాబట్టి తెలుగు చెవులకింపయి వింటే చెవులు కోసుకోబుద్దవుతుంది.

అయితే ప్రపంచమే ఒక పల్లె అయిపోయిన ఈ శతాబ్దంలో శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందుతూ కొత్తకొత్త ఆవిష్కరణలు జరుగుతున్నాయి. వాటికి సంబంధించిన పదజాలం కుప్పలు తెప్పలుగా వస్తున్నది. ప్రతిదానికి సమానార్థకమైన తెలుగుపదం సృష్టించుకోవాలనుకోవడం చాదస్తం. అవసరమైన వాటిని సందర్భానుసారంగా వాడుకోవడం, తెనిగించుకోవడం తెలివైనపని. ఇతరభాషాపదాలను వాడకూడదని మడికట్టుకుని కూర్చోవడం మూర్ఖత్వం.

ఎందుచేతనంటే – ఇంగ్లీషు ఇవ్వాళ్ళ అంతర్జాతీయ భాషగా పెరిగిందంటే ప్రధానకారణం అది అన్య భాషాపదాలను తనలో ఇమిడ్చుకోవడమే. లోగడ సంస్కృతం కూడా ఇతర భాషా పదాలను స్వీకరించి తన ముద్రవేసుకుంది.

బహుభాషావేత్త తిరుమల రామచంద్ర అభివర్ణించినట్టు భాష ప్రవాహిని. ఏ నదిలోనైనా ప్రవాహమార్గంలో ఎన్నెన్నో ఉపనదులు, వాగులు వంకలు వచ్చి చేరిపోతాయి. అవి ఎన్ని ఎక్కువ సంఖ్యలో చేరితే అది అంత మహానది అవుతుంది.

ఇలాగే ఏ భాషాప్రాంతంలోనైనా, దాని ఇరుగుపొరుగుతో, ఇతర ప్రాంతాలనుంచి చుట్టపుచూపుకు వచ్చే వారితో కళకళలాడుతూ, పరస్పరం ఇచ్చిపుచ్చుకునే సందర్భాలాలలో కొన్ని కొత్త పదాలు చేరిపోతాయి. ఇంతకుముందు ఉన్న పదాలలో కొన్నింటికి కొత్త అర్థచ్ఛాయలు పొడచూపుతాయి. ఇది క్రమంగా ఓపూవు పూసినట్టు జరిగే భాషావికాసం.

ఇట్లా అని ప్రతి పరభాషా పదాన్ని తెలుగులో వాడమని కాదు. తెలుగులోలేని, తర్జుమా చేసినా భావ ప్రసారం చేయలేని పదాలను యథాతథంగా వాడుకోవచ్చు. ఉదాహరణకు 'Dredger' అనే ఒక తరహా ఓడను రాష్ట్రంలోని సముద్రతీరవాసులు, చదువుసంధ్యలులేని వారైనా, దాని తీరుతెన్నులు చూసి– "తవ్వోడ" అన్నారు. అది

తగినట్టుగా ఉంది. భావగర్జితమైన ఇలాంటి పదాలను మక్కీకిమక్కీగా వాడుకోవచ్చు. కాని అర్థచ్ఛాయలేకుండా రంగు, రుచి, వాసనలేని మాటకుమాట తర్జుమాచేసే పద్ధతి ఎంతమాత్రం సరైంది కాదు.

బ్రిటన్‌లో "పందికొక్కులు" లేవట. అందుచేత దానికి ఇంగ్లీషుపదం లేదు. వారికి పందులు ఉన్నాయి. ఎలుకలు ఉన్నాయి. కాబట్టి "పిగ్–లైక్–ర్యాట్" అని అనికూడా అనవచ్చు. కాని తెలుగు పందికొక్కును స్పష్టతకోసం "బ్యాండీకూట్" అన్నారు ఇంగ్లీషులో. ఇలాగే గ్రీక్, లాటిన్, హిబ్రూ, అరబ్, పర్శ్యన్, జర్మన్, జపనీస్, మాలే, డచ్, ఫ్రెంచి, సంస్కృతం ఇత్యాది ఎన్నో భాషల పదాలు ప్రవేశించి – ఇంగ్లీషు భాష సుసంపన్నమైంది. నిజానికి "కన్‌సైజ్ ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ' చూస్తే అందులో అసలు సిసలైన 'ఆంగ్లో – శాక్సన్'పదాలు ఒక శాతమైనా ఉండవు.

తెలుగులో సంస్కృతపదాలు ఎక్కువ. సంస్కృత పదాలు రాకుండా తెలుగు మాట్లాడాలంటే, ఇంగ్లీషు పదాలు రాకుండా తెలుగు మాట్లాడడమంత సులభం కాదు. మనభాషలో కలిసిపోయిన సంస్కృత పదాలు తెలుగు భాషావికాసానికి, నూతన భావాలను సుస్పష్టంగా తెలపడానికి ఎంతగానో ఉపకరిస్తున్నాయి.

ఇవ్వాళ్ళ తెలుగు కేవలం నిత్య వ్యవహారంలో, సాహిత్యంలో మాత్రమే కాకుండా విద్యారంగంలో స్నాతకోత్తర స్థాయి దాకా ప్రవేశ పెట్టిన కారణంగా అన్ని శాస్త్రాలు తెలుగులో బోధిస్తున్నారు. లోగడ ఎక్కువ సంఖ్యలో దిన, వార, మాసపత్రికలు, ఇటీవల తెలుగు టి.వి. ఛానళ్ళు పుట్టుకొని రావడంతో తెలుగువాడకం బాగా పెరిగిపోయింది.

ఈ దృష్ట్యా – యథాతథంగా సంస్కృతపదం తెలుగు వాడుకలోకి రావడంలో పేచీఏమీలేదు. అయితే వాటిని తత్సమాలుగా వాడుకున్న సందర్భంలో మాత్రం సంస్కృత భాషా నియమాలను పాటించడం అవసరం. అంటే మనం స్వీకరించిన పదం నామవాచకమా? విశేషణమా? మరి ఏమిటి? అన్నది గమనించి విచక్షణతో ప్రయోగించవలసి ఉంటుంది. సమాసం చేయవలసి వచ్చినప్పుడు అన్ని సంస్కృత పదాలేనా? లేదా సమాసం సంకరమైందా? ఒకవేళ సంధి ఏర్పడితే సంస్కృత వ్యాకరణ సూత్రప్రకారమే జరిగిందా? అన్నది ప్రధానం.

ఇటీవలి కాలంలో తెలుగు పత్రికలలో వందలసంఖ్యలో సంస్కృత భాషా పదాలు తప్పుగా వాడుతున్నారు. పత్రికలలో కనిపించే, ఎలక్ట్రానిక్ మీడియాలో వినిపించే ఈ అపప్రయోగాలే బాగా ప్రచారమై జనసామాన్యం నోళ్ళలో నానుతున్నాయి. తెలుగు మాట్లాడే అసంఖ్యాకులకు సంస్కృతం, ఆ భాషా వ్యాకరణం తెలియదు కాబట్టి తప్పులు దొర్లుతున్నాయి. వాటిని దిద్దుకునే ప్రయత్నం చేయకపోవడం వల్ల అవి అలాగే కొనసాగుతున్నాయి. ఇట్టి పదాలు ఎందుకు వాడకూడదో, ఎలా వాడాలో, అందులోని

పొరపాటు ఏమిటో సంస్కృత వ్యాకరణ రీత్యా వివరిస్తూ సుప్రసిద్ధ పాత్రికేయులు, బహుభాషా కోవిదులు తిరుమల రామచంద్ర 1996 లో "ఆంధ్రప్రభ" దినపత్రికలో ఏడాదికాలం "పలుకుబడి" శీర్షిక నిర్వహించారు. వారికి కేవలం సంస్కృతంలోనే కాకుండా ప్రాకృతం, హిందీ, కన్నడం, తమిళం, ఆంగ్లభాషలలో గాఢమైన ప్రవేశం ఉన్నందున పదచర్చ అర్థవంతంగా చేశారు.

1995 మే 20న ప్రారంభించి సరిగ్గా మళ్ళీ అదే తేదీవరకు వారంవారం తిరుమల రామచంద్ర ఈ శీర్షిక వ్రాశారు. ఇది ధారావాహికంగా ప్రచురించబడుతున్న సమయంలోనే "జర్నలిస్టుల సహకార ప్రచురణ సంఘాన్ని" ఏర్పాటు చేసి యువ జర్నలిస్టుల కోసం ప్రత్యేకింగా వృత్తిని మెరుగుపరుచుకునేందుకు ఉపకరించే గ్రంథాలు వెలువరించాలనే ఆలోచన వచ్చింది. ఈ ఆలోచనను సుప్రసిద్ధ చిత్రకారుడు బాపుకు తెలపడంతో వారు సృజనాత్మకమైన 'లోగో' చిత్రించి పంపారు. అప్పుడున్న సమాచారశాఖ కమీషనర్‌కు ఈ విషయం వివరించగానే తొలుదొలుత మేము ప్రచురించ సంకల్పించిన రెండు గ్రంథాలకు రెండు ప్రభుత్వ ప్రకటనలు మంజూరు చేశారు. తిరుమల రామచంద్ర 'పలుకుబడి'తోపాటు మరో సుప్రసిద్ధ జర్నలిస్టు జి. కృష్ణ అప్పుడు వ్రాస్తున్న 'కన్నవి–విన్నవి', 'అప్పుడు–ఇప్పుడు' ప్రచురించాలని ప్రతిపాదించాము. తన రెండు గ్రంథాలకు జి.కృష్ణ ముందుమాట కూడా వ్రాసిచ్చారు. 'కన్నవి–విన్నవి'కి ప్రముఖ చిత్రకారుడు చంద్ర ముఖచిత్రం కూడా వేసిచ్చారు. ఆ తర్వాత జి.యస్.వరదాచారి 'దిద్దుబాటు' శీర్షికన వ్రాస్తున్న వ్యాసాలు ప్రచురించాలనుకున్నాము.

ఈ ఆలోచన తొలిదశలో తిరుమల రామచంద్రను సంప్రదించినప్పుడు వెంటనే వారు ఆమోదం తెలపలేదు. ఆలోచించి చెబుతానన్నారు. దాదాపు నెలరోజులపాటు పని ఆగిపోయింది. ఆమధ్య కాలంలో నాకోసం వారు మా ఇంటికి ఫోను చేశారట. కాని ఎన్నిసార్లు ఫోను చేసినా 'ఈ నెంబరు తాత్కాలికముగా పనిచేయుటలేదు' అని జవాబు వచ్చిందని తిరుమల రామచంద్ర నాకు ఆ తర్వాత వ్రాసిన జాబులో తెలిపారు.

1997 జనవరి 8వ తేదీన నా పేరున అప్పుడు నేను పనిచేస్తున్న పత్రిక కార్యాలయానికి తిరుమల రామచంద్ర లేఖ వ్రాస్తూ – 'పలుకుబడి' గ్రంథాన్ని ప్రచురించడానికి ఆమోదం తెలిపారు. తాను ప్రస్తుతం మద్రాసువెళ్ళి పదిరోజుల తర్వాత తిరిగివస్తానని, జనవరి 20వ తేదీన ఇంటికి ఫోన్ చేస్తే మిగతా విషయాలు మాట్లాడుకుందామని వ్రాశారు.

ఆ తర్వాత ఎందుకోగాని, వారు చెప్పిన గడువుకు మద్రాసునుంచి వచ్చినట్టులేదు. వారు వచ్చాక నాకేదో వృత్తిపరమైన ఒత్తిడి పెరిగింది. 'జర్నలిస్టుల సహకార ప్రచురణ సంఘం' ప్రతిపాదన కేవలం ప్రతిపాదనగానే మిగిలిపోయింది.

2006లో అరవయ్యవపడిలో పడిన కొందరు జర్నలిస్టులం ఒక తాటిపైకొచ్చి "వయోధిక పాత్రికేయ సంఘం"గా ఏర్పడ్డాము. వృత్తిపరమైన ప్రయోజనాలు కాపాడుకోవాలనే లక్ష్యానికి ఊతమిస్తూ దాదాపు నూటా ఎనభై ఏండ్లకు పైబడిన ఘనచరిత్రగల తెలుగు పత్రికారంగాన్ని తీర్చిదిద్దిన మహనీయుల లఘు పరిచయాలతో కూడిన బృహత్ సచిత్ర గ్రంథాన్ని తెలుగు, ఇంగ్లీషు భాషలలో విజయవంతంగా వెలువరించాము. ఆ తర్వాత మరికొన్ని ప్రచురణలు తెచ్చాము.

ఈ క్రమంలో 2013 తిరుమల రామచంద్ర శతజయంతి రావడం సంభవించింది. వారి జన్మతిథి ప్రకారం ఈ జేష్ఠశుద్ధ చతుర్దశి జేష్ఠ నక్షత్రాన శతజయంతి ఉత్సవాలను ప్రారంభించి, వయోధిక పాత్రికేయ సంఘం "తిరుమల రామచంద్ర – శతజయంతి సంస్మృతి" సంచికను తెచ్చింది. పుస్తకరూపంగా రాని 'పలుకుబడి'ని ప్రస్తుతం మేము ప్రచురించాము. ఈ శీర్షికక్రింద వారు వ్రాసిన మొత్తం వ్యాసాల ప్రతులు లభించకపోవడంతో, దొరికినంత వరకు అచ్చువేశాము. ఈ శీర్షికను ప్రచురించిన పత్రికా కార్యాలయంలోను ఆనాటి పత్రికలు లేకపోవడం విచారకరం. దొరికినంత వరకు పుస్తకరూపంలో రాకపోతే అవికూడా కాలగర్భంలో కలిసిపోతాయనే భయంతో ఈ ప్రచురణ వెలువరిస్తున్నాము.

ఇందులో తిరుమల రామచంద్ర పత్రికలలో కనిపించే అపప్రయోగాలను ఆసక్తికరంగా కథలా చెప్పారు. అందుచేత అవి పాఠకుల మదిలో హత్తుకుపోయే విధంగా ఉన్నాయి. ఈ స్పష్ట భాషణం వల్ల పరిశోధన పారంగతుడైన తిరుమల రామచంద్ర ఎంతో నష్టపోయాడు. తప్పుఉంటే కుండబద్దలు కొట్టి చెప్పే వారితత్వం వల్ల 'తెలుగు భాషా చరిత్ర' రచన చేసిన ఆచార్య గంటి సోమయాజితో, 'తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వం నమూనా సంచిక' సిద్ధం చేసిన గిడుగు సీతాపతిలాంటి వారి ఆగ్రహానికి గురయ్యారు. అయితే లోకానికి ఎంత గొప్ప పండితులైనా – వారూ ఉప్పుకారం తింటారు కాబట్టి తప్పులను ఒప్పులుగా భావించే భజంత్రీలనే చేరదీస్తారనే నిజాన్ని మరోసారి ఇలా రుజువుచేశారు.

తెలుగు భాషా పండితులు, పరిశోధకులలో రుజుపథికుడైన తిరుమల రామచంద్ర సాధికారంగా చేసిన ఈ 'పలుకుబడి' వ్యాసాలలో ఏ అంశాన్నైనా నిష్కర్షగా, నిక్కముగా, అరటిపండు ఒలిచి చేతిలోపెట్టిన రీతిలో చెప్పారు.

సుప్రసిద్ధ సినీనటుడు, పూర్వముఖ్యమంత్రి ఎన్.టి.రామారావుకు స్పష్టంగా, తెలుగు నుడికారంతో సంభాషణలు చెబుతారని పేరు. కాని వారు నటించిన అనేక చలనచిత్రాలలో 'ప్రతిజ్ఞ' అనే మాటను 'ప్రతిగ్న' అని, 'జ్ఞానం'ను 'గ్నానం' అని పలకడం ఎవరైనా గమనించవచ్చు. భాషాజ్ఞానం గల ఎన్.టి.రామారావుకు అది తప్పని తెలిసి ఉ

ండవచ్చు. కాని వారికి "జ్ఞ" పలకదేమో! అందుచేత ఆ మాటను ఎప్పుడూ "గ్నా" గా ఉచ్ఛరించేవారు.

తిరుమల రామచంద్ర వాంగ్మూలం, వాంగ్మయం, వాంగ్మాల, వాగ్మౌక్తికాలు అని వ్రాయడం తప్పని 'పలుకుబడి'లోని ఒక వ్యాసంలో బల్లగుద్ది చెప్పారు. వాక్+మూలం అనేది రెండు పదాల సమాసం. సంస్కృత వ్యాకరణం ప్రకారం వాక్ అనే మాట ప్రక్కన మూలం అనే అనునాసికమైన మ ఉన్నప్పుడు వెనక ఉన్న కకారం అనునాసికమై పోతుంది. అంటే క వర్గంలోని అనునాసికమైన ఙ కారంగా మారుతుంది. అప్పుడు వాకౌ-వాఙ్+మూలం=వాఙ్మూలం, వాంఙ్మూలం అనే రూపం ఏర్పడుతుందని తెలిపారు. వాం+గ్+మూలం కాదు. గకారం వచ్చే ప్రసక్తే లేదు. అలాగే వాక్+మయం అనప్పుడు వాక్-ఙ్+మయం=వాంఙ్మయం, వాఙ్మయం అవుతుంది. వాక్+మాల=వాఙ్మాల అని, వాక్+మౌక్తికాలు=వాఙ్+మౌక్తికాలు-వాఙ్మౌక్తికాలు అవుతుందని వివరించారు.

మరొక వ్యాసంలో ఇష్టాగోష్ఠి కాదు ఇష్టగోష్ఠి అని సోదహరణంగా పేర్కొన్నారు. పత్రికా రంగంలో ఇన్‌ఫార్మల్ మీట్ అనే దానికి పర్యాయపదంగా ఇష్టాగోష్ఠిని యథాతథంగా వాడుతున్నారు. ఇష్టాగోష్ఠి అనే రెండు పదాలు కలిస్తే ఇష్టగోష్ఠి అవుతుంది కాని ఇష్టాగోష్ఠి కాదన్నారు. వాస్తవానికి ఇష్టాగోష్ఠి అనే పదంలో తప్పేమీ లేదు. అయితే ఇష్టాగోష్ఠి అంటే ఇష్టమైన గోష్ఠి అనే అర్థమే కాని ఇష్టులతో గోష్ఠి అనే అర్థం లేదు. నిజానికి ఇష్టాగోష్ఠి, ఇష్టగోష్ఠి అనే పదాలను సమయానుకూలంగా, సందర్భశుద్ధితో వాడవలసి ఉంటుందని హెచ్చరించారు.

తెలుగులో తత్సమపదాలు సంస్కృతం నుంచే కాక దాదాపు వెయ్యేండ్లు శాసనభాషగా ఉన్న ప్రాకృతం నుంచి కూడా వచ్చి చేరాయి. కొన్ని వందల పాళీ-శౌరసేన ప్రాకృతపదాలు తెలుగులో కలిసిపోయి తెలుగు పదాలనే ముద్ర వేస్తున్నాయి. ఉదాహరణకు సుంకరి, జూదరి, కమ్మరి, సొన్నారి లాంటి పదాలు. ఇలాగే ప్రాకృతం నుంచి లేఖకార శబ్దం తెలుగులో లేకరి అయిందనీ, వి ఉపసర్గలో విలేకరి అని కావచ్చునని తిరుమల రామచంద్ర అంటారు. మనకు అచ్చ తెనుగులో మహాప్రాణాలు లేవు కాబట్టి లేకరి అని ప్రాచీనమైనవాడుక. ప్రాకృతం నుంచి లేఖ+ఆర-లేఖర-లేఖర-లేఖరి అని గ్రహించినప్పుడు విలేఖరి అని వాడడం ప్రమాదభరితం కాదని తిరుమల రామచంద్ర అభిప్రాయపడ్డారు. అయితే ఈ విలేఖరిని బహువచనంగా వాడినప్పుడు విలేఖరులు అవుతుంది. అప్పుడు "ఖరులు" శబ్దం వల్ల ఇతర అర్థాలు తీసే అవకాశం ఉంటుంది. పైగా చెవికి ఇంపుగాను లేనందున విలేకరులని వాడడమే మంచిదని సుప్రసిద్ధ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు అభిప్రాయం. అందుచేత వారి సూచనే పాటిస్తున్నాము.

ఆంగ్ల ఉచ్చారణను, వ్రాతను భక్తిశ్రద్ధలతో పాటించడం వల్ల విచక్షణ లేకుండా భారతీయ భాషల పదాలను, ముఖ్యంగా వ్యక్తుల పేర్ల ఉచ్చారణలో, లేఖనంలో తప్పులు చేస్తున్నాము. ఇందుకు ఉదాహరణ సత్యజిత్‌రాయ్, సిద్ధార్థ శంకర్‌రాయ్‌ని మనం రే రే అంటున్నాం. ఆర్.ఎ.ఐ=రాయ్ అని భారతీయ ఉచ్చారణ. అలాగే– త్రివేది, దుబే, కృపలానీ, వాధ్వానీ, మాలానీ సరైన రూపాలు. అన్బళగన్ అంటే ప్రేమసుందరుడు. అంబలగన్ అనడం అపభ్రంశం. కన్నబిరాన్–కణ్ణాపీరాన్, కన్నాబిరాన్ అని అష్టావక్రమయింది. ఆగ్లం స్పెల్లింగ్ ఆధారంగా తెలుగులో వ్రాయడం వల్ల లాల్ క్రిషణ్ అడ్వాణీని అద్వాని అని, మోదీని మోడీ అని, దిల్లీని ఢిల్లి అని, హర్యాణాను, హర్యానా అని, ఠాణెను థానే అని, దెహ్రాదూన్‌ను డెహ్రాడూన్ అని, షికాగోను, చికాగో అని, టాగోర్‌ను ఠాగూర్ అని, అమితాభ్‌ను అమితాబ్ అని, రబ్డీదేవిని రబ్రీదేవి అని, శీలాదీక్షిత్‌ను షీలాదీక్షిత్ అని, కిరణ్ బేదీని కిరణ్ బేడి – ఇలా ఇంకా ఎన్నో పేర్లను తప్పుగా వ్రాస్తున్నారు.

అధ్వరయం అన్నా, ఆధ్వర్యమన్నా తప్పు. ఆధ్వర్యవం సరైనమాట. ఘనపాఠి అంటే గొప్ప వేదపండితుడు అని అర్థం. గొప్పవాడు, సమర్థుడు, నిపుణుడు అనే అర్థంలో వాడే ఆ పదాన్ని వాడవచ్చుకాని. వాడు పదిబుడ్లు లాగేసే ఘనాపాఠీ అని వ్యసనాలలో కూరుకుపోయినవారికి ప్రయోగించడం సరికాదు అన్నారు తిరుమల రామచంద్ర. ఈ మధ్య ఇంగ్లీషులో ఘనాపాఠి ఫలానా శర్మ అని ఇంగ్లీషు వార్తా ఏజెన్సీ కథనం చూసి–ఘనాపాఠికి ‘గణపతి’ ఫలానా శర్మ అని వ్రాసిన ఉదంతానికి ముక్కుపైన వేలువేసుకోవడం తప్ప మరేం చేయగలం.

విశేషణపదం విశేష్యపదం ప్రత్యేకతను తెలుపడమో, ప్రత్యేకతను ఆమోదించడమో చేయాలి. కేవలం విశేషణమైనా విశేష నామవాచకంతో అన్వయం కుదరాలి. లేదా ఆశించిన భావం రాదు. కాంగ్రెసును శక్తిమంతంగా, ధృడంగా చేయడం ఉద్దేశమైనప్పుడు ‘కాంగ్రెస్ పటిష్ఠానికి.” అన్న వాక్యం సాధువుకాదు. ఆ అర్థం రాదు. కాంగ్రెస్‌ను పటిష్ఠం చేయడానకి అనవచ్చు. అలాగే ‘కాంగ్రెసు బలోపేతానికి’ అనివాడడం కూడా తప్పే. ఇక్కడ కాంగ్రెసును బలోపేతం చేయడానికి అనో, కాంగ్రెస్ బలోపేతం కావడానికి అనో వ్రాయవచ్చునని ఉదహరించారు.

ఔత్సాహిక శబ్ద సాధుత్వా సాదుత్వాన్ని చర్చిస్తూ అమెచ్యూర్ అనే ఆంగ్ల పదానికి తర్జుమాగా ఔత్సాహిక అని వాడుతున్నారన్నారు. అమెచ్యూర్ అంటే అభిలాష, ఉత్సకుడు, ఆసక్తిగలవాడు అనే అర్థాలున్నాయి. కాని ఔత్సాహిక అనే అర్థం మాత్రం లేదు. నాటకాలలో నటించడం వృత్తి కాక, మరొక వృత్తిలో ఉంటూ కేవలం ఆసక్తితో, ప్రవృత్తితో నాటకాలలో నటించేవాడు అమెచ్యూర్. ఉత్సుకుడు అన్నా, ఉత్సాహి అన్నా, ఔత్సాహికుడు అన్నా

ఒకటే అనే భ్రాంతితో ఈ పొరపాటు జరిగి ఉంటుంది. మన రాష్ట్రంలో అర్ధ శతాబ్దం క్రితం ప్రముఖులుగా ఉన్న నటులంతా ఉత్సాహకులే అని ఆయన వివరించారు. ఉత్సాహ+ఇక=ఔత్సాహిక అనే రూపం ఏర్పడుతుంది. కాని దాని అర్థం ఉత్సాహానికి సంబంధించిన అనే. ఉత్సాహం కలవారు, ఉత్సాహవంతులు అనే అర్థం రాదు. అందుచేత ఉత్సాహవంతులు లేదా ఉత్సాహులు అని గాని, ఉత్సాహక నాటక సంఘాలు అని కాని అనవలసి ఉంటుందన్నారు.

మరొకవ్యాసంలో ఉచ్చారణ కొంత సన్నిహితంగా ఉండడం వల్ల, ఒకే వర్గంలోనివి కావడం వల్ల యథాలాభం–యథాలాపం ఒకటే అనుకుంటున్నారు. కాని అవి రెండూ వేరు వేరు అని, వాటిని తారుమారు చేయటం పొరపాటని, దేని అర్థం దానిదేనని ఆయన వివరించారు.

సమష్టి అని వాడడం సరైన ప్రయోగం. సమిష్టి అపశబ్దమని వేరొకవ్యాసంలో వివరించారు.

నిరశన–నిరసన అనే పదాల వాడకంలో నేటి పత్రికా రచయితలు తబ్బిబ్బై తారుమారుగా వ్రాస్తున్నారు. ఈ రెండు పదాల మూలధాతువులు వేరు. వాటిని బట్టి వాటి అర్థాలు వేరు. కాబట్టి ఒకదాని బదులుగా మరొక పదం వాడితే తప్పుడు అర్థం వస్తుంది. నిరశన అంటే ఆహారం లేకపోవడం, తిండిలేకపోవడం, తినకపోవడం అనే అర్థం. నిరసన అంటే కాదనడం, తోసివేయడం, నిరాకరించడం, ఒప్పుకోము అని గట్టిగా చెప్పడం అని అర్థం. ఈ దృష్ట్యా నిరశన–నిరసన పదాల అర్థంలో పోలిక లేదని తెలిపారు.

సునిశితం–సున్నితం పర్యాయపదాలనుకొని కొందరు రచయితలు ఇష్టారాజ్యంగా వాటిని వాడతారు. స్వరసామ్యం వల్ల మరికొందరు రెండింటికీ ఒకే అర్థం అనుకుంటారు. నిజానికి ఇవి రెండు విరుద్ధ భావాలు తెలిపే వేరు వేరు పదాలని ప్రయోగించి తిరుమల రామచంద్ర చూపారు. సునిశిత అంటే బాగా తీక్షణమైన, బాగా పదునెక్కిన అని అర్థం. శబ్ద రత్నాకరం కచ్చితము అని అర్థమిచ్చింది. కాని ప్రస్తుతం దీన్ని మృదువుగా, సుకుమారంగా అనే అర్థంలో వాడుతున్నాము.

దారుఢ్యంకాదు దార్ఢ్యమ్ అని వాడాలంటారు తిరుమల రామచంద్ర. సంస్కృత పదాల కొసనో, మధ్యనో మరొక అక్షరం దూర్చివాడడం పొరపాటని వారు పేర్కొన్నారు. సుప్రసిద్ధ కథారచయితలు, మహాపండితులు, చివరికి వాచకాలు వ్రాసేవారు సైతం దార్ఢ్యమ్ అని కాకుండా, విద్యార్థులు తమ దేహ దారుఢ్యం రక్షించుకోవడానికి అని వాడడం ఏమిటని వారు ప్రశ్నించారు.

ఉపాధ్యాయ– ఉపాధ్యాయిని అనే పదాల గురించి వివరిస్తూ 'ఉపాధ్యాయిని' సంస్కృత వ్యాకరణం ప్రకారం తప్పుకాదన్నారు కాని ఉపాధ్యాయురాలు అనే అర్థంలో వాడడం మాత్రం తప్పని చెప్పారు. ఉపాధ్యాయుని భార్యని ఉపాధ్యాయనీ అంటారు. స్వయంగా విద్య నేర్పే మహిళను ఉపాధ్యాయా, ఉపాధ్యాయీ అనాలి. ఉపాధ్యాయనీ, ఉపాధ్యాయి అనే పదాలకు ఉపాధ్యాయుని భార్య అనే అర్థం కూడా లేకపోలేదు. అందుచేత, స్పష్టతకోసం ఉపాధ్యాయ అని వాడడమే సరైందన్నారు. ఆచార్యుడి భార్యను ఆచార్యాణీ అంటారు. స్వయంగా బోధించే మహిళ అయితే ఆచార్య. తెలుగులో ఆచార్యురాలు. క్షత్రియ వంశంలో పుట్టిన స్త్రీ క్షత్రియాణీ, క్షత్రియ. క్షత్రియుని భార్యని క్షత్రియీ అంటారు.

తరచు తారుమారుగా వ్యవహరించే పదాల్లో నిర్దిష్టం – నిర్దుష్టం ఉన్నాయి. ఉచ్చారణలో చాలా దగ్గరగా ఉన్నందున ఈ పొరపాటు జరుగుతున్నది. నిర్దిష్ట అంటే ఫలానా, ఫలానా అని నిర్దుష్ట అంటే దుష్టం కానిది, దోషరహిత అని అర్థం.

షష్ఠమ సాధువుకాదు. షష్ఠ సాధురూపం. ఉధృతం కాదు ఉద్ధృతం సరైనపదం.

ఇష్ట అనేది సంస్కృత పదం కాబట్టి మధ్యలో తెలుగు ప్రత్యయం దూరడం అసహజం. కాబట్టి ఇష్టకు వ్యతిరేకపదం అనిష్టం కావాలి. కాని అయిష్టం అని వాడడం తప్పు అన్నారు.

ఇంగ్లీషు వ్యాకరణం ప్రకారం నేను, మేము ప్రథమ పురుషవాచకాలు. నీవు, మీరు ద్వితీయ పురుష (మధ్యమ పురుష) వాచకాలు. వాడు, వారు, అది, రాముడు, సీత తృతీయ పురుష వాచకాలు. ఇంగ్లీషు వ్యాకరణం ప్రకారం పూర్తిగా ఇవి తలకిందులు. లింగ విషయంలోను ఇలాంటి తప్పులు ఆంగ్ల, సంస్కృత వ్యాకరణ సంప్రదాయాల విభేదం వల్ల ఎన్నో వస్తున్నాయి. ఎంతగొప్ప రచయిత వ్రాసినా ఇలాంటి తప్పు తప్పే అన్నారు తిరుమల రామచంద్ర.

ఉవాచ, తిష్ఠ తెలుగు సంప్రదాయ విరుద్ధమైన ప్రయోగాలు. ఉవాచ అనేది భూతకాల వాచకమైన ప్రథమ పురుష ఏకవచన రూపం కాబట్టి నామవచకమనుకొని 'పరంధామయ్య ఉవాచ' అని, పరంధామయ్య కథనం అనే అర్థంలో వాడడం పొరపాటు. అలాగే తిష్ఠ అనేది మధ్యమ పురుష ఏకవచనరూపం. తెలుగులో ఉండు అనే అర్థంలో తిష్ఠ వాడుతున్నారు.

సమావేశం సమావేశస్థలం అనే అర్థంలో వాడే కూటము తెలుగుపదం. కాని కూటమి అంటున్నారు. అది తప్పు సంస్కృత కూట శబ్దానికి మిథ్య అయినది, అసత్యమైనది. కల్ల అయినది, కృత్రిమమైనది, కపటంగలది, నిందితం, తుచ్ఛం, అసత్యం, దంబం,

డాబు, మాయ, పాపం మొదలైన అర్థాలు కాబట్టి సమావేశం అనే అర్థంలో కూటమి వాడకూడదన్నారు.

పొద్దుగాల–తెలంగాణాలో బాగా ప్రాచుర్యంలో ఉన్న అందమైనమాట. దీనికి పొద్దుకలుగ అని అర్థం.

నిష్పూచీ అనే పదం సరైందికాదు. సంస్కృతోపసర్గమైన నిస్ అనే దానిని పూచీ అనే తెలుగు పదానికి అతికించడం వ్యాకరణ సంప్రదాయ విరుద్ధం. అలాగే పేచీ తెలుగుపదం కాబట్టి దానికి నిడ, నిస్ అనే సంస్కృత ఉపసర్గలు చేర్చి – నిష్పేచీ ని వాడడం సరికాదు.

శోభాస్కర అనే పదంపై చర్చిస్తూ– శోభా+కృత్+అ=శోభాకర అవుతుంది. శోభలో స కరమ్ లేనప్పుడు శోభాస్కరం అనే మాట ఎలా ఉత్పత్తి అవుతుందని మరో వ్యాసంలో తిరుమల రామచంద్ర ప్రశ్నించారు. శోధించేది, ప్రకాశించేది అనే అర్థంలో శోభాయమున వాడడం సరైంది కాదు. యమాన అనేది నిజమైనది కాకుండా, ఒకదానివలె కనిపించేది, ఒకదానివలె తోచేది, ఆచరించేది అనే అర్థాల్లో వస్తుంది. శోభయమాన అంటే శోభిస్తున్నది అనే అర్థం రావాలి. కాని శోభ వలె కనిపించేది అని కాదు కదా? అందుచేత శోభామాన అనడం ఉచితం.

జయంతి అంటే పెద్దల జన్మదినం అని రూఢి. వర్ధంతి అనే మాటను ఉత్తర భారతీయులు జయంతికి పర్యాయపదంగా వాడుతున్నారు. మనకు అంతకుముందుగానే జన్మదినానికి జయంతి ఉంది కాబట్టి మరణతిథికి వర్ధంతి అని వాడుతున్నాము.

చరిత్రకు సంబంధించిన అర్థంలో మనం వాడుతున్న చారిత్రక అనే పదం కన్నా చారిత్రక అనే పదం వ్యాకరణానికి దగ్గరిది.

సులభంగా, అలవోకగా అనే అర్థంలో కూసువిద్య ప్రయోగిస్తున్నాము. కూసుకన్నడపదం. అలాగే “అక్కుపక్షి” లోని అక్కు కూడా. అక్కు అంటే పక్షి అని అర్థం.

జగదంబను జగదాంబ అనడం పొరపాటు జగత్+అంబ=జగదంబ అవుతుంది. కాని జగదాంబ కాదు అన్నారు.

క్షమార్పణం కాదు క్షమాపణం అనాలి. రామార్పణం, అంటే రాముని కొరకు, కృష్ణార్పణం అంటే కృష్ణుని కొరకు అని చతుర్థీ తత్పురుషసమాసం. క్షమార్పణం అలాంటిదికాదు. ఇక్కడ క్షమను అర్పించడం కాదు. క్షమను అర్థించడం, క్షమాప్ ధాతువుపై

భావార్థకంలో ల్యూట్ ప్రత్యయం. అని అన-అణ అవుతుంది. క్షమాపణ అంటే క్షమించమని కోరడం. క్షమార్పణం తప్పు అన్నారు వారు.

ప్రదానం-ప్రధానం రెండు వేరువేరు పదాలు. కాబట్టి జాగరూకతతో పలకాలి, వ్రాయాలి. ప్రదానం అంటే బహుమతి ఇవ్వడం అని అర్థం. ప్రధానం అంటే కొన్ని ప్రాంతాల్లో వివాహ తాంబూలాలు పుచ్చుకోవడమని అర్థం. కొన్నిచోట్ల గర్భదానాన్ని ప్రధానం అని వ్యవహరిస్తారు. ప్రధాన అంటే ప్రథముడు, అతి ముఖ్యుడు, మూలపురుషుడు, రాజుగారి మొదటి సహచరుడు, ముఖ్యమైనది అని అర్థాలున్నాయి. ప్రధాన శబ్దంతో మన తెలుగువారు తృప్తిపడక నను ని చేసి ప్రధాని అంటున్నారు. అవధాని, రాజధానిలాగ. ప్రధాని అంటే సంస్కృత వ్యాకరణం ప్రకారం ప్రధానులు-ముఖ్యులు ఎందరో కలవాడు అనిఅర్థం. అతను ప్రధానమంత్రి కాదు. అతనిపైనో, కిందో ఎందరో ప్రధానులు ఉన్నవాడు అని అర్థం. ఏమైనా ప్రధాని అంటే ప్రధానమంత్రి అని మాత్రం అర్థం కాదు.

హత్య, హంతకుడు అనే పదాల ప్రయోగం తప్పు. అయినా గొర్రెదాటుగా వాటిని ప్రయోగిస్తున్నాము. హత్య అనే పదం హన అనే ధాతువునుంచి ఏర్పడింది. దానికి హింసించడం, వెళ్ళడం అనే అర్థాలున్నాయి. ఈ హత్య అనే పదాన్ని విడిగా వాడరాదని వ్యాకరణ నియమం. దీని వెనక ఒక సుబంత పదం ఉన్నప్పుడే హత్య అనే రూపం ఏర్పడుతుంది. ఉదాహరణకు, గోహత్య, బ్రహ్మహత్య, అశ్వహత్య హనస్తచ అని పాణిని సూత్రం. విడిగా ప్రయోగించాలంటే వధ అనాలి. అలాగే చంపేవాడు అనే అర్థంలో హంతకుడు అనే పదాన్ని తప్పుగా, విరివిగా వాడుతున్నారు. ఘాతకుడు అనవచ్చు. లేదా హంతృకుడు అనవచ్చు. బహుశా అంతక అనే పదం హంతకగా మారి ఉండవచ్చునని తిరుమల రామచంద్ర అభిప్రాయం.

తిరుమల రామచంద్ర 'పలుకుబడి' వ్యాసావళి అన్వీక్షిస్తే - పాత్రికేయుల రచనల్లోని తప్పులు చాలా వరకు కరతలామలకమయ్యాయి.

**- టి.ఉదయవర్లు,**

**సీనియర్ జర్నలిస్టు**

*

## యథాలాభం - యథాలాపం

యదృచ్ఛాలాభ సంతుష్టో

కృత్యాపి న నిబధ్యతే (4-22)

అప్రయత్నంగా తనంతతాను వచ్చే లాభంతో తృప్తి పొందినవాడు, శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతుడూ, జయాపజయాలు రెండింటిలోనూ సమానంగా - స్థిరంగా ఉండేవాడు కర్మలు చేస్తున్నా, ఎప్పుడూ వాటితో బద్ధుడుకాడు - అంటాడు గీతాచార్యుడు. ప్రతిదానికీ అంగలార్చడం పనికి రాదు, ప్రయత్నం చేయవలసిందే. ప్రయత్నం చేయకుండా ఏమీ దొరకదు. కాని, అదే యావతో ఏదీ చేయరాదు. అని దీని భావం.

ఈ యదృచ్ఛాలాభమే యథాలాభం, ఈ యథాలాభాన్ని యాదాలాబమని, యాదాలాభమని ఉచ్చరిస్తుంటారు, వ్రాస్తుంటారు, మహాప్రాణాలు ఉచ్చరిస్తే తమ ప్రాణాలే పోతాయనట్టుగా.

కాని, యథాలాభంవేరు, యథాలాపం వేరు, పభలు ఒకే వర్గంలోవి కావడమూ ఉచ్చారణ కొంత సన్నిహితంగా ఉండడమూ ఈ పొరపాటుకు కారణం. ఒకమాటకు మరొకమాట వాడితే అనర్థాలు కలుగుతాయిగదా! కనుక వీటి వ్యత్యాసాన్ని పరిశీలిద్దాం.

యథాలాభం అనే పదం యథా+లాభం అనే రెండు పదాలతో ఏర్పడినట్టిది. దొరికింది దొరికనట్టు, అనాయసంగా దొరికిన, అకస్మాత్తుగా సంభవించిన, కాలావశాత్తు, కాలక్రమాన సంభవించిన అనే అర్థాలు ఉన్నాయి దీనికి.

యథాలాభంలాగే యథాతథం = ఉన్నదున్నట్టు, యథార్థం = ఉన్న అర్థం ఉన్నట్టు అంటే ఎలాంటిమార్పూ, కల్తీ లేకుండా నిజమైన, యథావకాశ సమయాన్ని బట్టి, తీరికనుబట్టి - మొదలైన పదాలు ఏర్పడ్డాయి.

యథాలాభం అనే పదానికి, తనకు తానై కలిగిన, వచ్చిన, పొందిన లాభం అని అర్థం - అని స్పష్టమైంది కదా. కనుక యథాలాభంగా వచ్చింది అంటే, అప్రయత్నంగా, కాలక్రమాన, ఘటనాక్రమంలో లభించినట్టిది అని మరీ స్పష్టమైంది.

ఈ యథాలాభాన్ని యదాలాభంగా పలకడానికి కారణం తవర్గంలోని మరొక దవర్ణంతో ఉన్న యదా అనే అవ్యయం. దీని అర్థం ఎప్పుడు అని. యదాకదాచితే = ఎప్పుడో ఒకప్పుడు, యదానికామం = సంతోషపడినప్పుడు. యదాకదావా = ఎప్పుడైతే అప్పుడే – అనే అర్థాలలో ఈ యదాపదం వాడుకలో ఉంది.

ఈ యదాకు యథాకు భేదం తెలియకపోవడం వల్ల యథాలాభం అనే పదాన్ని యదాలాభం అనీ, యాదాలాభం అని, తమ ఈసడింపు తెలుపడానికి యాదాలాబంగా అని వాడుతారు. ఇది ఇంకా అపభ్రష్టమై యాదాలాపంగా అనీ రూపాంతరం చెందింది, ఉచ్చారణ తెలియని వారిలో.

నిజానికి యథాలాపం అనే పదమే లేదు. ఇది అర్థాంతరంగా వచ్చిందే, యథాలాభమనే పదం సాదృశ్యంతో తనుకుతానై వచ్చిన దానితో పడగలంగాని, తనకుతానై వచ్చిన మాటలు పడలేము గదా! యదాలాపమంటే తనకు తానై వచ్చిన మాట అనే అర్థం వస్తుందే కాని, సల్లాపసందర్భంగా, ప్రసంగవశాన అనే అర్థాలు లేవు. ఏ కోశకారుడూ ఉదాహరించలేదు.

కాని దీన్ని ఒక విధంగా సమర్థించవచ్చు. యదా+ఆలాపం = ఆలాపం ఎప్పుడు జరిగిందో అప్పుడు – అని అర్థం చెప్పవచ్చు. ఏమైనా, దానిని ప్రసంగవశాన, సంలాపవశాన అనే అర్థాలలో మార్పులు ప్రయోగించినట్టు కానము. అలాంటి ప్రయోగాలు లాభిస్తే శిరోధార్యాలే.

ఏమైనా, యథాలాభం యథాలాపం అనే పదాలు స్వతంత్రమైన రెండు పదాలు. వీటిని తారుమారుగా ప్రయోగించడం ఉచితంకాదు. ఏదో లాభించింది అనడానికి యథాలాపంగా లభించింది అని వాడడంగాని, యదాలాబమని, యాదాలాబమని ఊపిరితీసేసిగాని, తలపొడిగించి గాని వాడడం ఉచితం కాదని మనవి. యథాలాభం యథాలాభమే. దాని సాదృశ్యంతో వచ్చిన యథాలాపం యథాలాపమే. రెండూ ఒకటికాదు, విడివిడి పదాలు తారుమారూ చేయకండి.

## సమిష్టి కాదు – సమష్టి

నా చిన్నతనంలో చెట్టుకింది వకీళ్లు చాలామంది ఉండేవాళ్లు. వారు ధర్మశాస్త్రం బాగా తెలిసినవారే, కాని పరిపాలన వ్యవస్థలో కలిగిన మార్పుల వల్ల తాము చెప్పదలచిన

విషయాలను ఆధునిక భాషకు అనుగుణంగా మలచుకోడంలో పడరానిపాట్లు పడేవారు. సంకరపదాలు కల్పించేవారు. ఉన్న పదాలను మార్చేవారు. దానివల్ల విచిత్రమైన పదాలు, పదబంధాలు, భాష ఏర్పడేవి, మొదట్లో కొంత విడ్డూరమనిపించినా, ఇది పరిపాలన భాష, ఇది కోర్టు భాష, ఇది ఇంతేలే – అని సర్దుకోవలసి వచ్చేది.

అప్పుపత్రాలు, రాజీనామాపత్రం, వారసత్వం, సమిష్టిఖాతా, సమిష్టి కుటుంబం, భత్య ఖర్చులు, దస్తూరి, దస్కత్తు, ఖత్తు మొదలయిన పదాలు ఇలా మనభాషలో దూరినవే. ఖత్తు అంటే వ్రాత – దస్తఖత్తు = చేతివ్రాత.

కుదిరకలేని కత్తు మది

గూటిమిచాలని పొత్తుసుత్తెకున్

మెదుగని సత్తు ముక్కిడికి

మెచ్చులకిచ్చెడినత్తు...

అని ఒక చాటు కవి వెక్కిరించాడు. కుదిరికలేని ఖత్తు వ్రాత, మనస్సులో స్నేహం లేని మైత్రి, సుత్తెకు మెదుగని సీసం, ముక్కిడికి ఇచ్చే, నత్తు నిష్ప్రయోజనాలని. ఈ ఖత్తు క్రమంగా శైలి అనే అర్థంలోను కనిపిస్తుంది.

వారసుడు పారసీక భాషా సంప్రదాయం నుంచి వచ్చింది. వారిస్ వారసుడయింది కోర్టుల మూలంగా. కాటూరి వెంకటేశ్వర రావు గారంతటివారు మన వారసత్వం అని ఒక పుస్తకానికి శీర్షిక పెట్టారు. పారసీక భాషను నేను ఒకానొక ప్రాకృత భాషగానే భావిస్తాను గనుక ఔరస–వారిస–వారిస్ అయిందని సరిపెట్టుకోవచ్చు. ఇప్పుడు మన చర్చనీయ పదం సమిష్టి.

ఈ సమిష్టి పదం చెట్టుకింది ప్లీడర్ల ద్వారా సమిష్టి కుటుంబం, సమిష్టి ఆస్తి, సమిష్టి వ్యవహారం అని రకరకాలుగా వ్యవహారంలోకి వచ్చింది. అదేమిచిత్రమోగాని, లోకంలో అపశబ్దానికి, అపవాదులకు, అపప్రథకు ఉన్నంత వ్యాప్తి తక్కిన వాటికి ఉండదు. అపశబ్దాలు ఇట్టే వ్యాపించిపోతాయి.

సమష్టి అంటే ఉమ్మడి, మొత్తం, వినిగమనం, చేరడం, గ్రహించడం, గుంపు. ఈ పదంలో సమ్–అస్–తి అని మూడు భాగాలున్నాయి. సమ్ తర్వాత ఉండే అస్ లోని సకారం షకారమై దానివల్ల తర్వాతి తి టి అయి సమష్టి అనే రూపం ఏర్పడుతుంది.

ఇది సమస్త పదంవంటిదే. సమ్–అస్–త = అని సమస్తపదాన్ని విడదీసినట్టే సమష్టి పదాన్ని కూడ. సమస్త అనే పదానికి ఒకవైపు చేర్చిన, కలిసిన, కలిపిన, మొత్తం,

అంతా అనే అర్థాలు వున్నాయి. సమస్త అన్నా సమష్టి అన్నా వ్యాకరణ కార్యాలవల్ల వచ్చే మార్పులు తప్ప అర్థభేదం అంతగా లేదు.

ఈ సమస్తకు విరద్ధమయినపదం వ్యస్త. వి–అస్–త అని దీనిని విడదీయాలి. ముక్కలు ముక్కలుగా కోసిన, విడదీసిన, వేరయిన, భాగించిన మొదలయినవి దీని అర్థాలు.

ఇలాంటిదే వ్యష్టి. వి–అస్–తి. దీనికి చాటి, ప్రత్యేక, గుంపులోని ఒకటి, విడిగా ఉండేది అనే అర్థాలున్నాయి.

సమస్తకు సమష్టికి అర్థచ్ఛాయలు కొన్ని మారుతున్నట్టే వ్యస్తకు వ్యష్టికి కూడ కొన్ని అర్థచ్ఛాయలున్నాయి. కనుక ఏ విధంగానూ సమష్టిని సమిష్టి అని ఉచ్చరించడానికి ఆస్కారమేలేదు. కాని, ఈ సమష్టిని సమిష్టిగా మార్చి ఉచ్చరించడానికి భాషాశాస్త్రరీత్యా కొంత ఉపపత్తి చెప్పవచ్చు. ఒక పదం చివరి వర్ణం ఉచ్చారణను బట్టి వెనుకటి వర్ణం ఉచ్చారణ మార్పు చెందడం చాలా భాషలలో కనిపిస్తుంది. కనుక సమష్టి అనే పదం చివర ఇకార ఉచ్చారణ ప్రభావం వెనక ఉన్న మకారంపై 'మి' గా మారి సమిష్టి అయిందని సరిపెట్టుకోవచ్చు. కాని, ఇంత మాత్రాన సమష్టిని సమిష్టిగా పలుకడం ఉచితంకాదు.

సమస్తం, మొత్తం, గుంపుగా అనే అర్థంలో సమిష్టి పదం తప్పుగాని, 1) సమిష్టి అనే పదం లేకపోలేదు. కాని అర్థంవేరు. సమ్–ఇష్ట = కలిసి చేసిన యజ్ఞం, బాగా చేసిన యజ్ఞం అని ఈ పదం అర్థాలు. అలాగే సమ్–ఇష్టి = సంపూర్ణమైన యజ్ఞం, సంపూర్ణమైన హోమం. కనుక సమష్టివేరు సమిష్టివేరు. సమష్టి అనే పదానికి సమస్తం, పూర్తి, గుంపు అని అర్థాలు. సమిష్టి అనే పదానికి యజ్ఞం అని అర్థం.

ఇక ఈ సమష్టి, సమిష్టి పదాల విషయంలో ఎలాంటి సందేహాలు వుండవు, ఇంత చర్చ జరిగినమీదట. సమష్టి వ్యవసాయం, సమష్టి కుటుంబం, సమష్టి వ్యాపారం అనే వ్రాయండి, వాడండి, ఈ అర్థంలో సమిష్టి వ్యవసాయం, సమిష్టి వ్యాపారం, సమిష్టి కుటుంబం అని వాడకండి. మీ ఉద్దేశం యజ్ఞం గురించో, ఏ హోమం గురించో చెప్పడం అయినప్పుడు సమిష్టి అని వాడండి. మన ఉద్దేశం ఎదుటి వారికి స్పష్టంగా తెలుపడం ముఖ్యమయినప్పుడు, భాష, ఉచ్చారణ స్పష్టంగా ఉండాలిగదా! కనుక సరిగా వాడండి సార్.

## నిరశన – నిరసన

నా చిన్ననాడు ఆంధ్రప్రచారిణీ గ్రంథ మండలివారు కాబోలు, ప్రకటించిన 'భూతగృహం' అనే నవల చదివాను. దానిలో ఇద్దరు ప్రవాళుడు, ప్రశాండుడు అనేవారు అపరాధులు. వాళ్లు కవలలు. వాళ్ళ భార్యలే వాళ్ళను పోల్చుకోలేక పొరపాట్లు చేసేవారు. ఒకొకప్పుడు తీరా భ్రమపడి ప్రమాదం జరిగే సమయంలో తెప్పరిల్లు కొనేవారట.

'నిరశన – నిరసన' విషయంలోను నేటి పత్రికారచయితలు తబ్బిబ్బై తారుమారుగా ప్రయోగిస్తున్నారు. అలాగే ముఖ్యమంత్రి వైఖరికి ప్రతిపక్షాల నిరశన అని కొన్నాళ్ల క్రితం ఒక పత్రికలో ఒకవార్త శీర్షిక. నేను ఆత్రంతో శ్రద్ధగా వార్త చదివేసరికి అది నిరశన కాదు, నిరసన అని గ్రహించాను. మద్యపాన నిషేధం కోరుతూ ఆమరణ నిరసన వ్రతం – మరొక వార్త శీర్షిక. జీవితమంతా నిరసిస్తూ వుంటారా ఏమిటి? అని కుతూహలంతో చదువగా నిరశన వ్రతం అని తేలింది.

శీర్షికలో పడింది, ముద్రారాక్షసమై వుంటుందని సర్దుకుందామంటే, శీర్షిక కింది వార్తలో పదిసార్లూ ఆ పొరపాటే. అప్పుడది ముద్రారాక్షసం కాదు, లేఖక రాక్షసమని ధ్రువపరచుకోవలసి వస్తుంది. ఎవరికైనా, ఒకటి సరిఅనే అభిప్రాయం ఏర్పడిం తర్వాత దానిని తొలగించుకోడానికి చాల గుండె నిబ్బరం కావాలి, అంతకు ముందు నుంచి అలవాటయిన పని తప్పయినా ఒప్పుగానే అనుకొని చేస్తూ వుంటాము. అలాంటి అలవాటే ఈ నిరశన–నిరసనల విషయంలోను జరుగుతున్నది.

నిరశనవేరు, నిరసనవేరు. వీటి మూలధాతువులు వేరు, వాటిని బట్టి అర్థాలూవేరు. నిరశన అనే పదంలో నిర్–అశ్–అన అని మూడు భాగాలు ఉన్నవి. అశ్ధాతువుకు తినడం అని అర్థం. నిర్– నిషేధార్థకం. నిర్–అశ్–అన అంటే తిండిలేకపోవడం. నిర్–ఆహార అనే పదానికి ఏ అర్థమో, దీనికి అదే అర్థం. నిర్–అశ్–అనేది నిర్ అనే ఉపసర్గతో ఉన్న అశ్ధాతువుకు అన అనే ప్రత్యయం చేరితే, నిరశన అనే పదం ఏర్పడింది. ఆహారం లేకపోవడం, తిండి లేకపోవడం, తినకపోవడం అని దీని అర్థాలు.

అలాగే ఈ నిషేధార్థకమైన, వ్యతిరేకార్థకమైన నిర్ ఉపసర్గచేరిన పదాలు ఎన్నో ఉన్నాయి. మనం కల్పించుకోనూ వచ్చు. నిర్–అశ్వ = గుర్రంలేనివాడు, గుర్రంలేక, నిర్–అస్త్రం = నిరస్త్ర= అస్త్రం లేనివాడు, అస్త్రం లేక. నిర్–అహంకార = అహంకారం లేనివాడు, అహంకారంలేక. నిర్–మమ = మమకారం లేనివాడు, మమకారం లేక. ఇప్పటి పరిస్థితికి వస్తే, నిర్–ఉద్యోగ = ప్రయత్నం ఏమీ చేయనివాడు, అర్థాత్ ఉద్యోగం లేనివాడు. కనుక నిర్–అశనం = ఆహారం, తిండిలేక పోవడం.

ఇక వ్రత అనేపదం వృత్ అనే ధాతువునుంచి వచ్చింది. దీనికి తక్కిన అర్థాలతోపాటు, ఒక ప్రతిజ్ఞను నిర్వహించడం, ఆచారంగా అనుసరించడం అనే అర్థాలున్నాయి. నిరశనవ్రతం–తిండిలేకపోవడాన్ని తనకు ఇష్టమైనంత కాలం ప్రతిజ్ఞాపూర్వకంగా నిర్వహించడం. వ్రతం పవిత్రమైన కార్యం, ఉత్తమాదర్శాల సాధనకు పాటించే ప్రక్రియ ఏదైనా దురాచారాన్ని, వ్యసనాన్ని రూపుమాపడానికి తలపెట్టే కార్యం

కనుక నిరశన వ్రతం – మానవుని జీవనానికి మనుగడకు ఆధారమైన ఆహారాన్ని మానుకొని, గొప్ప ఆదర్శాన్ని, పలువురికి, సంఘానికి శ్రేయోదాయకమైన మహాకార్యాన్ని నిర్వర్తించడం.

నిరసనం వ్రతం కానక్కరలేదు. నిరసనం –నిర్–అస్–అన అనే మూడు భాగాలతో ఏర్పడిన పదం. అస్ అనే ధాతువుకు విసురు, తోసివేయు, ఒక లక్ష్యాన్ని గురిచూచి ప్రయోగించు, తోలు, భయపెట్టి తొలగించు అనే అర్థాలున్నాయి. నిర్ అనే ఉపసర్గకు పూర్తిగా అని అర్థం. నిర్–అసన=పూర్తిగా తోసివేయడం. ఒకరు చెప్పినదాన్ని తమ సిద్ధాంతానికో, ఇష్టానికో భిన్నంగా ఉన్నప్పుడు దానిని కాదనడం, తోసివేయడం, నిరాకరించడం, ఒప్పుకోము అని గట్టిగా చెప్పడం.

ఈ రెండు పదాలలోని శ సల స్థాన ప్రయత్నాలూ వేరు. శకారం స్థానం దవడ. అంటే, శ పలకడానికి నాలుక పక్కలను లోపలి దవడలకు ఆనించి ఊపిరి కొంత వదలవలసి వుంటుంది. ప్రయత్నించి చూడండి. స పలకడానికి నాలుక చివరను మడిచి అంగిటికి తాకించి కొంచెం ఊపిరి వదలవలసి వుంటుంది. దీనినే ప్రయత్నించండి. ఈ స్థానభేదం స్పష్టంగా తెలుసుకొన్నప్పుడు, నిరసన, నిరశనలకు గల ఉచ్చారణ భేదం స్పష్టమై, సందేహానికి ఎడమే ఉండదు. నిరశనమంటే–నిరాహారం, నిరసనమంటే నిరాకరించడం అని స్పష్టమైంది కదా!

ఆశక – అంటే తినేవాడు, ఆసక – అంటే తోసివేసేవాడు. నిరాశకుడు = మెతుకు కూడా మిగలకుండా భోంచేసేవాడు. నిరాసకుడు = తనకేమీ పట్టనట్టు తోసివేసేవాడు. యామునాచార్యులవారు తమ స్తోత్రరత్నంలో ఇలా ప్రార్థించాడు భగవంతుడిని.

నిరాసకస్యాపి నతావదుత్సహే
మహేశహాతుం తవపాద పంకజమ్,
రుషా నిరస్తోపి శిశుఃస్తనంధయో
నజాతు మాతు శ్చరణౌ జహాసతి.

ఓ మహేశా, నీవు నన్ను దుర్మార్గుడినని, పాపాత్ముడినని తోసివేసినాసరే. నీపాద పంకజాలు గట్టిగా పట్టుకున్నాను. వదలుకోదలచుకోలేదు. తల్లి, కోపంతో పాలు గుడిచే చంటిపిల్ల వాడిని తోసివేసినా, వాడు అమ్మ కాళ్లు పట్టుకునే వ్రేలాడుతాడు. కనుక నీవు నన్ను ఏమన్నాసరే నిన్ను వదలను.

# సునిశితం – సున్నితం

ఇద్దరు ప్రేమికులు ఒక పార్కులో ఒక మూలన ఏకాంతంలో ఉన్నారనుకుందాం. ప్రేమతుందిలమైన మనసులు ప్రేమోద్దీపకాలయిన పరిసరాలు. ప్రేమికుడు ఏదో ఛలోక్తి విసురుతాడు. ప్రేమికురాలు విరగబడినవ్వదు (విరగబడి నవ్వేకాలం ముందు ఉంది) సున్నితంగా నవ్వుతుంది. మరొక ఛలోక్తి విసురుతాడు ప్రేమికుడు, ఆ నవ్వును చూచి, సునిశితంగా చూస్తుంది ప్రేమికురాలు – వాడిగా వేడిగా చూస్తుంది. ఇది అప్పటి పరిస్థితి.

ఒక సుమారయిన రచయిత పాపం! సున్నితం అనే పదం సునిశితం అనే పదానికి పర్యాయం అనుకుని కాబోలు "అతని మాటకు ఆమె సునిశితంగా నవ్వింది". అని వర్ణించాడు. ఏమనందును? రచయిత స్వరసామ్యం కొంత ఉన్నపదాల అర్థభేదం గ్రహించక వాడితే ఎలా? తాను ప్రయోగించే పదం తన అభిమతాన్ని వ్యక్తపరుస్తుందా లేదా అనే విషయం రచయితకు తెలియాలి. తెలిసీ అలా ప్రయోగించాడంటే మరేదో ఉద్దేశం వుండాలి. దాని శ్లేషించడమో, విరచడమో చేయాలి. అవేమీ చేయకుండా అదే వాడితే ఎలా?

మన శరీరాంగాల చర్యలు వివిధంగా వుంటాయి. చూపు మన మనోభావాన్ని బట్టి చల్లగాను పడుతుంది, వేడిగాను పడుతుంది, నిశితంగాను పడుతుంది, మందంగాను పడుతుంది. నవ్వు సున్నితంగా విరుస్తుంది, నిశితంగా–అంటే వాడిగా పడదు. నవ్వు వ్యాపనశీలం. చూపు పతనశీలం. మనకు ఇష్టం లేని విషయం విన్నప్పుడో, కోపంతో ఉన్నప్పుడో అట్టహాసం చేసినా, అది వ్యాపనశీలమే. మనం కోపంగా ఉన్నప్పుడు తీవ్రంగా చూస్తాం, కాల్చివేసేట్టు చూస్తాం, పొడిచేట్టు చూస్తాం. చూపు కేంద్రీకృతమై పడుతుంది. నవ్వు విస్తరిస్తుంది, ముద్దగా పడదు. కనుక – సునిశితం, సున్నితం అనేవి రెండు విరుద్ధ భావాలు తెలిపే వేర్వేరు పదాలు. సునిశితం అనే పదంలో సు–ని–శి–తం అని నాలుగు భాగాలున్నాయి. సు,ని అనేవి ఉపసర్గలు శి ధాతువు. త ప్రత్యయం, శి,శీ అనే ధాతువుకు సానపట్టు, రాచు, లేపు, వాడి చేయు, పదునుచేయు, సన్నని, నీరసించిన, పలుచని తీక్షణం చేయు అనే అర్థాలున్నాయి.

సు–ని–శిత బాగా తీక్ష్ణమైన, బాగా పదునెక్కిన అని అర్థం. సునిశిత–ఆయుధం–వాడివాలు. మనం కోపంతో చూచినప్పుడు, కోపంలోని తీవ్రత, నిశితత్వం చూపులో చేరి కోపానికి గురి అయిన వాడిపై వాడిగా పడుతుంది. ఆ చూపు పడినవాడు తికమక అయిపోతాడు, ఎందుకు ఈ మహానుభావునికి కోపం కలిగింది. కోరచూపులు ఎందుకు–అని ఆలోచనలో పడుతాడు. నిశాత అన్న ఇదే అర్థం.

ఇక సున్నితం అనేపదం చూద్దాం. దీనికి శబ్దరత్నాకరం దే. వి=కచ్చితము అని అర్థమిచ్చింది. కాని, ఇప్పటి వ్యవహారంలో ఇది మృదువుగా, సుకుమారంగా అనే అర్థాలలో వుంది. ఆమె సున్నితంగా నవ్వింది, అతని మనస్సు చాలా సున్నితం వెన్నలోవెంట్రుక తీసినట్టు చాల సున్నితంగా మాట్లాడుతాడు. మనసు విషం, విషమంటే విషం–అని సౌకుమార్య సూచకంగానే ప్రయోగిస్తున్నారు.

సూర్యరాయాంధ్ర నిఘంటువులోను సున్నితం అనే పదానికి కచ్చితం అనే అర్థమే కనిపిస్తుంది.

శబ్దరత్నాకరం ఈ సున్నితం వైకృత విశేషమన్నదిగాని, దీనిపుట్టుపూర్వాలను తెలుపలేదు. ఇది సునీత అనే సంస్కృతపదం నుంచి పుట్టిందా అని అనుమానం కలుగుతుంది. సునీత అనే పదానికి తీసుకుపోబడిన, తీసుకురాబడిన, పొందిన, సరైన ప్రవర్తనగల, సరైన వినయంగల, ధాన్యం, సంపద మొదలయిన అర్థాలున్నాయి. సు–నీత అంటే ఇంకా చక్కని ప్రవర్తనగల, బాగా సరిపోయిన, అత్యంత వినయంగల అనే అర్థాలు చెప్పుకోవచ్చును.

సున్నితం అనేపదానికి తెలుగు నిఘంటువులలో కచ్చితం అనే అర్థం ఉ ండడాన్నిబట్టి, ఈ అర్థం సునీత అనే పదానికి ఉన్న సరిపోయిన, బాగా సరిపోయిన మొదలయిన అర్థాలకు సమానార్థం తెలుపుతున్నందున సునీత అనే పదమే సునీత–సున్నిత అనే రూపం దాల్చిందనిపిస్తుంది. ఇదికేవలం ఊహే. ఇంకా లోతుగా పరిశీలించాలి.

ఇంతగా జరిగిన చర్యనుబట్టి సున్నితం అనేది, సునిశితం అనేది వేరువేరని, పర్యాయాలు కావని, సునిశితంగా నవ్వింది అని అనడం, వ్రాయడం తప్పని, సున్నితంగా నవ్వింది అనడమే సహేతుకమని నిరూపితమైంది కదా!

మనకు సుతిమెత్తన అనేపదం నిఘంటువులకు ఎక్కనిది వ్యవహారంలోవుంది. అత్యంత మృదువు అని దీని అర్థం. అతని హృదయం సుతిమెత్తన=సుకుమారమైనది. అతడు సుతిమెత్తని మనిషి=సుకుమారుడు.

ఈ సుతిమెత్తనకుని, సున్నితంకు అర్థ సామ్యాన్ని బట్టి సంబంధం ఉందేమో చూడాలి. సుతిమెత్తనను సుసిమెత్తని అని కూడా కొందరు వ్యవహరిస్తున్నారు.

## దారుఢ్యం కాదు దార్ఢ్యమ్

పరంధామయ్య గారికి ఏడుపదులు పైబడినా ఆయన దేహదారుఢ్యం

చెక్కుచెదరలేదు – అని ఒక సుప్రసిద్ధ కథారచయితగారి పరంధామయ్య రంగ ప్రవేశం చేస్తాడు.

పిల్లల దేహదారుఢ్యానికి, తల్లుల దేహదారుఢ్యానికే మా యీ మందు పెట్టిందిపేరు – ఒక ఔషధ విక్రయశాల వ్యాపార ప్రకటన.

విద్యార్థులు తమ దేహ దారుఢ్యం రక్షించుకోవడానికి ప్రతిదినం వ్యాయామం చేయడం, క్రీడలలో ఉత్సాహంతో పాల్గొనడం చాలా ఆవశ్యకం – అని ఒక వాచకంలో వాక్యాలు.

ఈ దారుఢ్యం ఎక్కడినుంచి వచ్చింది? కొందరు ఇంగ్లీషు పదాలు వాడాలనే వ్యామోహంతో అరేంజ్‌మెంట్ అనడానికి అరణ్యామెంటు, ప్రెక్టికల్ అనడానికి మరొకటి ప్రయోగిస్తున్నట్టే సంస్కృత పదాలను కొసను నడుమను మరొక అక్షరం దూర్చి వాడుతుంటారు. ప్రాకృతంలో ఇలాంటిది సహజం. రత్నం అనే పదం ఉందనుకోండి. సామాన్య ప్రజలు దానిని యథాతథంగా పలుకలేక రతనం, రయణం అని అన్నారు. అది ప్రాకృత భాషావేత్తలు స్వీకరించారు. మనకు కూడా ఆ ప్రభావంతో రతనం, రతనాలు అనే ప్రయోగాలు కలిగాయి. కాని, సంస్కృత పదాన్ని యథారూపంగా వాడాలని మన పెద్దలు నియమం చేసుకున్నారు. ఆ నియమాన్ని పాటిస్తూ వస్తున్నారు. అందువల్ల దారుఢ్యం, తీక్షణం అనే రూపాలు పామరులు ఎలా వాడినా అంతగా పట్టించుకోము. సుప్రసిద్ధ కథకులు, మహాపండితులు, వేనకువేలు జీతాలు తీసుకొనే ప్రభుత్వ సమాచారశాఖ రచయితలు ఇలా వాడితే మనస్సు చివుక్కుమంటుంది.

దృఢ అనే పదం భావార్థకం దార్ఢ్యమ్. దీనికి పాకిడిని 'వర్ణదృఢాదిభ్యఃష్యఞ్చ' అని విడిగా సూత్రమే చేశారు. అంటే వర్ణ వాచకాలయిన శుక్ల మొదలయిన పదాలకు, దృఢ అనే పదానికి య అనే ప్రత్యయం కూడా వస్తుంది. తక్కిన ప్రత్యయాలు ఉండనే ఉన్నాయి. వర్ణవాచకమైన శుక్ల అనే పదం ఉందనుకోండి. దీనికి భావార్థకంలో శుక్లత్వం శుక్లతా అనే రూపాలు ఉండనే ఉన్నాయి. ఇమన్‌అనే ప్రత్యయంవల్ల శుక్ల–ఇమన్ శుక్లిమా అనే రూపం ఏర్పడుతుంది. పైన చెప్పిన సూత్రం వల్ల శుక్ల–య=శౌక్ల్యమ్ అనే రూపం ఏర్పడింది. అంటే శుక్లత్వ, శుక్ల–తా, శౌక్ల్యమ్–శుక్లిమా–అనే రూపాలు మొత్తం.

అలాగే మనకు ప్రస్తుతమైన దార్ఢ్య అనేపదం. దృఢ అంటే గట్టివాడు, బలంగా ఉన్నవాడు. దీని భావార్థకం దృఢ–త్వం, దృఢ–తా, దృఢ–ఇమన్=ద్రఢిమా. పై సూత్రం ప్రకారం దృఢ–య=దార్ఢ్యం, దార్ఢ్యమ్. దృఢలోని దృకు ఆదివృద్ధి వస్తే, దార్ ఢ అయి, యప్రత్యయం చేరి దార్ఢ్యం, దార్ఢ్యం అయింది. ఒక్క ప్రాకృత్యంలో తప్ప ఏ విధంగా

చూచినా దీని మధ్యన వున్న రేఫ రు కావడమనే ప్రసక్తిలేదు. దార్ఢ్యమే కాని దారుఢ్యం కాదు.

కృష్ణ అనే పదం తీసుకుందాం. ఈ పదానికి నల్లనిది అని అర్థం. దీని భావార్థకం కృష్ణ–త్వం, కృష్ణ–తా కార్ష్ణ్యమ్. పలుకడానికి కొంచెం కష్టంగా ఉంది కదూ! కనుకనే మధ్యన ఉచ్చారణ సౌకర్యంకోసం నానా అచ్చులూ చేరతాయి. పాత్ర, యాత్ర అనేపదాలు చూడండి. ఇళ్లల్లో ఆడువారు ఈ పదాలు పలుకలేక తమ సౌకర్యానికి మధ్యన మార్పు చేసుకుంటారు–పాత్రలు పాత్తర్లు అవుతాయి. మాత్రలు–మాత్తర్లు అవుతాయి. యాత్రలు–యాత్తర్లు అవుతాయి. అన్ని యాత్తర్లూ చేశామండి. ఒక్క నలుసూ పుట్టలేదండీ–అంగలారుస్తుంది పిల్లల కోసం తహతహలాడే ఒక ఇల్లాలు. డాక్టరు చెప్పిన అన్ని మాత్తర్లూ మింగానండి. ఫలితం లేదండి అంటాడు ఒక సద్యోరోగ ముముక్షువు. అంతేకాని పలుకడానికి కష్టంగా ఉందని కారుష్ణ్యమ్ అంటే కుదురదు. సంస్కృతపదాన్ని యథారీతిగా వాడాలనుకున్నప్పుడే సుమండీ ఇదంతా!

దృఢలాగే కృశ అనే పదం ఉందనుకోండి. కృశ అంటే, చిక్కిన, బక్కపలచని అని అర్థం. దీని భావార్థకం కృశ–త్వం, కృశ–తా, కార్‌శ్యమ్, కార్శ్యమ్, క్రశిమా. దారుఢ్యంలాగే కారుశ్యం అంటానంటే ఎలా? తప్పు వెంట మరొక తప్పా?

మృదు అనే శబ్దం ఉంది. దీని అర్థం సుకుమారమైన, మెత్తని అని. దీని భావార్థకం మృదు–త్వం, మృదు–తా, మార్‌దవం–మార్దవం, మ్రదిమా. నా నోరు తిరగదు మారుదవం అని అంటానంటే ఎలా? దారుఢ్యం లాంటిదే మారుదవం కూడ.

ఇన్ని ఉదాహరణలు చదివిన తర్వాత దారుఢ్యం అని వాడరని, దార్ఢ్యం అనే ప్రయోగిస్తారని నా సంపూర్ణ విశ్వాసం.

యువరచయితలారా, నవకథకులారా, మీ భావాలు భూమి వేగంతో గంటకు వేయిమైళ్ల ప్రకారం పరుగిడుతుంటాయి. వాటికి అనుగుణంగా, వాటిని ప్రజలకు, మీ ప్రజలకు తెలుపడానికి సమర్థమైన భాషను, చక్కని, అపభ్రష్టం కాని భాషను సమకూర్చుకోండి. తెలియక తప్పులు వ్రాయవద్దు, తెలిసి తప్పులు చేయవద్దు. పదిమంది నోట్లో పడితే అదే సాధువవుతుందని మొండికెత్తడం భ్రమ. అసాధువు సాధువు కాదు. అసాధువులన్నీ ఒక వర్గం కావచ్చు అప్పుడు సత్ప్రయోగానికి దూరమవుతుంది.

## భయం, భారం, బాధ్యత

నాకు పూర్వం కొందరు పంజాబీ మిత్రులుండేవారు. వారు నన్ను ప్రాజీ, ప్రాయీ

అని పిలిచేవారు. ప్రా అనేది సోదరవాచకమయిన భ్రాతా అనే సంస్కృతపదం వికృతి. ఇతర ఉత్తర భారత భాషలలో ఇది భాఈ, భాయిరా, బిరాదర్ ఇలా రకరకాలుగా మారింది. నా పంజాబీమిత్రులు వ్రాసేటప్పుడు భ్రాజీ అని వ్రాసేవారు. పిలిచేటప్పుడు, పలికేటప్పుడు ప్రాజీ అని పాకు ప ఒత్తు ఇచ్చి క్రావడి చుట్టేవారు. ఈ వైరుధ్యం ఏమిటో నాకు అర్థం అయ్యేదికాదు. వాళ్లే హిందీలో మాట్లాడేటప్పుడో, హిందీలో సంబోధించేటప్పుడో భాయీ, బాయీజీ, భయ్యాజీ అని మహాప్రాణంతో-భానుబాగా పలికేవారు.

అల్పప్రాణాలూ, మహా ప్రాణాలు ఉచ్చరించేటప్పుడు వాగ్వ్యాపారాన్ని పరిశీలించండి. క అని పలికేటప్పుడు జిహ్వామూలాన్ని నాలుక మొదలును అంగిలికి అదుముతాము. ఖ పలికేటప్పుడు అంగిలిని అదుమడంతోపాటు నోరు కొద్దిగా తెరిచి గాలి వదులుతాము. అలాగే ప అనే అక్షరం పలికేటప్పుడు రెండు పెదవులను అదిమి వదులుతాము. ఫ పలికేటప్పుడు పెదవులు అదిమి కొద్దిగా నోరు తెరిచి గాలి వదులుతాము. అలాగే త,థ,ద,ధ,బ,భల ఉచ్చారణ విషయంలోను.

ఈ సంగతి పరిశీలించక మన వారు కూడ కొందరు భయం అనడానికి మారు బయం, బయ్యం అని పలుకుతారు పంజాబీలలాగ. ఒక భేదం. వారు మొదటి అక్షరాన్ని ఒత్తి పలికితే, వీరు బను భ గా పలకడానికి మారు య కు య ఒత్తు ఇచ్చి బయ్యం అంటారు. ఇక భారం, బరువు, బాధ బాధ్యత ప్రధానం, ప్రదానం వంటి పదాల ఉచ్ఛారణలో పడే బాధ చెప్పతరం కాదు.

"ప్రజల భరువు బారాలు మోయడం మా భాద్యత" అంటాడు ఒక ప్రజానాయకుడు. ఒక రాష్ట్ర సాహిత్య సంస్థ అధ్యక్షుడుగా ఉన్న ఒక పెద్దమనిషి నాకు చాలా భాదగా ఉంది నేటి సాహిత్య ధుస్తితి చూచి" అని ప్రసంగిస్తున్నప్పుడు తలవంచుకొని వినవలసివచ్చేది.

బరువు అనేది తెలుగుపదం. భరువు కాదు. భారం అనేది సంస్కృతపదం. ఇది భృ అనే ధాతువు నుంచి ఏర్పడింది. భర-భార అనే పదాలకు మోత, బరువు, అలసట, శ్రమ, మోపిన పని మొదలయిన అర్థాలున్నాయి. ఇది భర, భార అనేకాని బారం కాదు.

మన ప్రతి నాయకుడూ, వినాయకుడూ భాద్యత అని ప్రసంగించేవాడే. బాధ్ అనే ధాతువు నుంచి పుట్టిన పదమిది. బాధ=కష్టం, ఒత్తిడి. బాధ్-ఇత-బాధిత=బాధింపబడినవాడు, ఒత్తిడి చేయబడినవాడు. బాధ్-య-బాధ్య=బాధింపదగినవాడు, ఒత్తిడి చేయదగినవాడు. ఈ బాధ్యుని భావం,

లేక పని బాధ్యత. బాధ్ ధాతువు నుంచి వచ్చిన పదం ఇది. కాని, భాద్ ధాతువునుంచి కాదు. కనుక బాధ్య-తా=ఒకరికష్టాన్ని, బరువును, పూచీని పైనవేసుకోడం బాధ్యత. అలాగే బాధేకాని, భాదకాదు.

చాలామంది ప్రధాన, ప్రదాన పదాల వ్యత్యాసం తెలీకుండా వాడుతుంటారు. ఈ రెండూ వేరువేరుపదాలు, వేరువేరు ధాతువుల నుంచి ఏర్పడినట్టివి. ప్రదానం అనే పదంలో ప్ర అనేది ఉపసర్గ దానం. దా అనే ధాతువు నుంచి ఏర్పడింది. ఇచ్చు, బహుమతి, అనుదానం (గ్రాంట్) మొదలైన అర్థాలు దీనికి ఉన్నాయి. ప్రదానక, ప్రదానిక, ప్రదాత, ప్రదత్త మొదలైన పెక్కుపదాలు ప్రత్యయాల మార్పుతో ఏర్పడుతాయి.

ప్ర-ధాన అనే పదంలో ప్ర-ధా-అన అనే మూడు భాగాలున్నాయి. ముఖ్యుడు, ముఖ్యమైన, మొదటి, మొదలయిన దీని అర్థాలు. ధా అనే ధాతువు నుంచి ఇది ఏర్పడింది. ఈ ధాతువుకు ఉంచు, ఆవహింపజేయు, పైనవేయు మొదలయిన అర్థాలున్నాయి. ప్రధానుడు, ముఖ్యుడు. పదుగురిలో మొదటివాడు. దీనిపైన ప్రధానతః ప్రధాన తమ, ప్రధానతర మొదలయిన ఎన్నో పదాలు ఏర్పడుతాయి. సభికుడంటే జూదమాడే వాడనే మొదటి అర్థం. ప్రధాన సభికుడంటే జూదరులలో ముఖ్యుడన్నమాట. క్రమంగా ఈ పదం సామాజికులు అని అర్థంలో వ్యవహారంలోకి వచ్చింది.

భయ శబ్దం భీ అనే ధాతువు నుంచి ఏర్పడింది, దిగులు, పిరికితనం, గాభరా మున్నగునవి దీని అర్థాలు. భయం అని పలకాలే గాని, బయం అని కాని, బయ్యం అని కాని పలుకకండి. ఈ భయం అనే పదం మీద ఎన్నో తమాషా పదాలు ఏర్పడ్డాయి. భయంకర, భయానక = భయం కలిగించేది. భయదాన=భయంతోనో, ఏదో అపాయ శంకతోనో చేసేదానం. భయచౌర్య=భయంతో, ఉపాయశంకతో చేసే దొంగతనం.

అభయం భయానికి వ్యతిరేకపదం. అభయం అంటే భయరాహిత్యం. పూర్వం రాజులను ఏవ్యక్తి అయినా ప్రాణాపాయంతోనో ఏదో తప్పుచేసో తమను ఆశ్రయించేవారికి అభయం ఇచ్చేవారు. అంటే, నీకు భయంలేదు. నేను రక్షిస్తాను, నిశ్చింతగా ఉండు అని ధైర్యం చెప్పేవారు. శరణాగతులు నిజంగానే తప్పుచేసినవారైనా వారిని రక్షించడం గృహస్థ ధర్మం, ముఖ్యంగా రాజు ధర్మం అనేది పూర్వ సంప్రదాయం. దీనిని అనుసరించే రాముడు శరణాగతులైన సుగ్రీవునికి, విభీషణునికి బాసటగా నిలిచాడని రామాయణ కథ.

ప్రధాన, ప్రదాన, భార, బరువు, బాధ్యత, బయ అనే పదాల పుట్టుపూర్వాలు మీకిప్పుడు కరతలామలకమై ఉండాలి. కనుక వీటిని తప్పుగా వాడరని నా విశ్వాసం.

# ఉపాధ్యాయ – ఉపాధ్యాయిని

నా పరిచితురాలు ఒకామె ఇటీవల కనబడింది. కుశల ప్రశ్నల తర్వాత "ఏం చేస్తున్నావమ్మా?" అని అడిగాను. "ఉపాధ్యాయినిగా ఉన్నానండీ" అని అన్నది. "ఉపాధ్యాయినా? ఎందరు ఉపాధ్యాయులు? ఒకరా? అంతకన్నా ఎక్కువమందేనా?" అని ప్రశ్నించాను.

ఆమె కొంచెం కంగారుపడింది, నా ప్రశ్న అర్థం కాక. ముఖం ఎర్రబడింది. "ఏమిటో జోక్ చేస్తున్నారు. మీ ప్రశ్న అర్థం కాలా? నాకేదో అపార్థం తోచింది" అని అన్నది.

"అపార్థమేముందమ్మా? ఉపాధ్యాయినిగా ఉన్నానన్నావు. ఉపాధ్యాయుడుగాని, ఉపాధ్యాయులుగాని ఉన్నది ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయకి, అధవా ఉపాధ్యాయాః, అస్తి అధవాసం అస్యా ఇతి ఉపాధ్యాయిని. సంస్కృత వ్యాకరణం ప్రకారం ఇదీ ప్రక్రియ. నేను పాతవాణ్ణి గదా! ఆ విధంగా అడిగాను" అన్నాను.

ఆమె ముఖం మీది ఎరుపు తగ్గింది, క్షణం ఆలోచించి విరగబడి నవ్వింది". నిజంగా మంచి జోకేనండి. ఉపాధ్యాయిని అనే మాటకు ఈ అర్థం ఉందని నాకు తెలియదు. జనమంతా వాడుతుంది. నేనూ వాడాను, ఇంత తప్పయిన పదం జనంలో ఇంతగా ఎలా వ్యవహారానికి వచ్చింది మరి?" అని ప్రశ్నించింది.

"అదే నిజంగా తమాషా. తప్పులు ప్రచారమయినంత త్వరగా ఒప్పులు ప్రచారం కావు. అసత్యం ఆకర్షణీయమైనంతగా సత్యం ఆకర్షణీయంకాదు. ఇది లోక సహజం నీ తప్పుగాదు. "మహామహా వాళ్లే శబ్ద స్వరూపమేమిటనే జ్ఞానం లేకుండా వ్యవహరిస్తున్నప్పుడు నీవు తప్పుచేయడంలో ఆశ్చర్యమేముంది?"అన్నాను.

'అయితే, సరైన ప్రయోగం ఏమిటో చెబుదురూ? ఇకనుంచైనా సరిగా ప్రయోగిస్తాను. లోకోద్ధరణ నాపని కాదుగాని, నావరకు నేనయినా సరిగా ప్రయోగించడం, వ్యవహరించడం నేర్చుకుంటాను' అన్నది ఆమె. నేనన్నాను ఉపాధ్యాయిని అనేమాట సంస్కృత వ్యాకరణం ప్రకారం తప్పుకాదు. కాని ఉపాధ్యాయురాలు అనే అర్థంలో వాడడం మాత్రం తప్పు, వక్త ఉద్దేశం స్పష్టపరచదు గనుక.

ఉపాధ్యాయుని భార్య ఉపాధ్యాయ+ఆన+ఈ ఉపాధ్యాయనీ. అలాగే మాతులానీ, అంటే మేనమామ భార్య. మాతుల+ఆన+ఈ = మాతులానీ. అలాగే ఆచార్యుని భార్య ఆచార్యాణీ ఆచార్య+ఆన+ఈ+ణీ=ఆచార్యాణీ.

మరి స్వయంగా విద్య నేర్పుతున్న మహిళను ఏమని వ్యవహరించాలి? ఉపాధ్యాయా, ఉపాధ్యాయీ అని వ్యవహరించాలి. అలాగే ఆచార్య+ఆ= ఆచార్యా. స్వయంగా బోధించే మహిళ ఆచార్య. తెలుగులో ఆచార్యు+ఆలు ఆచార్యురాలు. అందువల్లనే అమరసింహుడు

"ఉపాధ్యాయాత్యుపాధ్యాయీ

సాదాచార్యా పి చ స్వతః

ఆచార్యాణీతు పుంయోగే

స్వాదర్యీ క్షత్రియీ తథా"

అని స్పష్టపరచాడు. ఆర్యాణీ, ఆర్యీ=ఆ వంశంలో పుట్టిన మహిళ అయితే ఆర్యుని భార్య=ఆర్యీ, క్షత్రియ వంశంలో పుట్టింది క్షత్రియాణీ, క్షత్రియా కాని క్షత్రియుని భార్య క్షత్రియీ.

కాని, ఉపాధ్యాయీ అనే పదానికి ఉపాధ్యాయుని భార్య అనే అర్థం కూడా ఉ ంది. కనుక స్వయంగా బోధించే ఉపాధ్యాయురాలు కావచ్చు, ఉపాధ్యాయుని భార్య కూడా కావచ్చు. కనుక స్పష్టంగా ఉండడం కోసం ఉపాధ్యాయా, ఉపాధ్యాయ అని వాడడమే మంచిది. పాణిని కాలానికి ఇంద్రాణీ, ఆచార్యాణీ మొదలయిన పదాలు ఆచార్య, ఇంద్ర అనే పుంలింగ పదాలకు స్త్రీవాచకాలుగా వ్యవహారంలో ఉండి ఉంటాయి. కనుక ఆయా పదాలకు ఆన అనే ప్రత్యయం, తర్వాత ఈ ప్రత్యయం వచ్చి ఇంద్రాణీ, వరుణానీ, భవానీ శర్వాణీ, రుద్రాణీ, మృడానీ, మాతులానీ, ఆచార్యాణీ అవుతాయని సూత్రీకరించాడు.

తర్వాత కొంతకాలానికి ఉపాధ్యాయానీ, ఉపాధ్యాయా, ఉపాధ్యాయీ మాతులీ అనే పదాలు వ్యవహారంలోకి వచ్చి వుంటాయి. వాటిని కాత్యాయనుడు సమర్థించి కొన్ని సూత్రాలు చేశాడు. ఇతని సూత్రాలను వార్తికాలు అని అంటారు. అప్పుడు ఉపాధ్యాయానీ అంటేను, ఉపాధ్యాయీ అంటేను ఉపాధ్యాయుని భార్య. స్వయంగా అధ్యాపనం చేసే మహిళను ఉపాధ్యాయా అని అనమన్నాడు.

అలాగే మాతులీపదంకూడ. ఇది తర్వాత వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది. కనుకనే కాత్యాయనుని వార్తికం ప్రకారం సాధువయింది ఈ పదం. అందువల్ల మాతులానీ, మాతులీ అని రెండు రూపాలు.

ఇప్పుడు ఉపాధ్యాయ అనేపదం ప్రయోగంలో సందేహాలు ఉండవుగదా! ఉపాధ్యాయా – ఉపాధ్యాయ=స్వయంగా పాఠాలు చెప్పే మహిళ, అధ్యాపకురాలు.

ఉపాధ్యాయానీ, ఉపాధ్యాయీ=ఉపాధ్యాయుని భార్య. ఆమెకు చదువురావచ్చు, రాకపోవచ్చు. గురువుగారి భార్య అంతే. ఆవిడే స్వయంగా గురువుగారి ఆజ్ఞతోగాని, స్వతంత్రంగా గాని పాఠాలు చెప్పడం ప్రారంభిస్తుందనుకోండి. అప్పుడు ఆమె హోదా గురువుగారి భార్య కావడంతోపాటు స్వయంగా పాఠాలు చెప్పే ఉపాధ్యాయగా కూడా పెరుగుతుంది. కనుక ఉపాధ్యాయ అనండి, ఉపాధ్యాయిని అన్నారనుకోండి. ఉ పాధ్యాయులు కలది అనే అపార్థం వచ్చి, తగాదాలకు కారణమవుతుంది.

కాని, ఒక సంగతి. ప్రస్తుతం విద్య వ్యాపారమయి, కోళ్ల పరిశ్రమకు మారుబడి పెట్టుకొని, వ్యాపారం చేసేవాళ్లు ఉన్నారు. వారికి అకాడమీ ప్రెసిడెంట్లని, కరెస్పాండెంట్లు అని, సెక్రెటరీలు అని రకరకాల నామధేయాలు. వారికి చదువురానక్కరలేదు. వ్యాపారసాపారాల కిటుకు తెలిస్తే చాలు. అలాంటివారు కొందరు ఉపాధ్యాయులను నియమించుకొంటారు. అలా నియమించుకొనే వారిలో మహిళలు కూడా ఉన్నారు. వారు విద్యా సంస్థలను నిర్వహిస్తున్నారు. అలాంటి మహిళను ఉపాధ్యాయిని అని అనవచ్చు. అంటే ఉపాధ్యాయులు కలది = ఉపాధ్యాయిని.

## <u>నిర్దిష్టం - నిర్దుష్టం</u>

కొందరు-ముఖ్యంగా రాజకీయాలే జీవితంగా ఉన్నవారు తరచు తారుమారుగా వ్యవహరించే పదాలలో రెండు నిర్దిష్ట-నిర్దుష్ట అనేవి. ఈ పదాలు రెండూ ఉచ్చారణలో చాలా దగ్గరివి. కనుక మహోద్రేకంతో, ప్రసంగించేటప్పుడు ఈ రెండు పదాలనూ తారుమారుగా వాడుతుంటారు. ప్రజా నాయకుడొకడు కొన్నేళ్ల క్రితం ఎన్నికల ప్రచార సభలో ప్రసంగిస్తూ "నిర్దిష్టమైన ఆరోపణలతో నావద్దకురండి అవి నిరూపితమైతే రాజకీయాలనుంచి విరమిస్తాను" అని గర్జించాడు. ఆరోపణలంటేనే దుష్టమయినవికదా! ఇక నిర్దిష్టమైనవంటే ఏమిటి? అని కొంచెం భాషా పరిజ్ఞానం వున్నవారు తలగోక్కున్నారు. ఆయన ఉద్దేశం నిర్దుష్టమైన - ఫలానా, ఫలానా అని అయి వుంటుందని సర్దుకున్నారు. సర్దుబాటు అనేది భారతీయుల రక్తంలోనే నిండిపోయింది. ఇంతకూ ఎన్నికల సభలో "అయ్యా! మీ భాష అర్థంకావడం లేదు, మీ భావం స్పష్టంకావడం లేదు" అని ఎవరైనా అని బతగ్గలడా?

"మీ నియోజక వర్గానికి కావలసిన పథకాలు నిర్దుష్టంగా తెలుపండి, వెంటనే మంజూరు చేయిస్తాను" అంటాడొక మంత్రివర్యుడు. ఈ మంత్రివర్యుని ఉద్దేశమూ కచ్చితంగా ఏది ముఖ్యం అని తెలుపండి అనే.

"నీ రచన నిర్దిష్టంగా ఉంది. ఇలాగే కొనసాగించు రాణిస్తావు" అని ఒక సంపాదకుడు ఒక రచయితకు సలహాయిచ్చాడు. కొన్ని దశాబ్దాల క్రితం ఆ రచయిత "ఇదేమిటి సార్! మీ ఎడిటర్‌గారు ఇలా వ్రాశారు?" అని నా వద్దకు వచ్చి అడిగాడు. "తప్పేముంది? మీరు ఏ విషయాన్నైనా నిర్దేశించి వ్రాశారేమో! అన్నాను, "లేదండీ నా రచన నమూనా చూపాను అంతే" అన్నాడు రచయిత. "అయితే, ఆయన ఉద్దేశం నిర్దుష్టం దోషరహితం అని అయివుంటుంది" అని సర్దిచెప్పాను.

నిర్దుష్టమయిన ప్రణాళిక-అంటే తప్పేమిటని ప్రశ్నిస్తారు గదూ! ప్రణాళిక దోషరహితం అని చెప్పేవారి ఉద్దేశమయినప్పుడు తప్పులేదు. కాని, ఫలానా అని ప్రత్యేకంగా పేర్కొనదగిన అని చెప్పడం ఉద్దేశమయినప్పుడు, ఆ భావం తెలుపదు గనుక తప్పు, పదం, పదార్థం తప్పుకాదు. మరొక సన్నివేశంలో ప్రయోగించడం అతకని సన్నివేశానికి అతికించడం తప్పు.

ఉచ్చారణ సామీప్యం గల ఈ రెండు పదాలూ పూర్తిగా వేరువేరు కుదుళ్లని, వేరువేరు అర్థాలు కలవి. నిర్దిష్ట అనేపదం దిశ్ అనే ధాతువు నుంచి పుట్టినట్టిది. నిర్+దిస్+త=నిర్దిష్టం. చూపబడిన, చెప్పబడిన, సూచించబడిన, నిర్వచింపబడిన, ఫలానా అని చూపబడిన, పేరుతో పేర్కొనబడిన, అదే అని చూపబడిన, పరిగణింపబడిన, ప్రకటించబడిన, ఘోషింపబడిన, కాగలదన్న, ఉపదేశించబడిన, సిఫార్సు చేయబడిన, ముందుగా చెప్పబడిన మొదలయిన అర్థాలున్నాయి ఈ పదానికి.

ఈ నిర్ పూర్వక దిశ్ ధాతువు వల్ల ఏర్పడే పదాలు కొల్లలు! నిర్దేశ=చూపడం, చెప్పడం, ఆదేశించడం, స్పష్టంగా చెప్పడం, వర్ణించడం, ఏర్పాటు చేయడం, నిర్ణయపూర్వకంగా చెప్పడం, నిరూపించడం. నిర్దేశక=చూపేవాడు. నిర్దేశనీయ=చూపదగిన ఇత్యాది. నిర్దేశ్య=చూపదగిన. నిర్దేష్టా=చూపేవాడు. నిర్దేష్ట్రీ చూపేమహిళ.

మరొక తమాషా చూచారా? ఈ నిర్దేశ పదానికి జీతం, వేతనం అనే అర్థమూ ఉ ంది. జీతనాతాలు నిర్దిష్టమయిన పనికి నిర్దేశించి ఇచ్చేది గనుక నిర్దేశపదానికి జీతం అనే అర్థం ఏర్పడివుంటుంది. "కాలమేకం ప్రతీక్షేత నిర్దేశం భృత్యకోయథా" భృత్యుడు జీతం ఎదురు చూచేట్టుగా నరులు కాలాన్ని-అదనును, మృత్యువును-ఎదురు చూడాలంటాడు వ్యాసమహర్షి. నిర్దేశ శబ్దానికి ఆజ్ఞ అనే అర్థమూ ఉంది గనుక భృత్యుడు యజమాని ఆజ్ఞను నిరీక్షించినట్టు నిరీక్షించాలని అని అన్నా అర్థం చెడదు. భృత్యుడు యజమాని ఎప్పుడు జీతం ఇస్తాడో అని ఎదురు చూచినట్టే, యజమాని ముదల కోసమూ చాలా జాగరూతకతతో ఎదురుచూడాలి మరి!

ఇక నిర్దుష్ట అనే పదం చూద్దాం, ఇది నిర్దిష్టకు పోటీవచ్చి, నానా హంగామా చేస్తోంది. ఇది దుష్ అనే ధాతువునుంచి పుట్టింది. చెడ్డగా అగు, కలుషితమగు,

అపవిత్రమగు, తప్పులుచేయు, పాపంచేయు అనే అర్థాలున్నాయి. దుష్టం=చెడిన, దోషయుక్తమయిన, అపవిత్రమైన, అధమమైన, చెడ్డ, తక్కువయినది, తప్పుగలది, ఒకజాతి కుష్ఠరోగ అనే అర్థాలున్నాయి. దోషం అనే అర్థం వుంది. ఏతద్వ్యతిరేకమయినది నిర్దుష్టం. దీనిలో నిర్+దుష్+త అనే మూడు భాగాలున్నాయి.

తమాషా ఏమిటంటే, అమరసింహుని నామశాసనం గాని, మోనియర్ విల్లియమ్స్ సంస్కృతాంగ్ల నిఘంటువుగాని, మామిడి వెంకటార్యుల శబార్థ కల్పతరువనే సంస్కృత నిఘంటువుగాని నిర్దుష్ట అనే ఆరోపం ఇవ్వలేదు, నిర్దోష అనే ఆరోపమే ఇచ్చింది. పూర్వకవులెవరూ నిర్దుష్ట అనేదాన్ని ప్రయోగించలేదు కాబోలు. ప్రయోగించి వుంటే మోనియర్ విల్లియమ్స్ వదిలి వుండదుకదా! దుష్ధాతువు భావార్తక ప్రత్యయంతో చేరి దుష్టం అయి దోషార్థ వాచి అయిందని మనం భావించాలి. దుష్టం కానిది నిర్దుష్టం. నిరుద్యోగ, నిర్మమ, నిరీహ, నిరపేక్ష వంటి పదాలలాగే ఈ నిర్దుష్టను భావించాలి.

ఈ నిర్దుష్ట పదం నాకు కొన్ని దశాబ్దాల ఉదంతాన్ని జ్ఞాపకపరుస్తున్నది. 'ఆంధ్రప్రభ'లో నా సహోద్యోగి అయిన కవి ఒకరు ష్ట ప్రాసతో పద్యం ప్రారంభించి నిర్ వెనుకటిపాదం చివర వుండిపోగా, దుష్ట అని ప్రయోగించాడు. నన్నడిగాడు ఎలావుందని. నిర్దుష్టపదాన్ని మనం–పత్రికల వాళ్లం నిర్దుష్ట ప్రతిపాదనలు (దోషరహిత ప్రతిపాదనలు), నిర్దుష్ట పద్ధతి (దోషరహితమయిన పద్ధతి) నిర్దుష్టమైన భాష (దోషరహితమయిన భాష) అని నిర్దుష్ట పదాన్ని చావగొడుతున్నాం గాని, సంస్కృతాంధ్ర ప్రసిద్ధ నిఘంటువులలో ఇది కనిపించలేదండీ–అన్నాను. ప్రతిపదమూ నిఘంటువుకు ఎక్కాలనేముంది? అని ఆయన నవ్వుతూ అన్నాడు. నిర్దోషం ఇచ్చినప్పుడు నిర్దుష్టం ఇచ్చేవాడేగా, ప్రయోగం పాతది వుంటే. అయినా వాడండి, దుష్+త=భావార్థకమై దోషకు పోటీగా నిలుస్తుంది గనుక–అని అన్నాను. ఈలోగా సూర్యారాయాంధ్ర నిఘంటువు సంపుటి వచ్చింది. దానిలో దుష్ట అనే పదానికి దోషం అనే అర్థం ఇచ్చాడు గనుక ఒడ్డునపడ్డాం.

ఈ చర్చంతా చదివి నిర్దిష్ట నిర్దుష్టపదాలు వేరువేరు ధాతువులవని, వేరువేరు అర్థాలు ఇచ్చేవని, వీటిని ఒకదానికొకటి తారుమారుగా వ్రాయడంగాని, వ్యవహరించడంగాని తగదని స్పష్టమయింది గదా! ఇక పొరపాటు చేయకండి. సరైన అర్థాలతో వాడి ప్రశంసలు పొందండి.

## కుంభకర్ణ సూత్రం

ఇటీవల ఒక పెద్దకథకుని కథలో షష్ఠమ అనే ప్రయోగం చూచాను. ఇంతపెద్దవాడు ఈ చిన్న పొరపాటు ఎలా చేశాడా అని అనుకుంటుండగా నలభయ్యేళ్లనాటి ఒక ఉదంతం జ్ఞాపకం వచ్చింది.

రష్యన్–తెలుగు నిఘంటువు నిర్మాణంలో పని చేసిన శ్రీమతి ఆదిలక్ష్మిగారు ఒకకావ్యం వ్రాశారు. దానిలో ఆశ్వాసాంతంలో కాబోలు "షష్ఠమంబైన సమాశ్వాసము" అని ప్రయోగించారు. ఆ కావ్యాన్ని నేను సమీక్షించవలసి వచ్చింది. నా సహజ ధోరణిలో కావ్యంలోని మంచి చెడ్డలు తెలుపుతూ షష్ఠమ వంటి ప్రయోగాలు ఇకమీదనయినా మానుకుంటే మంచిదని సలహా యిచ్చాను.

ఆవిడకు కోపం వచ్చింది, సమీక్ష చదివిన తర్వాత "ప్రథమ, పంచమ, సప్తమ, అష్టమ, నవమ, దశమ అనే పదాలలాగే షష్ఠమ కూడ సాధువే, షష్ఠమ అసాధువయినప్పుడు ప్రథమ, పంచమ, సప్తమ, అష్టమ, నవమ, దశమ శబ్దాలు సాధువులు కావు. ఇంతమాత్రం తెలియని మీ సమీక్షకుని మందలించండి" అంటూ సుదీర్ఘమైన లేఖ ఒకటి ఆంధ్రప్రభ సంపాదకులకు వ్రాశారు. ఆయన ఆ లేఖను చూచి నవ్వుకొని నాకూ చూపారు. వైయక్తికంగా ఒక ఉత్తరం వ్రాయండని నాకు సలహాయిచ్చారు. ఉత్తరం ఎందుకని అడిగాను. ఇలాంటి సామాన్య విషయాలు వివరించడంకోసం పత్రికలోని అమూల్యమైన స్థలాన్ని వ్యర్థం చేయడంకన్నా రచయితలకొక కార్డుముక్క పడేస్తే మంచిదని ఆయన అన్నారు, అలాగే వ్రాశాను. దాని సారాంశం ఏమిటంటే.

తెలుగులో ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది – అనే సంఖ్యావాచక పదాలకు అవఅనే ప్రత్యయం చేరిస్తే ఒకటి+అవ=ఒకటవ, అలాగే రెండవ, మూడవ, నాలుగవ, ఐదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ, పదవ అనే నిర్దేశాత్మకమైన రూపాలు ఏర్పడుతాయి. సంస్కృతంలో అలాకాదు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ, సప్తమ, అష్టమ, నవమ, దశమ అనే విభిన్న రూపాలవుతాయి.

షష్ఠ శబ్దం వ్యుత్పత్తివేరు. పంచమ, సప్తమ, అష్టమ, నవమ, దశమ పదాల వ్యుత్పత్తి వంటిదికాదు. గొర్రెలమందలో మేకలు కొన్ని చేరాయనుకోండి. గొర్రెలమందే అంటాంకాని, గొర్రెమేకల మంద అనం. అలాంటిది కాదు ఇక్కడి సంగతి. షట్ అంటే ఆరు. ఆరవవాడు అనడానికి షట్ శబ్దంపై డట్ అనే ప్రత్యయం వస్తుంది. ఈ డట్‌లో ట్ పోయి అ అనే అక్షరం మిగులుతుంది. ఈ షట్ మూలరూపం షష్. షష్‌కు అ చేరి షష్+అ అవుతుంది. దీనికి చతుర్‌వంటి మరికొన్ని పదాలకు థ్ అనే వర్ణం షష్‌లోని చివరి ష్ కు చేరుతుంది. ష+థ్+అ అని మారుతుంది. ఈ థ్ ఠకారమై ష+ఠ్+అ=షష్ఠ అవుతుంది. పంచన్, సప్తన్, అష్టన్ అనేవి నకారాంతాలు. ఆ సంఖ్యావాచకాలకు మ కారం ఆగమంగా చేరింది. షకారాంతమైన షష్ శబ్దానికి మకారం ఆగమంగా రాదు. కనుక షష్ఠ అయింది. పంచన్ మొదలయినవి పంచమ, సప్తమ అయ్యాయి.

కాని, ఒక విషయం గుర్తుపెట్టుకోవాలి. ఎవరో వ్రాసిన సూత్రాల వల్ల పదాలు ఏర్పడవు. భాషలో కొన్ని పదాలు ఏవేవో కారణాల వల్ల మారుతూంటాయి. భాషాశాస్త్రజ్ఞులు అవి ఎందుకలా అయ్యాయో పరిశీలించి, "ఇవి ఇందువల్ల మారాయి. ఇంకా మార్చకండి. శబ్ద రూపకమే మిగులకుండా పోతుంది. శబ్ద స్వరూపాన్ని కాపాడుతూరండి" అని సలహాయిస్తారు. లోక వ్యవహారాన్ని బట్టి వ్యాకరణం. ప్రయోగ శరణా వైయా కరణాః అని అభియుక్తోక్తి. భాష మరీ భ్రష్టు పట్టకుండా ప్రయత్నిస్తారు భాషాశాస్త్రజ్ఞులు. వారిది శాసనంకాదు, మిత్ర సమ్మితమైన ఉపదేశం. 'మేం పాటించం, తప్పేచేస్తాం' అంటే 'మీ కర్మ' అని వదిలివేయాల్సిందే.

ఇంత వివరంగా వ్రాసినా ఆమె "నేను షష్ఠమమనే వ్రాస్తాను" అంటూ ఎవడో ఉడికీ ఉడకని ననువాయికవులు ఒకరిద్దరు వ్రాసిన ప్రయోగాలు తెలుపుతూ నాకు సమాధానం వ్రాశారు.

నేను దానికి ప్రత్యుత్తరం వ్రాశాను "అమ్మా! అనాలజీ–సాదృశ్యం వల్ల కొన్ని పదాలు ఏర్పడుతాయి. కాని షష్ఠశబ్దం అలా షష్ఠమగా మారలేదు. అలా మారిఉంటే, అలాంటి ప్రయోగాలు ఉంటే, శాస్త్రజ్ఞులు పరిగణించేవారు. వాటికి అనుగుణంగా సూత్రాలు వ్రాసేవారు. మీ వాదానికి నాకొక సూత్రం స్ఫురించింది, దానికి కుంభకర్ణ సూత్రమని పేరుపెట్టాను. పంచమ, సప్తమ, అష్టమాల సాదృశ్యంతో షష్ఠమ అవుతుందన్నారు. మీరు భోజకాళి దాసుల కథలు చదివే వుంటారు. మంత్రి కుతంత్రంతో సభాప్రవేశం చేసిన మూర్ఖుడు సభాస్థలిలోని రావణ చిత్రపటం చూచి రాభణ అని అంటూ ఆశ్చర్యపడగా, మంత్రిదానిని

కుంభకర్ణే భకారోస్తి,

భకారోస్తి విభీషణే,

రాక్షసానాం కులశ్రేష్ఠః

రాభణో నచ రావణః

రావణ, కుంభకర్ణ, విభీషణులు అన్నదమ్ములు. కుంభకర్ణ శబ్దంలో భకారం ఉంది, విభీషణ శబ్దంలో భకారం ఉంది. రాక్షస కుల శ్రేష్ఠుడయిన రావణుని పేరులోన భకారమే ఉండాలి అని సమర్థిస్తాడు. అలాగే పంచమంలో మకారం వుంది, సప్తమంలో మకారం వుంది. వాటి మధ్యన ఉన్న షష్ఠ మకారంతో షష్ఠమ అవుతుందనే వాదం

పాణిని సూత్రాలతో కాక కుంభకర్ణసూత్రంతో సాధువవుతుంది. రాభణాయనమః

యువకులారా! ఈలాంటి చిన్న చిన్న తప్పులూ చేయకుండా రచన సాగించండి. వాక్శుద్ధి, మంత్రబలం అంటే మరేమీకాదు. అపశబ్దాలు లేకుండా, అపస్వరాలు లేకుండా స్పష్టంగా ఉచ్చరించడం సరైన పదాలు వాడడమూను.

## ఉధృతం కాదు ఉద్ధృతం

గాలులు గంటకు రెండు వందల మైళ్ల వేగంతో వీస్తున్నాయి. తుఫాను కెరటాలు ఉధృతంగా లేచి పడుతున్నాయి. పరంధామయ్యగారి మనసులోన భావాలు అంత ఉధృతంగాను కదలుతున్నాయి – అని ఒక కథ ప్రారంభమవుతుంది.

మహిళల మనోబలంతో మద్య నిషేధం అమలులోకి వచ్చింది. ఈ నిషేధం నీరుకారిపోయి దుష్టశక్తులు ఉధృతం కాకుండా చూడాలి – అని ఒక మంత్రిగారి హెచ్చరిక.

డాక్టర్‌గారూ! నిన్నరాత్రి జ్వరం ఉధృతంగా వచ్చింది. అబ్బాయి ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. నడిరాత్రిలో మిమ్మల్ని ఇబ్బంది పెట్టలేక తెల్లవారగానే వచ్చానండి అబ్బాయితోపాటు. మీరే రక్షించాలి అబ్బాయిని అంటుంది ఒక తల్లి వైద్యునితో.

ఏమిటి విశేషం ఈరోజు? మహోధృతంగా ఉందే నీ సంతోషం! పుట్టింటివాళ్లు ఎవరైనా వచ్చారా ఊరినుంచి? అని వ్యంగ్యోక్తి విసురుతాడు ఒక భర్త భార్యమీద.

ఈ ఉధృతం తెలుగువారికి, కన్నడులకు ఎలా వచ్చిందో, ఎలా సంక్రమించిందో! నిజానికి ఈ పదాన్ని ఉద్ధృతం అని వ్రాయాలి, పలకాలి. ఉధ్రుతంగా అని వ్రాసే వాళ్లూ వున్నారు. వట్రువసుడి మనవారు అచ్చుగా భావించకపోవడం వల్ల, కొమ్ము క్రావడిగానే భావించడంవల్ల ఏర్పడిన చిక్కిది. కనుక ఉధృతం అనేదానిలో ధృ ద్విత్వాక్షరంగానే భావిస్తారు, అలాగే ఉచ్చరిస్తారు. తప్పు తెలుసుకొనడానికే ప్రయత్నించరు.

మన తెలుగు నిఘంటువులను ఒకసారి తిరగవేయండి. ఉధృతమనే మాట కనిపిస్తుందేమో! అలాంటి పదం ఉంటే కదా కనిపించడానికి! తెలుగు సాహిత్యంలో ఉన్న సంస్కృతపదాలన్ని మన నిఘంటువుల్లో ఉన్నాయా అంటారు? అది విషయాంతరం. కనుక ఉద్ధృతమే కనిపిస్తుంది.

ఈ ఉద్ధృత అనే పదంలో మూడు భాగాలున్నాయి. ఉత్–ధృ–త; లేక ఉత్+హృ+త శబ్దరత్నాకరంలో దీనికి – ఉద్ధృత పదానికి ఉద్ధృతము=పయికెత్తబడినది, చేదబడినది, అనుభవించి విడువబడినది అర్థాలున్నాయి. ఉద్ధృతి=గర్వము, పైకెత్తుట. ఉద్ధృతుడు=పొలిమేర ఏర్పాటు చేసేవాడు, పైకెత్తబడినవాడు.

ఉద్ధృ అనే ధాతువుకు ఇతర నిఘంటువులలో మరికొన్ని అర్థాలూ ఉన్నాయి. వెలికితీయు, చేదు, బలవంతంగా పైకితీయు, రూపుమాపు, లాగు, పైకెక్కు, చిలికితీయు, తీసుకొనిపోవు (నిప్పునుంచి), ఎత్తు, పైకెత్తు, ఆపదల నుంచి తప్పించు, అందజేయు, స్వతంత్రంగా చేయు, రక్షించు, తొలగించు, మినహాయించు, ఎంపిక చేయు, ఎన్నుకొను, బహూకరించు, శక్తివంతం చేయు, ఉద్ధరించు, నశింపజేయు, ఉద్ధరించు, విడదీయు మొదలైన అర్థాలను మోనియర్ విల్లియమ్స్ ఇచ్చాడు. ఉద్ధృతి అన్న పదానికి వెలికితీత, లాగివేత, తొలగింపు, రక్షణ, అందజేత మొదలయిన అర్థాలున్నాయి.

ఉత్+ధృ+త=అనే మూడు భాగాల కలయికవల్ల ఉద్ధృత ఏర్పడిందని ఇది వరకే అన్నాను. ఉత్ ఉపసర్గ అన్నారుగదా రెండవ దకారం ఎక్కడిదని సందేహం కలుగవచ్చు. సంధిలో ఉత్‌లోని త్‌కార ద్ గా మారుతుంది.

ఉత్+ధృతం–ఉద్+ధృతం=ఉద్ధృత. అవుతుంది. ఉత్+హృతం అనే పదమూ ఉద్ధృతం అని అవుతుంది. అప్పుడు ఉత్+హృ+త అని మూడు భాగాలు. ఇక్కడ ఉత్‌లోని థ్ ధ్‌గాను, హృలోని హ ధ గాను మారుతుంది. కనుకను ఉద్ధృతమనే రూపమే ఏర్పడింది. ఈ పద వ్యుత్పత్తి బట్టి ఉధృతం అని వ్రాయడానికో, ఉచ్చరించడానికో అవకాశమేలేదు. ఉద్ధృతం అనే వ్రాయాలి. ఉద్ధృతానికి, ఉధృతానికే ఉచ్చారణలో సామ్యం ఉండడం, ద్విత్వాక్షరాలనూ తేల్చిపలికే తెలుగువారి అలవాటువల్లా, ఈ తప్పు దొర్లి వుంటుంది.

ఏవముక్త్వా తతో రామో
ధనురాయ వీర్యవాన్,
లక్ష్మణాను చరః తస్థా
సముద్ధృత్య శరోత్తమమ్

(రా.యు. 59–32)

తర్వాత (ఈ పాపాత్ముడు నాకంట పడ్డాడు) అని అంటూ పరాక్రమవంతుడైన రాముడు తన ధనుస్సును తీసుకొని ఉత్తమమైన బాణాన్ని (అంబుల పొదినుంచి) పైకి ఎత్తి లక్ష్మణుడు వెంటరాగా బయలుదేరాడు. ఉద్ధృత్య అని రామాయణ ప్రయోగం.

## ఇదెక్కడి 'అయిష్టం'

పరంధామయ్యగారు ఉద్యోగం నుంచి విరమించిన మరుసటి ఉదయం కూడా అలవాటు ప్రకారం తొందరగా లేచి హడావిడి పడుతున్నారు. భార్య చూపుల్లో అయిష్టత కనిపించింది. కోడలి మాటలు అయిష్టంగా వినిపించాయి. కొడుకు వైఖరిలోను అయిష్టతే

ప్రతిబింబించింది. పరంధామయ్యగారికి ఈ అయిష్టత ఏమిటో అర్థం కాలేదు. ఆలోచనలో పడ్డాడు.

ఇదీ ఒక కథలోని పరంధామయ్యగారి పాత్ర చిత్రణం. ఈ అయిష్టం, అయిష్టుడు, అయిష్టత కథలలో ధారాళంగా దొర్లిపోతున్నాయి. ఏమిటిసార్ ఈ అయిష్టత? అని ఏ కథకుడినయినా అడగండి తప్పేమిటో తెలియక వారు "ఇష్టం–ఇష్టం కానిది అయిష్టం. దీనిలో ఏముంది చెప్పడానికీ, ప్రశ్నించడానికీ? అని ఠక్కున సమాధానమిస్తారు.

స్వామీ! ఇష్ట అనేది సంస్కృతపదం దానికి వ్యతిరేక పదం అనిష్టం. అయిష్టం అనేది కాదు – అని అంటామనుకోండి. అయిష్టం శిష్ట వ్యవహారంలో ఉందండీ. మేము శిష్ట ప్రయోగాలను మీ వ్యాకరణం కొలబద్దతో కొలవమండీ – అంటారు విసుక్కుంటూ.

ఇష్ట అనే పదం ఇష్ ధాతువుకు త అనే ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడిన రూపం. దీనికి వ్యతిరేకార్థంలో అన్+ఇష్ట= అనిష్ట అనే రూపం ఏర్పడుతుంది. అ అనే వ్యతిరేకార్థకం వ్యతిరేకార్థకమయిన నఙ్నుంచి ఏర్పడినట్టిది. నఙ్లోని నపోయి అ మిగులుతుంది. ఇది అచ్చు మొదట్లో ఉన్న – అజాది అయిన పదాలకు నఙ్కు సమాసం చేసినప్పుడు సంభవిస్తుంది. అ+ఇష్ట అన్నప్పుడు నకారం అకారానికి ఆగమంగావచ్చి అన్+ఇష్ట=అనిష్ట అని అవుతుంది. ఆదేశం ఆగమం అనేవి ఎలా వస్తాయో మీకు తెలిసిన విషయమే. ఆదేశం శత్రువులాగా వస్తుంది, అంటే ఉన్నదాన్ని తుడిచి పెట్టి తానే నెలకొంటుంది. ఆగమమనేది మిత్రునిలాగా వస్తుంది, సహజీవనం చేస్తుంది ఉన్నదానితో. ఇక్కడ ఆ పక్కన న్ నెచ్చెలిలాగా వచ్చి, ఉన్నదాన్నీ కలుపుకొని అన్ అయింది, ఇప్పుడు రూపనిష్పత్తి ఈ విధంగా జరిగింది. న+ఇష్ట అనేదాని నలోని న పోయి అ+ఇష్టఅయి, నకారం ఆ పక్కన వచ్చి అన్+ఇష్ట=అనిష్ట అయింది. ఇది పాణిని వ్యాకరణ సమ్మతమైన, సంస్కృత కావ్యాదులలో ఉన్నరూపం.

మరి అయిష్టం అనేపదం ఎలా పుట్టింది? ఎలా ప్రచారంలోకి వచ్చింది? అని విచికిత్స కలుగడం సహజం. ఈ అనిష్ట అనే పదానికి కోరని, అవాంఛనీయమైన, ప్రయోజనకరంకాని, అనుకూలంకాని, చెడ్డ, తప్పయిన, దుష్టమైన, అనే అర్థాలున్నాయి. అనిష్ట+గ్రహం = దుష్టగ్రహం. అనిష్ట+ప్రసంగం=తప్పుడు ఉద్దేశంతో జరిగే సంభాషణ, తప్పుడువాదం అనిష్ట+ఫలం=చెడుఫలం, అనిష్ట+శంక=దురదృష్టం కలుగుతుందేమోనని సందేహం, అనిష్ట+హేతువు=చెడ్డశకునం మొదలయిన అర్థాలుగల పదాలు కోశాలలో కనిపిస్తాయి.

ఇష్టానికి వ్యతిరేకం ఇష్టం లేకపోవడమే తెలుగు వక్తల వివక్ష. అంతేకాని, చెడ్డ, దురదృష్టకరమైన భావం తెలుపడం కాదు. ఈ భావాలు బరువయిపోతాయి. సూక్ష్మంగా,

తేలికగా వ్యతిరేకత తెలియజేయడమే తెలుగు వక్తల ఉద్దేశం కనుక వానికి అనిష్ట పదం ఇష్ట వ్యతిరేకమైనా చాలా బరువయినదిగా, మరీ చెడ్డ భావం తెలిపేదిగా కనిపించింది. కనుక అ+ఇష్ట=అయిష్టం అని తెలుగు భాషా సహజమయిన సంధిచేసుకొని వ్యవహరించడం ప్రారంభించారు. అయిష్టశబ్దంలో ఇష్టభిన్నమయిన కేవల వ్యతిరేకతేతప్ప, సంస్కృత శబ్దకోశాలలో దీనికున్న బరువైన భావం లేదు.

తెలుగులో అచ్చులకు అచ్చులు పరమయినప్పుడు య గాని, వ గాని ఆగమంగా వస్తాయి. యకారాగమం అందిరికీ తెలిసిందే. వకారాగమం వ్యవహారంలో ఉందిగాని, ప్రాచీనకావ్యాలలో కనిపించదు. ఆ+అట=ఆ వరు, ఈ+అండి=ఇవ్వండి, కాని తమిళంలో ఇది వ్యాకరణ సమ్మతమైనట్టిది. ఆరా+ఆముదు=ఆరావముదు, తరగని, నిరంతరాస్వాధ్యమయిన అమృతం. సుప్రసిద్ధ న్యాయశాస్త్ర పారంగతుడు దివాన్ బహదూర్ ఆరావముదు అయ్యంగార్ ఆంధ్ర రాజధానిలోని అక్షరాస్యులందరికీ తెలిసిన వ్యక్తి. తిరు+అరంగం=తిరువరంగం – శ్రీవైష్ణవులకు మహాపుణ్య క్షేత్రమయిన శ్రీరంగం, ఆరంగం అంటే తమిళంలో వేదిక, మిట్ట, ఎత్తయిన ప్రదేశం, ద్వీపం, శ్రీరంగం ఉభయ కావేరీ శాఖల మధ్యన ఏర్పడిన సారవంతమైన ద్వీపం. ఈ ద్వీపాలు మూడు. తలకావేరి – కావేరి పుట్టుక దగ్గరిది, మధ్యకావేరి కర్నాటక రాష్ట్రంలో మైసూరు దగ్గర ఉన్న శ్రీరంగ పట్టణం టిప్పుసుల్తాన్ రాజధాని. మూడవది తిరుచిరాపల్లి సమీపంలోని శ్రీరంగం. వీటి సామ్యంతో ఇతర రాష్ట్రాలలో నదుల మధ్యన ఏర్పడిన ద్వీపాలు కూడా శ్రీరంగనాథక్షేత్రాలయ్యాయి. అలాంటి వాటిలో ఒకటి నెల్లూరులోని రంగనాయకుల కోవెల. ఇక్కడ పెన్న రెండు పాయలయి ద్వీపం ఏర్పడింది. దానిలో రంగనాథాలయం నెలకొన్నది. పెన్న అసలే ఇసకనది. రెండవ పాయ ఇంకిపోగా, ఇప్పుడు నది మొదటిపాయ రంగనాథాలయం వెనక మిగిలిపోయింది. వకారాగమం తమిళ భాషలో ప్రచురమని, వ్యాకరణ సమ్మతమని చెప్పడానికి ఇంతగా చెప్పవలసి వచ్చింది, శాఖా చంక్రమణమని అనుకోకండి.

అన్నమాచార్యులు వ్యవహారంలో ఉన్న వ ఆగమసంధిని గుర్తించి ధైర్యంగా ప్రయోగించారు. సుప్రసిద్ధమైన జోలపాటలో

“జోవచ్యుతానంద జోజోముకుందా,

రావె పరమానంద రామగోవిందా”

జో+అచ్యుత=జోవచ్యుత. దీన్ని ప్రాసస్థానంలో వేసి, రావె పరమానంద అని రెండవ చరణంలో ప్రయోగించారు. జోవచ్యుతానంద అని గుజలీ ప్రతులలో ఉంది. నా

చిన్నప్పుడు, నా అమ్మమలు, నాన్నమ్మలూ ఇలాగే పాడారు. ఏ పండితమ్మన్యుడో ఇది తప్పనుకొని, జో అచ్యుతానంద, రార పరమానంద అని దిద్దివేశాడు, అన్నమాచార్యులు పల్లవులలో యతి ప్రాసలు పాటిస్తారనే పరిజ్ఞానం లేకుండా.

ఇలా అ+ఇష్టలో తెలుగు వ్యాకరణం దూరి అంటే తెలుగు ఉచ్చారణ పద్ధతి దూరి, అయిష్టం అనే రూపం ప్రాచుర్యంపొందింది. ఇలా అపభ్రంశంగా పలుకడానికి మరొక కారణమూ ఉందనుకుంటాను. సంస్కృతంలో అరిష్టం అనే మాట ఉంది. దీనికి దురదృష్టకర, వినాశకర మొదలయిన అర్థాలు తర్వాత వచ్చాయి. నిజానికి దీనికి వేదవాఙ్మయంలో క్షతిలేని, సురక్షితమైన, భద్రమైన అనే అర్థాలు. అ+రిష్టం = క్షతిలేనిది, అపాయం లేనిది, ఏతద్విరుద్ధమయిన అర్థం ఎలా వచ్చిందో! ఏ వ్యతిరేక లక్షణతో ఏర్పడిందో! ఈ అరిష్ట శబ్దం అనిష్ట శబ్దానికి దగ్గరగా ఉండడం కూడా అనిష్ట శబ్ద ప్రయోగం ప్రచురం కాకపోవడానికి కారణమేమో!

ఏమైనా, అ+ఇష్ట=అనిష్టమే కాని అయిష్టం కాదు, కాజాలదు. సంస్కృత సమాసం మధ్యన తెలుగు ప్రత్యయం దూరడం అసహజం కదా! కనుకే అయిష్టం అనేది ప్రయోగించదగింది కాదు, విద్యావంతుల వ్యవహారంలో ఉంటే ఉండవచ్చుగాక! వ్యవహారంలో సృష్టి, స్రష్టిపంచ మొదలయిన పదాలు ఎన్నో ఉన్నాయి. వాటిని వ్యుత్పన్నులు ప్రయోగిస్తున్నారా? రచయిత బాధ్యత, లక్ష్యం తనభావాలను ప్రకటించడం మాత్రమే కాదు, సంస్కారవంతమైన, సాధువైన భాషను నేర్పడం కూడా.

## ఉత్తమ పురుషైకవచనం

"సుమారు ఎనిమిది నెలల క్రిందటనేమో 'విశ్వఘోష' అనే కథ చదివాను, రచయిత పేరు అంతగా జ్ఞాపకం లేదు. దాని ఇతివృత్తమంతా ఒక దేవాలయంలోని దేవతామూర్తి తనకథ మనకు చెప్పినట్లు నడిచింది. ఉదాహరణకు 'ఒకపల్లెటూరి పెద్ద నా దేవేరి ఆభరణములను దొంగిలించినవాడు, లోపలికి వచ్చి నాకు నమస్కారం పెట్టాడు ఎన్నికలలో గెలువాలని. నాకు నవ్వువచ్చింది" ఇలా జరిగింది కథనం. మాటలు సరిగ్గా ఇవే కావేమో కథ మధ్యలో బాక్సుకట్టి రచయిత మాటలు కొన్ని వేశారు. ఆ మాటలు ఇలా ఉన్నాయి 'ఇది నా కొత్త ప్రయోగం కథను ప్రథమ పురుషలో నడిపించాను.' ఇలా మరికొన్ని మాటలు. నాకు ఆశ్చర్యం కలిగింది. 'అయ్యో! నేను, నాది మొదలయిన ఆత్మవాచక పదాలు (నాకు సంబంధించినవి అనేవి) ప్రథమ పురుష శబ్దాలుకావు, ఉత్తమపురుష వాచకాలు గదా! మరి ఇలాంటి తప్పు రచయిత ఎలా చేశారు? పోనీ సంపాదకులయినా దానిని సవరించి ఉండవచ్చు గదా! అని హైదరాబాద్ (మెహిదీపట్నం)

నుంచి శ్రీమాని సుబ్బు కృష్ణయ్య అనే జిజ్ఞాసువు నాకొక లేఖలో తెలిపారు. ఆయన ప్రశ్న సరైంది గనుక సమాధానం చెప్పవలసిన అవసరం ఏర్పడింది.

మనదేశంలో సంస్కృత భాష అన్ని విధాలపూర్తిగా వికసించిన భాష. సంస్కృత వ్యాకరణం శాస్త్రీయంగా, ఆధునిక భాషాతత్త్వ వేత్తలు కూడా విస్తుపోయేరీతిగా రూపొందినట్టిది. సంస్కృత వ్యాకర్తలు తమ కథనపద్ధతికి అనుకూలంగా ఉండడానికి, పఠితలు సులభంగా గ్రహించడానికి కొన్ని పారిభాషిక పదాలు కల్పించుకొన్నారు.

సంస్కృత వ్యాకరణం, దాని పరిభాష నిర్దుష్టమయినవి గనుక మనదేశంలో సంస్కృతవర్గానికి చెందిన ఆధునిక భాషలు సంస్కృతేతర భాషలయిన తెలుగు కన్నడాదులు మాట్లాడేవారూ ఆ పరిభాషనే స్వీకరించి తమ భాషను వ్యాకరించుకొన్నారు. సంస్కృత వ్యాకరణ సంప్రదాయాన్ని, సూత్రీకరణ పద్ధతిని పూర్తిగా పుణికి పుచ్చుకొని తెలుగు వైయాకరణులూ ఆ సంప్రదాయాన్ని అనుసరించే తెలుగునూ వ్యాకరించారు. ఆపద్ధతిలో నేను, నాది, మేము, మాది, మొదలయిన అస్మచ్ఛబ్దవాచకాలన్నీ ఉత్తమ పురుషవాచకాలే.

నా చిన్నప్పుడు మా గురువులు ఈ పురుష వాడకాలు జ్ఞాపకం పెట్టుకోడానికి తమాషాగా ఒక పద్ధతి చెప్పేవారు–తన్ను ఉత్తమ, నీవు మధ్యమ, ఎక్కడెక్కడో ప్రథమ. ప్రపంచమంతా నేను, నీవు, వాడు అదిలో గర్భితం. ఈ సంస్కృత వ్యాకరణం ప్రకారం వాడు, అది, ఆమె, రాముడు, రావణుడు, సీత, మండోదరి ప్రథమ పురుషవాచకాలు. నీవు, మీరు మధ్యమపురుష వాచకాలు. నేను, మేము ఉత్తమ పురుషవాచకాలు. ఇదే మన సంప్రదాయం, ఏతద్విరుద్ధంగా పలికినా, వ్రాసినా తప్పు – సందేహం లేదు.

మన బడాబడా రచయితలు తప్పు చేయడానికి కారణం ఆంగ్లవ్యాకరణ జ్ఞానం. ఇంగ్లీషు వ్యాకరణం ప్రకారం నేను, మేము ప్రథమ పురుష వాచకాలు. నీవు, మీరు ద్వితీయ పురుష (మధ్యమ పురుష) వాచకాలు. వాడు, వారు, అది, రాముడు, సీత తృతీయ పురుష వాచకాలు అంటే మన పద్ధతికి పూర్తిగా తల్లకిందులు. ఇంగ్లీషు వ్యాకరణం చదువుకున్న మనవారు ఇలాంటి తప్పులు ఎన్నో చేస్తున్నారు. లింగ విషయంలోను ఇలాంటి తప్పులు ఆంగ్ల, సంస్కృత వ్యాకరణ సంప్రదాయాల విభేదం వల్ల ఎన్నో వస్తున్నాయి. ఎంత గొప్ప రచయిత వ్రాసినా ఇలాంటి తప్పు తప్పే.

"తెలుగు నవలా మతల్లులు (నవాల, కథలు వ్రాసేవారు) 'మా అబ్బాయి డాక్టరీ చదువుతున్నాడు, మా వారు ప్లీడరీ చేస్తున్నారు' అని వ్రాస్తున్నారు" అని శ్రీ పూని సుబ్బుకృష్ణయ్యగారు మరొక సందేహం వెలిబుచ్చారు.

ఇలాంటి ప్రయోగాలు మనకు హిందీ వ్యాకరణంతో మనభాషలో దూరాయి. నౌకర్, చాకర్=సేవకుడు. నౌకర్ చేసేపని నౌకరీ, చాకర్ చేసేపని చాకరీ. ఈ పదాల సాదృశ్యంతో డాక్టరీ, ప్లీడరీ వంటి రూపాలు ప్రచారంలోకి వచ్చాయి. నిజానికి డాక్టర్‌గాని, ప్లీడర్‌కాని వృత్తులేగాని, చదువులు కావు, ఆ వృత్తుల కోసం చదివే చదువులు అని లాక్షణికంగా సర్దుకోవాలి. ఇంకా ఆశ్చర్యకరమైన ప్రయోగాలు కలెక్టరీచేసి రిటయిరయ్యాడు, అక్కౌంట్స్ ఆఫీసర్ చేస్తున్నాడు, జడ్జీ చేసి బాగా సంపాదించాడు. ఇలాంటి వాటిని చూచి వైయాకరుడు వ్యాకరణం పుస్తకం చంకలోపెట్టుకొని పలాయనం చిత్తగించవలసిందే.

ప్రాతస్స్మరణీయులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఇప్పటి ఇంగ్లీషు మోడల్ వాక్యాలను గురించి సరదాగా చెప్పేవారు – "మన వ్యాకరణం ప్రకారం కర్తృవాచకం క్రియకు అద్యతన సన్నిహితంగా ఉండక్కరలేదు. ఉదాహరణకు రాముడు పంచ ఎగగట్టి జామచెట్టెక్కి పండుకోసుకొని తినెను. కాని ఇప్పటి స్కూళ్ల విద్యార్థులు వాక్యాలలో కర్తృవాచకం క్రియావాచకానికి దగ్గరగా ఉంటున్నది. ఉదాహరణకు పంచ ఎగగట్టి జామచెట్టెక్కి పండు కోసుకుని రాముడు తినెను. ఇది ఆంగ్లవ్యాకరణ ప్రభావం, నేడు విదేశ భాషా సాహిత్య ప్రభావం మన భాషలపై ఎన్నో కారణాల వల్ల పడుతున్నది. దానివల్ల మన భాషలోను, సాహిత్యంలోను, దృక్పథంలోను ఎన్నో మార్పులు వస్తున్నాయి. వాటిని ఆపలేము. మన భాషా సాహిత్య సంప్రదాయాల అధ్యయనం బాగా జరిగి వాటి జ్ఞానబలం బాగా కలిగినప్పుడే ఇలాంటి లోపాలు తొలగుతాయి".

శాస్త్రిగారి మాటలు స్మరిస్తూ, యువకులలో జిజ్ఞాస ఇప్పుడు ముందుకన్నా ఎక్కువగా కలుగుతున్నది గనుక వివేకంతో భాష నేర్వడం, విచక్షణతో ప్రయోగించడం జరుగుతుందని శ్రీ సుబ్బుకృష్ణయ్య గారికి హామీ ఇస్తున్నాను.

మరొకమాట. ఈ పురుషవాచకాల విషయంలో జాతి మనస్తత్త్వం వ్యక్తమవుతున్నదేమోనని తోస్తుంది. మనది వసుధైక కుటుంబ దృష్టి కనుక ప్రథమపురుష వాచకాలతో క్రియలు ప్రారంభించామేమో! దూరంగా ఎక్కడో ఉన్నవారిని మొదట పేర్కొని, పిదప దగ్గరివారిని, తర్వాత తనను చెప్పుకోడం అలవాటయి వుంటుంది.

పరదేశీ వ్యాకరణంలో పురుషవాచకాలు నేను, మేము మొదట – ఫస్ట్ పర్సన్, తర్వాత నీవు, చివరకు వాడు. వారికి మనం మొదట, మనకు మనం చివర.

## ఉవాచ, తిష్ఠ వద్దుసుమా!

సంస్కృత క్రియాపదాలు యథాతథంగా తెలుగులో ప్రయోగించే సంప్రదాయంలేదు. కొందరు ఛాందసులు తమాషా కోసమో, వెక్కిరింపుకోసమో ఇలాంటి ప్రయోగాలు చేస్తుంటారు, ఇలాంటి ప్రయోగాలున్న కొన్ని వ్యంగ్య పద్యాలు ఉన్నాయి. ఉదాహరణకు:

తిండికైతే బహుమంచి వసంతి

తండులాలు సుతరాము నసంతి

కుండలెల్ల నడమింట లుఠంతి

ముండలాః కొడుకు లెల్ల హసంతి.

ఈ పద్యం మల్లినాథుడు తనస్థితిని హాస్యంచేస్తూ చెప్పినట్లు పండితులు అంటారు. కాని, మల్లినాథుడంతటివాడు ముండలాః కొడుకులు అని జనాన్ని తిట్టాడంటే నాకు నమ్మకంలేదు.

ఈ పద్యంలో వసంతి, నసంతి, లుఠంతి, హసంతి అనేవి ఆయా ధాతువుల వర్తమాన కాలబోధకమైన లట్ ప్రథమ పురుష బహువచనరూపాలు. వసంతి=ఉంటున్నాడు. నసంతి=లేవు. లుఠంతి=దొర్లాడుతున్నాయి. హసంతి=నవ్వుతున్నారు. ఇంట్లో తిండితినడానికి, సంపాదన బాధ్యతలేనివాడు, బాధ్యత తెలియనివారు చాలామంది ఉన్నారు. కాని, ఇంట్లో బియ్యం లేవు, తిండి పదార్థాలు లేవు. అందువల్ల వట్టి కుండలు నడిమింట దొర్లాడుతున్నాయి. వాటిని బోర్లించి దొర్లించినా గింజరాలడంలేదు. ఈ దుస్థితిని చూచి జనం నవ్వుతున్నారు. అట్లాంటి జనాన్ని ఈసడించే మాట ముండా కొడుకులు – ముండల కొడుకులు, కొంచెం ఛాందసహాస్యంతో చేరి ముండలాఃకొడుకులు.

అలాగే అవ్యయాలు కూడ యథాతథంగా వాడడం – మన సంప్రదాయం కాదు, కాని, సర్వదా, ఏతావతా, సర్వత్రా వంటివి వాడుకలో ఉన్నాయి. కాని, మలయాళ భాషలో ఇలాంటి ప్రయోగాలతో కావ్యాలే ఉన్నాయి. మన తత్సమీకరణకు సంస్కృత పదాలకు తెలుగు ప్రత్యయాలు కలుపుతాం. మలయాళంలో సంస్కృత పదాలకు తద్భాషా ప్రత్యయాలు కలపడం మాత్రమే కాక మలయాళ పదాలకూ సంస్కృత సుబంత తి జంత ప్రత్యయాంత పదాలను యథాతథంగా వాడడం పండిత సమ్మతమైన సంప్రదాయం. ఉదాహరణకు రామః రావణంకొన్ను. రాముడు రావణున్ని చంపాడు. ఈ వాక్యంలో రామః, రావణం అనేవి పూర్తిగా సంస్కృత సుబంద పదాలు. ఇలా సుబంత తి జంత పదాలు వాడడం మన సంప్రదాయం కాదు.

అయినా చాలామంది కథకులు తెలిసో, తెలియకో ఉవాచ, తిష్ఠ వంటి సంస్కృత పదాలను వాడుతున్నారు. ఇలా వాడడం మన భాషా సంప్రదాయ విరుద్ధమని తెలుసుకోడం అవసరం.

"నాన్నా, నాకీ పెళ్లి వద్దు" అన్నది కమల భయపడుతూనే. "అదేం కుదరదు" అని పరంధామయ్యగారి ఉవాచ – అని ఒక కథలో సంభాషణ.

మేనమామ శ్రీధర్ ఇంట్లో తిష్ఠవేసి, అందినంతవరకు స్వాహా చేయడం ప్రారంభించాడు. మరొక కథలో సన్నివేశం.

పై వాక్యాలలోని ఉవాచ, తిష్ఠ తెలుగు సంప్రదాయ విరుద్ధమైన ప్రయోగాలు, ఈ ఉవాచనను మనవారు భగవద్గీతలోను, కొన్ని వ్రతకల్పాలలోను కనిపించే అర్జున ఉవాచ, కృష్ణ ఉవాచ, భీష్మ ఉవాచ, ఈశ్వర ఉవాచ, శుక ఉవాచ= అర్జునుడు ఇలా అన్నాడు, కృష్ణుడు ఇలా అన్నాడు, భీష్ముడు ఇలా అన్నాడు, ఈశ్వరుడు ఇలా అన్నాడు, శంకరుడు ఇలా అన్నాడు – వంటి వాక్యాల నుంచి తీసుకున్నట్టు కనిపిస్తుంది. ఎవరో మొదట దానిని తమాషాకు, హాస్యం స్ఫురించడానికి వాడి ఉంటారు. దానిని గొర్రె దాటుగా అందరూ అనుసరించి ఉంటారు. అలాగే తిష్ఠ అన్నమాట కూడ.

ఉవాచ అనేది భూతకాలవాచకమైన ప్రథమ పురుష ఏకవచనరూపం. ఉ వాచ=చెప్పెను–చెప్పినాడు–చెప్పాడు చెప్పింది అని దీని అర్థం. ఈ భూతకాల వాచకాన్ని మన రచయితలు కొందరు భూతకాలంలోనే వాడినా మరికొందరు ఇది నామవాచకమనుకొని, కథనం అనే అర్థంలో వాడుతున్నారు. పరంధామయ్యగారి ఉవాచ= పరంధామయ్యగారి మాట, కథనం, జవాబు, ఇది మరీఘోరం. ఒక తప్పు ప్రయోగానికి మరొక తప్పును చేర్చడం. ఈ ఉవాచ అన్నది వచ ధాతువుకు, బ్రూధాతువుకు లిట్–భూతకాల–ప్రథమ పురుష ప్రథమైకవచనరూపం.

ఇక తిష్ఠ సంగతి మరీ విడ్డూరం. ఇది సంస్కృతంలో స్థా ధాతువు లోట్ మధ్యమ పురుష ఏకవచనరూపం. స్థా ధాతువుకు గతి నివృత్తి – ఆగడం, నిలబడడం అని అర్థం. స్థా ధాతువు కొన్ని క్రియారూపాలలో తిష్ఠ అని మారుతుంది. మన కథకులు వాడే తిష్ఠ శబ్దానికి ఉండు అని అర్థం. రామ తత్ర తిష్ఠ=రామా! నీవు అక్కడ ఉండుము– ఉండు అని అర్థం. ఆజ్ఞాద్యర్థాలలోనే ఈ రూపం తిష్ఠ, తిష్ఠతాత్ తిష్ఠతం. తిష్ఠత, నీవు అను నిలుచుకో, మీరిద్దరూ ఆగండి, నిలుచుకోండి, మీరు ఆగండి, నిలుచుకొండి అని ఈ రూపాల అర్థం. ఇది క్రియారూపమేకాని, ఉనికి అనే అర్థమిచ్చే నామవాచకం కాదు. సంస్కృతలో ఉనికి అనే అర్థంలో తిష్ఠ పదంలేదు. స్థా ధాతువులోని కొన్ని కాలవాచక రూపాలలో మాత్రమే ఉంటుంది.

తిష్ఠను ఉనికి అనే అర్థంలో వాడడానికి కారణం ష్ఠ అనే వర్ణంలో బరువుగా ఉన్న ష్ఠ స్థిరత్వాన్ని సూచిస్తుందనే భ్రాంతి అయి ఉంటుందని నా అభిప్రాయం. ఈ ప్రయోగం ఏదో రాయి పడేశాడు, బండపడేశాడు అన్నట్టు తిష్ఠ వేశాడు అని వేయడంలో మాత్రమే వాడుకలో ఉండడంకూడా విడ్డూరమే.

మిత్ర రచయితలారా! వ్యుత్పన్నులారా! ఉవాచను వదలుకోండి, తిష్ఠను తగలేయండి. అలాంటి అవ్యుత్పన్నాలు, అపభ్రంశాలు వాడకండి ప్లీజ్!!

## కూటమి కాదు, కూటము

తిరుమల–తిరుపతులకు యాత్రకు వెళ్లి వచ్చినవారికందరికీ రామానుజకూటం అంటే ఏమిటో అర్థమయి ఉంటుంది. రామానుజకూటమనేది ప్రతి వైష్ణవ క్షేత్రాలలోని దేవాలయాలలోను ఉంటుంది. దీని అర్థం రామానుజ మతానుయాయుల సమావేశం. సమావేశ స్థలం. రామానుజమతాన్ని, భక్తి యోగానికి ప్రాధాన్యమిచ్చే వారందరూ – అష్టాదశ వర్ణాలవారూ స్వీకరించారు. ఇది ఒక విధంగా వర్ణవ్యవస్థపై విప్లవమే. భగవంతుని దృష్టిలో భక్తులందరూ సమానులే గనుక, అతని సన్నిధిలో వర్ణాది విభేదాలు పాటించరాదు, ఆయన ప్రసాదానికి అంటూసొంటూ లేదు. కనుక ఎవరైనా స్వీకరించవచ్చు. ఈ పద్ధతిని భక్తియోగ ప్రధానమైన రామానుజమతానుయాయులు పాటించడంవల్ల, ఒక చోట భగవత్సన్నిధిలో సమావేశమై ప్రార్థనాదికాలు జరుపడంవల్ల రామానుజకూటం అనే వ్యవహారం ఏర్పడింది. ఇది తర్వాత కేవలం ప్రసాద వినియోగస్థానానికి రూఢమైపోయింది.

ఈ కూటం పూర్తిగా తెలుగుపదం. తెలుగు తోబుట్టువులయిన తమిళ కన్నడాలలోను ఈ కూట్టు–కూటు–కూడు అనే క్రియ ఉంది గనుక ఇది పూర్తిగా సంస్కృతేతరపదమే. దీనికి చేరు, చేరువఅగు, సమావేశమగు అనే అర్థాలున్నాయి. ఏ తెలుగు నిఘంటువునయినా తిరగవేస్తే ఈ కూట్టు – కూడు క్రియకు మరెన్నో అర్థాలు తెలుస్తాయి. గుమిగా చేరు, సంఘీభవించు, కలిసిఉండు, కలుగు, సంభవించు, సమకూరు, లభించు, శక్యమగు, సాధ్యమగు, యుక్తము, తగు మొదలయిన అర్థాలు ఎన్నో కనిపిస్తాయి. ఈ కూటు–కూడు ధాతువు నుంచే కూటం, కూటువ, కూడిక మొదలయిన పదాలు ఏర్పడ్డాయి.

కూటం అనే పదానికి కూటాము అనే మరొక రూపము ఉంది. దీనికి సమావేశస్థలం, చావడి, కొలువుకూటం, సభాభవనం అనే అర్థాలున్నాయి. రామానుజకూటం ఇలాంటిదే. రామానుజ మతంలాగే మధ్వాచార్యులు ప్రవర్తింపజేసిన మతం కూడా భక్తియోగ ప్రధానమైందే, కనుక దానిలో అష్టాదశ వర్ణాల వారూ చేరారు. వారి సమావేశాన్ని దాసర్‌కూట అంటారు. అంటే హరిదాసుల సంఘం, సమావేశం అని అర్థం.

శ్రీకృష్ణ దేవరాయలకు అత్యంతాప్తులయిన వ్యాసరాయస్వామి సమావేశాలకు కనకదాసువంటి దళితులూ వచ్చేవారు. వారి రాక అగ్రవర్గాలవారికి కష్టంగా ఉండేది. కనకదాసువంటి భక్తాగ్రగణ్యుని జ్ఞానప్రకాశం తక్కిన వారికి తెలిపి, వారికి కనువిప్పు కలిగించాలని వ్యాసరాయస్వామి ఒకమారు దాసరకూటంలో "ఎవరు మోక్షానికి పోగలవారూ" అని ప్రశ్నించారు. మహా మహా పండితులు రకరకాలుగా సమాధానం చెప్పారు. కనకదాసు "నేనుపోతే పోతాను" అని సమాధానమిచ్చాడు. ఆ సమాధానం విని సమావేశంలోని పండితులు "ఎంత పొగరువీడికి? తాను పోతేపోతాడట. వేదవేదాంతాలు నమిలిమింగిన మాకులేని మోక్షం వీడికా?" అని గుసగుసలాడారట. పైకి అనడానికి వ్యాసరాయస్వామి భయం మరి! అప్పుడు వ్యాసరాయస్వామి కనకదాసువాక్యం వ్యాఖ్యానిస్తూ "చూచారా? ఎంత తేలిక మాటలతో కనకదాసు సమాధానమిచ్చాడో! నేను అంటే అహం-అహంకారం. అది పోతే ఎవరయినా మోక్షార్హుడు. ఇంతటి జ్ఞానిని మీరంతా చులకనగా చూస్తున్నారే" అని అన్నారు. దానితో పండితులు తలవంచుకున్నారు.

ఇక సంస్కృతంలోను కూట శబ్దం ఉంది. దీనికి మిథ్యఅయినది, అసత్యమైనది, కల్లఅయినది, కృత్రిమమైనది, కపటంకలది, నిందితం, తుచ్ఛం, అసత్యం, దంభం, డాబు, మాయ, పాపం మొదలయిన అర్థాలున్నాయి. కూటసాక్ష్యం-దొంగసాక్ష్యం మనమందరం విన్న సంగతే.

దొంగ సాక్ష్యాలు, దొంగ వ్యాజ్యాలు, దొంగ పత్రాలు అనాదిగా ఉన్నాయి. బుద్ధుని కాలంలోను ఈ కూటపత్రాలున్నాయి. కూటరిణ పణ్ణ కూటబుుణ పదాలు వ్రాసి కొందరు దుర్మార్గులు ప్రజలడబ్బు కాజేసి, ప్రభుత్వాధికారులకు పట్టుబడుతామనే భయంతో బుద్ధుని శిష్యులుగా చేరేవారట. అజాత శత్రువు మొదలయినవారు ఈ విషయాన్ని బుద్ధునికి విన్నవించగా ఆయన వారిని మందలించి సన్మార్గులను చేశారంట. కూటరిణ పణ్ణ అంటే దొంగ అప్పు పత్రాలు.

కూటమి అనే మరొక మాట ఉంది. దీనికి ప్రధానంగా స్త్రీ పురుషుల చేరిక అనే అర్థం. ఈ చేరిక స్నేహంతో ఏర్పడేది గనుక పూనిక, స్నేహం, చెలిమి అనే అర్థాలు తర్వాత ఏర్పడ్డాయి. కూటం అనే మాటనూ అర్వాచీన కవులు స్త్రీపురుషుల చేరికకు వాడారు. అది ప్రమాణం కాదు.

కాని, ప్రధానంగా కూటమంటే సమూహం, చేరిక, కూటమి అంటే స్త్రీ, పురుష సంబంధం. ఈ రెండింటి భేదం తెలియనందున నేడు తాటికాయంత అక్షరాలతో ఆసియా దేశాల కూటమి, అగ్రరాజ్యాలకూటమి అనే శీర్షికలు పత్రికలలో కనిపిస్తాయి.

నేడు తృతీయ పురుషార్థం ప్రధానమైన కొందరు విచక్షణ లేకుండ, సమయాసమయాలు, స్థానాస్థానాలు గమనించక కూటమికి ప్రయత్నిస్తుంటారు. వారికన్నా పక్షులు, మృగాలు నయం. పక్షులలో పిట్టలు, కోళ్లు, పావురాలు పైనచెప్పిన మనుష్యులలాంటివి. తక్కినవికావు. కాకిని మనం ఈసడించుకుంటాము. కలయిక విషయంలో దానికి నియమం ఉంది. పిచ్చుకలలాగ, పావురాలలాగ నిరంతరం కలయికకై అంగలార్చే కాకులను ఎవరైనా చూచారా? కాకులు అతి రహస్యంగా, నిర్జన స్థలంలో కలుసుకుంటాయి. వాటి కలయిక – కూటమి మన కంటపడితే మహాదోషం. వెంటనే స్నానంచేస్తారు. కొందరు ఎవరో మరణించినట్టు కూట లేఖలూ బంధువులకు వ్రాస్తారు. అంటే కాకులు అంత జాగ్రత్త పడతాయన్నమాట. కాకికున్నంత ఇంగితం మానవులకు లేకపోవడం విచిత్రంగాలేదూ? విదేశాలలో పార్కులలోను, నాట్యశాలలలోను బాహాటంగానే కొందరు స్త్రీ, పురుషులు అసభ్యంగా కూటమికి ప్రయత్నించడం, పోలీసులు అలాంటి వారిని అరెస్టు చేసి, నేరం ఆరోపించి శిక్షలు విధింపజేయడం గురించి పత్రికలలో అప్పుడప్పుడు వార్తలు పడుతుంటాయి. అలాంటివాళ్లకు కాకులతో ప్రశిక్షణం ఇప్పిస్తే బాగుండునేమో!

సంస్కృతంలో భోగ అనే మాట ఉంది. దానికి సంపద, సుఖం మొదలయిన అర్థాలున్నాయి. ఈ భోగ శబ్దానికి సం అనే ఉపసర్గ వెనక కలిపితే సంభోగమనే పదం ఏర్పడుతుంది. దీని అర్థం స్త్రీ, పురుషుల కూటమి. ఎవరైనా భక్తురాలు ఒక సన్యాసికో, పెద్దమనిషికో నమస్కరిస్తుందనుకోండి. వారు ఆమెను భోగభాగ్యాభివృద్ధిరస్తు (నీకు భోగభాగ్యాలు అభివృద్ధి కలుగుగాక) అని ఆశీర్వదించడానికి మారు 'సంభోగ భాగ్యాభివృద్ధిరస్తు' అని ఆశీర్వదించారనుకోండి. పరిణామం ఎలా ఉంటుంది? కూటానికి మారుగా కూటమి అనడమూ అలాంటిదే.

కూటం–కూటమి ఒకే ధాతువుతో ఏర్పడినా ప్రత్యయభేదంతో విభిన్నార్థాలు చెబుతాయి గనుక, అవి ప్రజల నాలుకలపై నాట్యమాడుతున్నాయి గనుక, సవ్యంగా, సంబద్ధంగా వాడడం నేర్చుకోవాలి. ఎవరో వాడినంత మాత్రాన చాలదు. వాడిన వారి ప్రామాణికతను చూడాలి. కాళిదాసు అన్నట్టు పరప్రత్యయనేయ బుద్ధులు–ఇతరుల మాటలకు మోసపోయేవారు–కారాదు.

శ్రీలంక రేడియో వినేవాళ్ళు "ఇలంకై ఒలిపరప్పు కూట్టు స్థాపనం" అనే మాట తరచుగా వింటూంటారు. లంక ధ్వని ప్రసార సహకార సంస్థ అని దీని అర్థం. కొందరు కలిసి పనిచేసే సంస్థ కూట్టు స్థాపనం. తమిళులు ఇలాంటివైరి సమాసాలు వాడడంలో

చాలాకాలంగా ప్రసిద్ధులు. వారి మహాకావ్యమయిన శిలప్పదికారం ఇలాంటి సమాసమే. శిలంబు+అధికారం= కాలి అందెకు సంబంధించిన కథ అని దీని అర్థం.

## పొద్దుగాల

నేను నాలుగు దశాబ్దాల క్రితం హైదరాబాద్ నుంచి వెలువడే "తెలంగాణ పత్రిక" అనే తెలుగు దిన పత్రికలో చేరాను. పత్రికా కార్యాలయం నాంపల్లి స్టేషను రోడ్డులో గద్వాల భవనం ఎదుట కాపురం వనపర్తి వారి తుల్జాగూడాలో.

ఒకదినం పనిమనిషి నా అర్ధాంగితో మాట్లాడుతూ "అమ్మా నేను పొద్దుగాలరాను. బాసన్లు మీరే తోముకోన్రి" అని అంటున్నది. పొద్దుగాల అనేమాట విని కుతూహలంతో "ఏమిటంటున్నది పనిమనిషి?" అని నా అర్ధాంగిని అడిగాను. పనిమనిషి నా ప్రశ్న విని "ఏమమ్మా! నేనేమన్నా తప్పుమాట అన్నానా? అయ్యగారు అట్లా మాట్లాడుతున్రు?" అన్నది కొంచెం నొచ్చుకొని. "అదేంకాదే, నీవు పొద్దుగాల అని అన్నావు గదా! ఆ మాట అర్థంకాక అయ్యగారు అట్లా అన్నారు. నీ తప్పేమీలేదు" అని నా భార్య దానిని ఊరడించి, నావైపు తిరిగి "పొద్దుగాల అంటే, తెల్లవారగా, పొద్దుపొడువగా అని అర్థమండీ" అని అన్నది.

నేను వెంటనే పొద్దుకలుగు అనే మాట జనం నోళ్లలో పడి ప్రొద్దు+కలుగ-పొద్దుగల-పొద్దుగాల అయిందన్నమాట - అని భావించుకొని సంతృప్తిపడ్డాను. కాని, పొద్దుగుంకు, పొద్దుగూకు, పొద్దుపొడుచు అని ప్రయోగాలు కనిపిస్తాయిగాని, పొద్దుకలుగు అనే ప్రయోగాలు కనిపించడంలేదు.

ప్రొద్దు-పొద్దు అనేపదం దేనినుంచి పుట్టింది? బ్రధ్న నుంచా, పొళుదునుంచా అని ఆరు దశాబ్దాల కిందట మల్లగుల్లాలు పడ్డారు. బ్రధ్ననుంచి వచ్చిందని సంస్కృత వాదులూ, పొళుదునుంచి వచ్చిందని సంస్కృతేతర వాదులూ వివదించుకొన్నారు. కొళవి క్రొవి అయినట్టు పొళుదు ప్రొద్దుగామారిందని సంస్కృతేతర వాదులంటారు. సూర్యారాయాంధ్ర నిఘంటువు మాత్రం ప్రొద్దు అనే పదానికి పొద్దు అని అర్థం చెప్పి సం, బ్రధ్నః, ప్రాం పజో, కన్న, పొత్తు, తమి, పొళుదు-అని సంస్కృత పాకృత కన్నడ, తమిళ పదాలూ ఇచ్చింది. దేనినుంచి ఏది పుట్టింది అనే చర్చకు పోకుండా.

ఏ నిఘంటువు చూచినా ప్రొద్దు-పొద్దు అనే మాటకు సూర్యుడు, కాలము, సమయము, దినము, రోజు, పూట, దివసైకభాగము, ప్రాతఃకాలము, ప్రకాశము, ఉషఃకాలము, ప్రసవదినములు అనే అర్థాలు కనిపిస్తాయి.

ప్రొద్దగు అనే క్రియను సూర్యరాయ నిఘంటువు ఇచ్చి, ప్రొద్దు+అగు అని వ్యుత్పత్తి చెప్పి ప్రొద్దుపోవు, ఆలస్యమగు అనే అర్థాలిచ్చింది. నిజానికి పొద్దగు అన్నా, పొద్దు

కలుగు అన్నా ఒక్కటే, కొంచెం అర్థచ్ఛాయ తప్ప. కాని పొద్దు కలుగు అనే ఆరోపం ఇవ్వలేదు. ఏమైనా పొద్దుకలుగు, పొద్దుగల్గు, పొద్దుగాల, సూర్యోదయానికి, మరుసటిదినం, ఉదయించడానికి వ్యవహారంలో ఉంది.

ఎప్పుడూ- నిరంతరమూ అనే అర్థంలో పొద్దస్తమానమూ అనే నానుడి వ్యవహారంలో ఉంది. అంటే సూర్యోదయం-పొద్దు కలిగింది-మొదలు అస్తమనం-పొద్దుగూకే-వరకు అన్నమాట. అంటే నిరంతరం, ఎడతెగకుండా అని అర్థం. ఇప్పుడు ఆంగ్ల భాషా సంబంధం వల్ల ఇరవై నాలుగుగంటలూ అని వాడుతున్నాము. న్యాయదృష్టితో చూస్తే Hour (అవర్) అనే ఆంగ్ల పదానికి సరైన సంస్కృత పర్యాయం హోర. హోరలు దినానికి ఇరవై నాలుగు. జ్యోతిషంలో హోరాశాస్త్రం అనే నాడీ గ్రంథ సంప్రదాయం సహస్రాబ్దాల నుంచీ మనకు ఉంది.

అస్తమనం అనేమాటను కూడ సంస్కృత నిఘంటువులు అన్నీ ఇవ్వలేదు. అస్తమయ, అస్తమయిన అనే పదాలను మోనియర్ విల్లియమ్స్ ఇచ్చాడు గాని అస్తమన అనే మాటను ఇయ్యలేదు. మామిడి వెంకటాచార్యుల శబ్దార్థ కల్పతరువనే సంస్కృత నిఘంటువు అస్తమనం అనే మాటను ఇచ్చి, సూర్యాదర్శనే, అస్తమిల్లుట, సూర్యుడు మున్నగునవి కనబడకుండుట-అని అర్థాలిచ్చింది. సూర్యారాయ నిఘంటువు అస్తంగమనము, అస్తగమనము, అస్తగమము, అస్తమనము, అస్తమయమూ, అస్తమానము అనే పదాలిచ్చి, అస్తమనానికి "నైవాస్తమనమర్కస్య నోదయస్సర్వదామతః (వాచ)" అనే ప్రయోగం చూపింది. సూర్యునికి ఎప్పుడూ ఉదయాస్తమానాలు లేవని దీని అర్థం. అస్తమానం అనే పదానికి "అస్తమానముగా దహించు బాదద్ఛాయ లొనరించి వ్రేళ్లెంచి కొనుచునుండు" అనే ప్రయోగమిచ్చింది.

అస్తమానం అనే పదాన్ని హంసవింశతి, ఆంధ్రకిరా తార్క్ష్యనీయ కావ్యాలు ప్రయోగించాయి గనుక, సాధువుగానే గ్రహిద్దాము.

ఎప్పుడూ, నిరంతరమూ అనే అర్థంలో పొద్దస్తమానమూ అనే నానుడులు వాడుతారని ఇదివరకే అన్నాను. పశ్చిమాంధ్రంలో పొద్దుగూకులూ అనే నానుడి ఉంది. ఇది పొద్దస్తమానమూ అనేదానికి అప్పటమైన తెలుగు పర్యాయం. పొద్దుగూకులూ ఏం పీక్కొంతింటాడమ్మా ఈ పాపిష్టి పిల్లవాడు – అని విసిగిపోయిన ఒక తల్లి ఈసడింపు. పొద్దుగూకులూ ఇదేమిటండీ అమ్మకొంగుపట్టుకొని వేలాడుతారు? అని తల్లిచాటు భర్తకు భార్య వడ్డింపు. పొద్దుగూకులూ చదువుతాడు, ఒక అక్షరమూ ఒంటబట్టడంలే అని ఒక మొద్దబ్బాయిపై సహాధ్యాయుల నిరసన. పొద్దుగూకులూ దరఖాస్తులతో ప్రతి ఆఫీసు గడప ఎక్కి దిగుతున్నాను. నౌకరీ నాస్తి-అంటాడు ఒక నిరాశాహతుడైన నిరుద్యోగి.

పొద్దస్తమానమూ అనే నానుడిలోని పొద్దును మింగివేసి అస్తమానమూ, అస్తమానూ అని సంక్షేపించి వాడుతుంటారు. దీని ఉద్దేశమూ నిరంతరమనే. మద్రాసులో మావాటా పక్కన గోదావరి జిల్లా మండపేట వారుండేవారు. వాళ్ల పిల్లలు మా వాటాలోనే ఆడుకొనేవారు. "అస్తమానూ వాళ్లను ఇబ్బంది పెట్టకు" అనేది వాళ్ల తల్లి. మొదట్లో మాకు అర్థమయ్యేది కాదు, అస్తమానూ ఏమిటా అని అనుకొనేవాడిని. అస్తమానూ మానేమీ కాదని, అస్తమన–అస్తమానాల పొడిగింపేనని, పొద్దస్తమానంలోని పొద్దుజారిపోయి అస్తమానం మిగిలి ఏసలో ఈ విధంగా మారిందని తర్వాత తెలుసుకున్నాను.

పొద్దస్తమానం అనే వైరి సమాసంకన్నా పొద్దుగూకులూ అనే సరైన, తెలుగుపదాల సమాసమే సాధువు. ఇది పశ్చిమాంధ్రలో నేటికీ వ్యవహారంలో ఉంది. కాని, ప్రొద్దస్తమానమూ అనే దాన్ని కాని, అస్తమానమూ అనే దాన్ని కాని కాదనలేము, ఎందుకంటే, అవీ వ్యవహారంలో ఉన్నాయి కనుక.

ఇదంతా పొద్దుగాల అనే పదంతో సాగినచర్చ. పొద్దుగాల – పొద్దుగల్ల – పొద్దుకలుగ – పొద్దుకల్లగాన్–ఎలాంటి అందమైన అప్పటమైన తెలుగుమాట! దీని వాడుకలో ఉంచిన జనానికి జేజేలు.

## ఎందుకీ నిష్పూచీ నిష్పేచీ?

ఒకవైపు చాలీచాలని పింఛను డబ్బులతో గతుకుల్లో నడుస్తున్న జీవనయాత్ర; మరొకవైపు నిష్పూచీగా తిరుగుతున్న కుమారుడు; ఇంకొక వైపు గుండెమీద కుంపటిగా ఉన్న పెండ్లికాని కుమార్తె–రామనాథంగారికి ఏమీ తోచడంలేదు, – ఇది ఒక కథలో కథానాయకుడనదగిన రామనాథంగారి మనస్థితి వర్ణన.

"ఇప్పటి యువకులు రానురాను నిష్పూచీరాయళ్లుగా తయారవుతున్నారు" అని ఒక రాజకీయ నాయకుని ఆవేదన.

"ఇదిగో ఇల్లు చూచారు గదా! ఎన్‌కంబరెన్స్ సర్టిఫికెట్టు మొదలయిన కాయితపత్రాలన్నీ సవ్యంగా ఉన్నాయి. నిష్పేచీ వ్యవహారం. కళ్లుమూసుకొని కొనవచ్చు ఇంటిని" అని ఇంటిని అమ్మకానికి పెట్టిన ఇంటి యజమాని మాటలు.

"పిల్లవాడు బుద్ధిమంతుడు. ఇంట్లోవాళ్లందరూ నిష్పేచీదార్లు. మంచి సంబంధం, ఆలోచించండి". అని పిల్లతల్లిదండ్రులతో పెళ్లిళ్ల పేరిశాస్త్రి గారి మంతనాలు.

ఏమిటీ నిష్పేచీ, నిష్పూచీలు. ఎందుకు ఇలాంటి పదాలు వ్యవహారంలోకి వచ్చాయి? ఇవి సాధువులా? ఇలా ప్రయోగించడం ఉచితమా!

మన నిఘంటువులలో ఈ పదాల వ్యుత్పత్తి విషయం స్పష్టంగాలేదు. శబ్దరత్నాకరం పూచి అనే పదం ఇచ్చి, దేశ్యవిశేష్యము అని చెప్పి, తృణ విశేషము, బాధ్యత, కార్యము అనే అర్థాలిచ్చింది. దీర్ఘాంతమైన పూచీ అనే పదం ఇవ్వలేదు.

సూర్యారాయ నిఘంటువు పూచి, పూచీ అనే రెండురూపాలూ ఇచ్చింది. విశేష్యమని చెప్పి బాధ్యత, కార్యము అనే అర్థాలిచ్చి, "ఇంతటినుంచి మీపూచీ నాకేమియు లేదు". - అనే వ్యవహారవాక్యము ఉదాహరించింది.

ఈపదం వ్యుత్పత్తి స్పష్టంగా తెలియడంలేదు. పూను-పూనుచు అనే దానినుంచీ వచ్చిందా? పూను ధాతువునుంచి పూనికి అవుతుంది. పూనుచు-పూంచు, పూచు-పూచీ అయిందేమో! ఆలోచించాలి. పూనుకొను, బాధ్యత వహించు అనే అర్థాలు పూనుచు అనేదానికి ఉన్నాయి.

ఈ పదం పుట్టుపూర్వోత్తరాలు. ఎలా వున్నా నిష్పూచీ అనే మాటమాత్రం ఎంతమాత్రమూ సరైందికాదు. సంస్కృత ప్రత్యయాలు, ఉపసర్గలు సంస్కృతేతర పదాలకు తగిలించడం ఆంధ్రవ్యాకరణ సంప్రదాయం కాదని, దక్షిణాపథంలో అలాంటి సంప్రదాయం ఒక్క మలయాళ భాషలోనే ఉందని ఇదివరకే తెలుసుకున్నాము. కనుక సంస్కృతోపసర్గమైన నిస్ అనే దానిని పూచీ అనే తెలుగు పదానికి అతికించడం వ్యాకరణ సంప్రదాయ విరుద్ధం. అందువల్ల నిష్పూచీ అనే మాటను సాహిత్యంలో వాడడం ఉచితం కాదు.

ఇక నిష్పేచీ సంగతి, శబ్దరత్నాకరం పేచీ అని హ్రస్వ చికారాంతమైన పదమిచ్చి, కన్నడం విశేష్యం, భారము, తంటా అని వివరణ ఇచ్చింది. పేచీకోరు అనే పదమిచ్చి తంటాలమారి అని అర్థమిచ్చింది. పేచీ అనే దీర్ఘాంతమైన ఆరోపమూ ఉండాలి. పేచీకోరులో ఉందిగదాఅని, గతార్థమైనదని భావించిందేమో!

సూర్యారాయ నిఘంటువు పేచి, పేచీ అనే రెండురూపాలూ ఇచ్చి, కన్నడం, పేచ, హిందీ-పేచ్, చిక్కు, బాధ అనే అర్థాలిచ్చింది. పేచీకోరు అనే పదాన్ని ఇచ్చింది.

నిజానికి పేచ్-పేశ్ తెలుగు, కన్నడ, తమిళ, మలయాళాలకు ఉమ్మడిమాట. పేచ్-పేశ్=మాట్టాడడం అని తమిళంలో అర్థం. ఎన్నపేశరే?=ఏం మాట్లాడుతావు? భాషణార్థకాలైన చెప్పు, శొల్లు అనే మాటలూ ఉమ్మడివే. చెప్పు అనే క్రియ తమిళంలో వ్యవహారచ్యుతమైనా సాహిత్యంలో ఉంది. సెప్పినాన్=చెప్పాడు, ఇక శొల్లు-తెలుగులో భాషణార్థంలో వ్యవహారాచ్యుతమైనా, జొల్లు అనే అర్థంలో మిగిలింది. మాట, జొల్లు రెండూ నోటినుంచి వచ్చేవే.

పేచ్–పేశ్ అనేది విపరీతంగా మాట్లాడడం అనే అర్థం పరిణామంగా ఏర్పడిన తంటా–ఇబ్బంది–కలహం అనే అర్థాలలో మిగిలింది. హిందీలో పేచీదా=చిక్కయినది.

ఈ పేచ్–పేస్ ప్రాకృతానికి కూడా ఎక్కింది. పునరుత్త పేచిరీప అని గాథాసప్తశతి ప్రయోగం. మరీమరీ మాట్లాడే స్వభావం గలది అని దీని అర్థం. దీనికి సమానమైన పెచ్చారితనం అనే మాట మనకు ఉంది. దీనిని నిఘంటువులు పెచ్చు+అరి అని విడదీసి క–హెచ్చు, పిచ్చి, అవివేకము పెచ్చారి=మూర్ఖుడు అని అర్థమిచ్చాయి. ఉత్తర హరివంశంలోని ప్రయోగాన్ని ఉదాహరించాయి. ఎక్కువగా మాట్లాడేవాడు. విచక్షణ లేకుండా వాగి, అవివేకి మూర్ఖుడు అవుతాడు. గనుక పెచ్చారి అనేది పేశ్–పేచ్ అనే మాటనుంచే వచ్చివుంటుందని నా అభిప్రాయం.

పేచీపదం కన్నడపేచ నుంచి వచ్చిందని మన నిఘంటువులు అన్నాయి గదా! కొంచెం పరిశీలిద్దాం, కన్నడంలో పేచ అనే మాట ఉందేగాని, పేచీ అనే మాటలేదు. పేచ అనే మాటకు చిక్కు, నీచమైనది అనే అర్థాలను కిట్టెల్ నిఘంటువు ఇచ్చింది. దీనికొక మంచి ఉదాహరణను ఇచ్చింది.

ఈచలద మరహీన

నీచరుదు నెరెహీన

మోచిదహెణ్ణు తరహీన

మనెయొళగె

పీచంట హీన......

ఈతచెట్టు హీనం, నీచుల పొత్తుహీనం, భర్తను కోల్పోయిన స్త్రీ జీవితం హీనం, ఇంట్లో పేచాట–చిక్కు హీనం– అని దీని అర్థం. పేచ+ఆట=పేచాట కిట్టెల్ ఈ పదం మహారాష్ట్రం నుంచి వచ్చిందని అన్నాడు, కిట్టెల్ఏమన్నా, మాటలతోనే ఇబ్బందులు, కలహాలు వస్తాయి గనుక పేచాట అనే మాట పేచ్–పేశ్ నుంచే వచ్చిందని భావిస్తున్నాను. పేచీ తెలుగు మాట అని చెప్పడానికి దీని పుట్టుపూర్వోత్తరాలు తడవ వలసి వచ్చింది.

ఈ పదం అప్పటమైన, అచ్చమైన తెలుగు పదం గనుక దీనికి నిర్–నిస్ అనే సంస్కృతం ఉపసర్గలు చేర్చి నిష్పేచి అని వాడడం సరికాదనడం చర్వితచర్వణం.

ఈ పదాలు ఏవో కొన్ని సంస్కృతపదాలు తెలుసుకొని కోర్టు వ్యవహారాలలో ఉండేవారు. వాడడం వల్ల ఏర్పడి ఉంటాయని భావిస్తున్నాను. మనోవృత్తి మొదలయిన పదాలు ఇలాంటివే. మనడానికి–బతకడానికి కావలసిన వృత్తి–జీవనాధారం అనడానికి మనువృత్తి మనవృత్తి – అనే పదాలు రూపుదాల్చాయి. పండితమ్మన్యుడెవడో మనువృత్తి

ఏమిటి ఇది సంస్కృత పదం కాదా అనే ధీమాతో మనోవృత్తి అని స్థిరపరచి ఉంటాడు. ఈ దునియాలో అరకొరజ్ఞానం కలవారి పెత్తనమే ఎక్కువ.

పై చర్య వల్ల తేలిందేమిటంటే పేచీ, పూచీ అనే మాటలు తెలుగుపదాలు, వాటికి సంస్కృతోపసర్గలు వెనుక తగిలించి నిష్పేచీ, నిష్పూచీ అని వాడడం ఉచితంకాదని. కనుక మిత్ర రచయితలారా! ఇలా వాడకండి.

## శోభాస్కరం కాదు శోభాకరం

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు గొప్ప వక్త, న్యాయవాది. నా మహారాష్ట్ర యాత్ర మొదలయిన యాత్ర చరిత్రలు వ్రాశారు, ఆంధ్ర మహాపురుషులు మొదలయిన లేఖినీ చిత్రాలు వెలువరించారు. వంగదేశంలో చదువుకున్నారు. కనుక సంస్కృత పదాలను వంగీయులలాగ వాడేవారు. ఆయన అలా తరచుగావాడే మాట "భాస్వంతాశయాలు" ప్రకాశిస్తున్న గొప్ప భావాలు అని ఆయన ఉద్దేశం. "స్వామీ! భాస్వత్+ఆశయాలు= భాస్వదాశయాలు అని సంస్కృత వ్యాకరణ ప్రకారం అవుతుంది గాని, భాస్వంతాశయాలు అని కాదండీ!" అని అనేవాడిని. "తప్పైతే, బెంగాలులోను, ఉత్తరభారతంలోను తక్కిన ప్రాంతాలలోను ఇలాంటిది వాడుతున్నారే!" అనేవారు. "వారు వాడవచ్చునండీ వారి భాషల వ్యాకరణం వేరు. ఆ భాషలన్నీ ప్రాకృతాల నుంచి రూపొందినట్టివి గనుక అలా ప్రయోగిస్తాయి, మనం తత్సమ శబ్దాలను సమాసంతో వాడేటప్పుడు సంస్కృత వ్యాకరణ పద్ధతినే అనుసరిస్తాము. ప్రాకృత ప్రభావంతో మనకు కొన్ని వందల పదాలు దిగిమతి అయినా, తర్వాత కలిగిన సంస్కృత ప్రభావం వల్ల అసమర్థ సమాసాలు, దుష్ట సమాసాలు, విచిత్ర సమాసాలు మన పూర్వ కవులు వాడలేదు. వాడిమయూఖాలు, వేడిపయోధారలు వంటివి విరళం" అనే వాడిని. "నేను బెంగాలీ సంప్రదాయాన్నే అనుసరిస్తాను" అన్నారు ఆయన. "సరే మీ ఇష్టం. మన తెలుగు భాషా సంప్రదాయం తెలిపాను" అన్నాను.

ఆయన భాస్వంతాశయాలు అనే మాటనే కాదు. శోభాస్కరం, శోభాయమానం అనే విచిత్రమైన పదాలూ వాడేవారు. ఆయన చదువుకోనివాడు కాదు. సంస్కృతం, పాలీ, తెలుగు బాగా చదువుకొన్నవారే కాని, ప్రవాహిని ప్రభావం అలాంటిది.

ఇంతేకాదు, కొందరు ఇతర భాషా పదాలను పలుకలేక తమ ముఖయంత్రానుగుణంగా వాటిని మార్చుకుంటారు. తమకు పరిచితమైన పదాల సాదృశ్యంతో వాటికి సాధుత్వం కలిగించడానికి ప్రయత్నిస్తారు. అరేంజ్‌మెంట్ అనే పదం తీసుకుందాం. దీనిని నాకు తెలసిన చాలమంది అరంజ్‌మెంట్, అరన్‌మెంట్ అని వాడేవారు. దానిని ఎవరో పండితమ్మన్యుడో, పండితమ్మన్యురాలో అరణ్యామెంటు అని

సంస్కృతీకరించారు. ఇప్పటికీ పల్లె పట్లలో కొంచెం పైతరగతి మహిళలు అరణ్యమెంట్లు చేశారా అని వాడడం కద్దు.

ఇలాంటిదే మనోవృత్తి అనే పదం కోర్టు వ్యవహారాలలో తిరిగే పెద్దలు, చెట్టుకింది ప్లీడర్లు ఇలాంటి పదాలు తయారు చేస్తారు. మనడానికి – బతకడానికి అనాథలుగాని, అనాథ శిశువులుగాని జీవనయాత్ర గడపడానికి ఇచ్చే వృత్తి – మనువృత్తి. వృత్తి అంటే జీవనభృతి, జీవనాధారం. వృత్ అనే ధాతువునుంచి ఏర్పడిన రూపమిది. ఈ మను+వృత్తి ఇంతకు ముందు చెప్పిన వాడిమయూఖములు, వేడిపయోధారలు వంటి మిశ్రసమాసం దీనిని మనవృత్తి అని కూడా వ్యవహరించేవారు.

ఎవరో పండితమ్మన్యులు చూచారు–ఈ మనవృత్తి–మనువృత్తి ఏమిటని అనుకున్నారు. మనోవృత్తి అని మార్చి పారేశారు. ఇప్పుడు ఇది నవీన నిఘంటులకు కూడా ఎక్కింది. అయ్యా! ఇది మనోవృత్తి కాదండీ. మనువృత్తి అని అంటామనుకోండి. వందల సంవత్సరాలుగా జనం నోళ్లలో నలుగుతున్న మాటండీ. మార్చడమెందుకు? పోనీండి? అంటారు. సంస్కృతీకరణ ప్రభావం వ్యామోహం అటువంటిది.

ఇక శోభాస్కరానికి వద్దాం. శోభ అనే పదం శుభో అనే ధాతువునుంచి ఏర్పడింది. శుభ–శుంభదీప్తౌ అనేది ధాతువు. శోభా ఆకారంత రూపం. శోభశబ్దం పుంలింగలోను ఉంది. కాంతిగలవాడు, కలది అనే అర్థం. శోభకృత్ అనేది ఒక సంవత్సరం మనకు. శోభను కలిగించేది శోభాకరం. శోభా అనే మాటపై కృధాతువును–చేసేది, కలిగించేది అనే అర్థంలో చేర్చినప్పుడు శోభా+కృత్+అ=శోభాకర అనే రూపం ఏర్పడుతుంది గాని శోభాస్కరం అనే రూపం ఏర్పడదు. శోభలో సకరమే లేనపుడు శోభస్కరం అనే మాట ఎలా ఏర్పడుతుంది? ఎవరో సంస్కృత పండితమ్మన్యులు యశస్కరం, శ్రేయస్కరం, వర్చస్కరం మొదలయిన మాటలను విని శోభాశబ్దం శ్రేయస్సుకు దగ్గరగా ఉన్నదనుకొని శోభాకరం అనడానికి మారు శోభాస్కరం అని వాడి ఉంటాడు. అతని శిష్యగణం దానిని ప్రచారం చేసి వుంటుంది. గొర్రెదాటుగా తర్వాతి వారూ దానిని అనుసరించి ఉంటారు. ప్రచారమనేది అప్పటికి, ఇప్పటికీ వ్యాప్తికి పరమసాధనం గదా! అదేమి వైపరీత్యమో కాని, ఒప్పులకంటే తప్పులు, మంచి అలవాట్లకంటే వ్యసనాలు జనంలో త్వరగా అల్లుకుంటాయి. వాటి ఆకర్షణ అలాంటిది.

ఇకశోభాయమానానికి వద్దాం. పెళ్లి పందిరి శోభాయమానంగా వెలిగిపోతోంది విద్యుద్దీపాలతో. పెళ్లికూతురు అలంకారాలతో శోభాయమానంగా ఉంది–అనే ప్రయోగాలు నేటి కథలలో. నవలలో కోకొల్లలు. పెద్దపెద్ద రచయితలే ప్రయోగిస్తున్నారు. తప్పండీ ఇది అంటే జనమండీ ప్రమాణం, సిద్ధిర్లోకాత్ధృశ్యా అని ఆంధ్ర శబ్ద చింతామణికారుడే

అన్నాడండీ అని జవాబు. సిద్ధిర్లోకాద్ధ్రుశ్యా అనేది దేశి శబ్దాలకేగాని, సహస్రాబ్దాలుగా స్థిరపడిన సంస్కృత శబ్దాలకు కాదు. ఒకప్పుడు వివిధ రీతులుగా ఉన్న సంస్కృత పదాలను శిష్ట వ్యవహారాన్ని బట్టి వైయాకరుణులు స్థిరపరచారు. వాటిని మార్చితే అపభ్రంశమవుతుంది గాని సరైనది కాదు.

శోభాయమాన అనే పదాన్ని శోభించేది, ప్రకాశించేది అనే అర్థంలో వాడుతున్నారు. యమాన అనేది నిజమైనది కాకుండా, ఒకదానివలె కనిపించేది, ఒకదానివలె చేసేది, ఆచరించేది అనే అర్థాల్లో వస్తుంది. రామునివలె ఆచరిస్తున్నాడు = రామాయమానుడు, సీతవలె కనిపిస్తున్న మహిళ=సీతాయమాన. ఇక్కడ–శోభాయమాన అని ప్రయోగించేవాడి ఉద్దేశం శోభవలె కనిపించేది అనికాదు, శోభిస్తున్నది అని కదా. అలాంటప్పుడు ఈ పదాన్ని ప్రయోగిస్తే ఉద్దిష్టమయిన అర్థం రాదుగదా. కనుక శోభామాన అనే వాడాలి, శోభామాన అంటే ప్రకాశించేది అనిఅర్థం. ప్రత్యక్షంగా వెలిగిపోతున్నదాన్ని–ప్రకాశిస్తున్న దాన్ని ఏ వెర్రివాడూ, శోభవలె ఉంది అని గాని, శోభవలె కనిపిస్తున్నది. అని గాని అనడు కనుక శోభామాన అనే వాడడం ఉచితం అనుచితమైన పదం వాడి, అనుచితమైన అర్థాన్ని చెప్పడం ఎవరూ ఇష్టపడరు.

కనుక, యువ రచయితలారా, శోభస్కరం, శోభాయమానం అనే అపశబ్దాలు వాడకండి. ప్లీజ్ శోభాకరం, శోభామానం అనేవే వాడండి.

## విలేఖరి – లేకరి

ఏ సభకయినా వెళ్లండి. అక్కడ పత్రికా ప్రతినిధులకోసం కొన్ని కుర్చీలో, కుర్చీల వరసో ప్రత్యేకించి ఉంచడం కనిపిస్తుంది. ఆ కుర్చీల వరుసలోని మొదటికుర్చీకి "విలేఖరులు" అని తాటికాయంత అక్షరాలతో ఒక బోర్డు వేలాడగట్టి ఉండడమూ కనిపిస్తుంది.

వి అనే ఉపసర్గం మొదట్లో గల విఖ్ అనే ధాతువుకు కర్త్రర్థంలో–చేస్తున్నాడు అనే అర్థంలో అక(ణ్వుల్) అనే ప్రత్యయం వస్తే, వి+లిఖ్+అక=విలేఖకుడు అవుతుంది. వ్రాసేవాడు అని దీని అర్థం. కాని విలేఖరి అనే మాట వ్యాకరణ విరుద్ధం అని వైయాకరుణులు అంటారు. తెలుగు నామ వాచకాలపై కలవాడు అనే అర్థంలో చేర్చే అరి అనే ప్రత్యయాన్ని సంస్కృత పదాలకు – అందునా ధాతువు పైన చేర్చి – వి+లిఖ్+అరి=విలేఖరి అనే రూపాన్ని కల్పించడం వ్యాకరణ విరుద్ధమని వారి వాదం. వారి వాదం ప్రకారం లేఖకుడు అనే రూపమే సాధువు. అయితే విలేఖరి అనే పదం ఎలా ఏర్పడిందంటే, జూదరి, కల్లరి వంటి శబ్దాల సాదృశ్యం కారణం అని వారి సమాశ్వాసనం.

తెలుగు నిఘంటువులను తిరిగేయండి లేఖ- లేక అనే రూపాలు కనిపిస్తాయి. వాటి అర్థం జాబు అని. ఈ పదాలు ఆధారంగా ఏర్పడిన రూపాలు చాలా కనిపిస్తాయి. లేఖము=వ్రాతమూలము, ఇచ్చిపుచ్చుకోలు పత్రము, జాబు, లేఖ=రేఖ, చార, గీత, నాగేటిసాలు, పంక్తి, గీతలు గీయుట, చంద్రకళ, ఆకృతి, రూపము, గుర్తు, ఆనవాలు, పోలిక, సాదృశ్యము, మడిచి కుట్టిన అంచు, అంచు, శిఖ, కొప్పు. లేఖకము=వ్రాయడం, ఒక దానికి ప్రతివ్రాయడం, జాబు. లేఖకుడు=వ్రాయసగాడు, ఒకదానికి ప్రతివ్రాసేవాడు, శిల్పి, చిత్తరువు వ్రాయువాడు. లేఖనము=వ్రాతపని, చిత్రలేఖనం, బొమ్మలువేయడం, వ్రాత, చూచివ్రాత, ప్రతివ్రాత, గోకడం, గీరడం, తాకడం, తగలడం, సన్నగా చేయడం, శస్త్రవైద్యంలో కోయడం, గంట్లువేయడం, వేదము-శ్రుతి, గోకుకొనేపని ముట్టు, వృక్షవిశేషం, వ్రాయడం, వ్రాయడానికి ఉపయోగించే తాటాకు, భూర్జపత్రం-ఇన్ని అర్థాలిచ్చినది సూర్యారాయంధ్ర నిఘంటువు. లేఖనికుడు=జాబులు తీసుకుని పోయేవాడు, ఒక గుర్తు ఏర్పరచుకొనేవాడు, వ్రాయసకాడు, లేకరి. లేఖాధికారి=ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాసేపనివాడు. లేఖాహారుడు=లేఖలు-జాబులు తీసుకొని పోయేవాడు-లేఖిని=కలము, పేనా, గరిటె, దర్వి.

శబ్దరత్నాకరంగాని సూర్యారాయాంధ్ర నిఘంటువుగాని లేఖరి అనే పదం ఈయలేదు.

వి అనే ఉపసర్గతో ఉన్న లిఖ్ ధాతువుతో ఏర్పడిన పదం సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఒక్కటే కనిపిస్తుంది=విలేఖనము=గోకుట, గీరుట, వ్రాయుట, త్రవ్వుట, నిర్మూలనము చేయుట, వేళ్లతోగూడపీకి వేయుట, విడదీయుట. విలేఖనమును ఇచ్చారుగాని విలేఖకుడు లేదు. విలిఖించు=వ్రాయుఉంది. పత్రికా సంపాదకునికి, లేఖకుని, చందాదారుకు, పత్రికా ముద్రాపక ప్రచారకునికి లక్షణాలు చెప్పిన సంపాదకీయం అనే ప్రక్రియను తొలిసారిగా ప్రవర్తింపజేసిన మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు కూడ ఈ విషయాన్ని అంతగా చర్చించినట్లు కనిపించదు.

మనకు తత్సమ పదాలు సంస్కృతం నుంచేకాక ప్రాకృతంనుంచి కూడా వచ్చి చేరాయి. అగ్గి మొదలయినవి సంస్కృతంనుంచి కాక ప్రాకృతం నుంచే వచ్చాయి. ప్రాకృతం మనకు దాదాపు వెయ్యేళ్ల శాసనభాషగా ఉంది. కొన్ని వందల పాలీ-శౌరసేనీ ప్రాకృతపదాలు తెలుగులో కలిసిపోయి తెలుగు పదాలనే ముద్ర వేసుకున్నాయి. ఉదాహరణకు-సుంకరి, జూదరి, కమ్మరి, సొన్నారి వంటివి.

శుల్క అనే సంస్కృతపదం సుక్కో–సుంగో–సుంకో అని ప్రాకృతమైంది. దీనిని కర్ణాటకులు సుంకె అని గ్రహించారు. ప్రాకృతాలలో అకారం ఓకారమవుతుంది, ఏకారమూ అవుతుంది. కనుక వారు సుంకె అనే రూపం తీసుకొన్నారు. మనం సుంకంగా గ్రహించాము. శుల్క+హార=శుల్కహార–సుంకహార–సుంకఆర–సుంకర–సుంకరి అయి, స్థిరపడింది. శుల్కహారుడు–శుల్కం రాబట్టేవాడు. చతుర్థహార–చఉత్తఆర – చౌధర – చౌధరి– చౌదరి=నాలుగోవంతు పన్నుగా గ్రహించేవాడు.

ఈ సుంకరికి మరొక తెలుగు ప్రత్యయంచేరి సుంకరి+ఈడు=సుంకరీడు అనేరూపమూ, సుంక+ఈడు=సుంకేడు అనే రూపమూ ఏర్పడ్డాయి. అలాగే–

సువర్ణ–స్వర్ణ+కార అనే పదం ప్రాకృతంలో సొన్నార అయింది. అది తెలుగులో అలాగే దిగి సొన్నారి, సొనారి అనే రూపాలు ఏర్పడ్డాయి. సొన్నారి=బంగారు పని చేసేవాడు అలాగే.

కర్మ+కార=కర్మకార–కర్మార ప్రాకృతంలో కర్మకార–కమ్మఆర–కమ్మార అయి తెలుగులోకి కమ్మరగా దిగింది. దీనికి ఇనుప పని చేసేవాడని అర్థం. లోహ కర్మకార అనే రూపంనుంచి లోహశబ్దం జారిపోయి కర్మకార మాత్రమే మిగిలింది. లోహకారరూపమూ ఉంది. ఇది ప్రాకృతంలో లోహార అయింది. ఈ కమ్మర పదానికి కరుమరి, కరుమరి, అనే రూపాలూ ఉన్నాయి. కరుమర–కరుమరి ప్రాకృతంలో పనిచేసే స్త్రీ, పనిచేసేపురుషుడు–పనికత్తె, పనివాడు. ఈ కమ్మరి శబ్దానికి ఈడు అనే మరొక తెలుగు ప్రత్యయం చేరి కమ్మరీడు అనే పర్యాయమూ ఏర్పడింది. కమ్మటమంటే కొలిమి. ఇదీ కర్మ శబ్దభవమే కమ్మట+ఈడు=కమ్మటీడు–బంగారుపనివాడు. నిజానికి కమ్మరి కొలిమే అయినా, ఇప్పుడు బంగారుపని కుంపటి అని రూఢమయింది. కంచుపని చేసే కంసలి బంగారుపని వాడయినట్టు. కాంస్య–కంస–కంచ=కంచరి–కంసలి. ఇవన్నీ తెలుగు ప్రత్యయాలవల్ల వచ్చినవి కావు. కంచం–కంసలి–కంసాలి–పదాలు రెండు–కాంస్య+కారనుంచి కాంస్య+కార–కంస–ఆర=కంసార=కంసాల, కంసారి అయింది ఒకవైపు. మరొకవైపు–కాంస్య–కార–కాంస ఆర– కంచార–కంచర–కంచరి అయింది. బంగారు, కంచు, ఇనుము, కఱ్ఱ, రాయి పనివారిని పంచాణం వారంటారు. అంటే విరాట్ స్వరూపుడు, సృష్టికర్త అయిన విశ్వకర్మ పంచముఖాల నుంచి వచ్చిన వారని పురాణగాథలు. అట్లే జూదరి శబ్దం. ఇది ద్యూత + కార = ద్యూతకార –

జూద+ఆర, జూదార–జూదర–జూదరి అయింది. కన్నడంలో జూజూ, తెలుగులోను జూజు, జూజము అనే రూపాలున్నాయి. త వర్గ, చ వర్గాలు పరస్పరం మారడం సంస్కృతంలోను ఉంది. దంపతీ–జంపతీలాగ.

ఇంతగా రూప పదాలను ఉదాహరించి చర్చించడానికి కారణం ఏమిటంటే విలేఖరి అనే పదాన్ని వాడడం తప్పుకాదు అనడానికే.

లేఖ+కార–లేఖకార–లేఖ ఆర–లేఖార–లేఖర–లేఖరి కావడం తెలుగు వ్యాకరణ విరుద్ధం కాదు. ప్రాకృతంనుంచి లేఖకార శబ్దం మనకు లేకరి అయింది. వి ఉపసర్గతో విలేకరి అని కావచ్చు. మనకు అచ్చ తెనుగులో మహా ప్రాణాలు లేవు గనుక లేకరి అని ప్రాచీనమైనవాడుక, ప్రాకృతంనుంచి మనం లేఖ+ఆర – లేఖార – లేఖర–లేఖరి అని గ్రహించినప్పుడు విలేఖరి అని వాడడం ప్రమాదభరితం కాదని భావిస్తున్నాను. భాషావేత్తలు పరిశీలించాలని మనవి.

## జయంతి – వర్ధంతి

నూతన కార్య ప్రారంభానికో, శుభకార్యానికో మంచి ముహూర్తం చూడడమనేది సర్వత్రా ఉంది. నిజానికి ప్రతి దినమూ మంచిదే, ప్రతిక్షణమూ విలువైనదే. కాని, మానవుడు తన మనోబలం కోసం ఇలాంటి పనులు చేస్తుంటాడు విశ్వాసంతో. దీనికి కారణం నక్షత్ర తారాగ్రహ సన్నివేశం ఒక విధంగా వున్నప్పుడు వాటి కాంతి మానవునిపై పడి, మనస్సును ఉత్తేజపరచి ఉత్సాహ క్రియాశక్తులను ఇనుమడింపజేస్తుందని జ్యోతిర్వేత్తలు చెప్పడమే. వీటినే లగ్నమని, ముహూర్తమని అంటాము. ఫలానా నక్షత్రం ఫలానా సమయంలో ఉన్నప్పుడు చాలా శుభకరం అని జ్యోతిర్వేత్తలు నిర్ణయించారు. ఉదా॥ విజయదశమిని పరిశీలిద్దాం.

ఆశ్వయుజ శుద్ధదశమిని విజయదశమి అంటారు. ఈనాడు పూర్వపురాజులు పొరుగురాజ్యాలపై దండెత్తేవారు. ఎందుకంటే.

“ఆశ్వయుత్ శుక్లదశమీ

విజయాఖ్యాఖిలే శుభా

ప్రయాణేతు విశేషేణ

కింపునః శ్రవణాన్విత”

అని ధర్మశాస్త్రవచనం. ఆశ్వయుజశుద్ధ దశమిని విజయదశమి అంటారు. ఇది అన్ని పనులు ప్రారంభించడానికీ మేలైనది. ప్రయాణాలకు మరీ మంచిది. ఆనాడు శ్రవణ నక్షత్రం ఉంటే ఇక చెప్పనక్కరలేదు–అని ఈ శ్లోకం అర్థం. అందుకే పూర్వం రాజులు ఈ దినం దండయాత్రకు బయలుదేరేవారు.

ధర్మశాస్త్రజ్ఞులు ఈ విషయంలో మరొక సంగతీ చెప్పారు. ఆశ్వయుజ శుద్ధ దశమి సాయంకాలం దండయాత్ర శుభం. సాయంకాలం పదకొండవ ముహూర్తాన్ని విజయః అని అంటారు. విజయం కోరే రాజులు ఆ ముహూర్తాన దండు వెడలాలి. అలాగే శ్రవణ నక్షత్రంలో కలిసి ఏ శుక్ల పక్ష ద్వాదశి అయినా విజయాద్వాదశే. ఇది మహాపుణ్యదినమని వారు చెప్పారు. విజయసప్తమి కూడ ఉంది.

ఇలాగే జయంతీ అనేది కూడ ఒక విశేష ముహూర్తమని ధర్మ శాస్త్రజ్ఞులు అన్నారు.

చంద్రుడు లగ్నానికి పదకొండవ స్థానంలో ఉచ్చస్థితిలో ఉంటే, దానిని జయంతీ అని అంటారు. ఇది శత్రుపక్ష వినాశకరమైంది–అని దీని అర్థం.

కనుకనే జయంతీ అనే ఈ కారాంత శబ్దానికి ఇంద్రుని కూతురు, పార్వతి, టెక్కెంతక్కిల చెట్టు అని కొన్ని నిఘంటువులు అర్థం చెప్పినా, శబ్దార్థ కల్పతరువనే సంస్కృతాంధ్ర నిఘంటువు అదనంగా దుర్గ, పార్వతి, సేవకురాలు, రోహిణీయుక్త శ్రావణమాస కృష్ణపక్ష అష్టమి, శ్రీకృష్ణ జయంతి అనే అర్థాలు ఇచ్చింది. వాచస్పత్యం కూడా విష్ణుధర్మ సనత్కుమార సంహితా, వశిష్ఠ సంహితలలోని ప్రమాణాలను ఉదాహరించింది. వశిష్ఠ సంహిత మరొక విశేషం చెప్పింది.

"శ్రావణేవా నభస్యే వా
రోహిణీ సహితాష్టమీ,
యదాకృష్ణా నరైర్లబ్ధా
సాజయంతీతి కీర్తితా"

శ్రావణ, భాద్రపద మాసాలలో కృష్ణపక్షంలో రోహిణీ నక్షత్రంతో పాటు వచ్చే అష్టమిని జయంతీ అని అంటారని దీని అర్థం.

ఈ ధర్మశాస్త్ర, పురాణ, జ్యోతిష ప్రమాణాలనుబట్టి లగ్నానికి ఏకాదశ స్థానంలో చంద్రుడు ఉచ్చస్థితిలో ఉన్నా, శ్రావణ భాద్రపద మాసాల కృష్ణపక్ష అష్టమినాడు రోహిణీ నక్షత్రమున్నా ఆ గ్రహనక్షత్రసన్నివేశాన్ని జయంతీ అని అంటారని, అది మహా పుణ్యదినమని సారాంశం.

అందువలననే కృష్ణాష్టమి పండుగ విషయంలో తరచు అభిప్రాయభేదాలు ఏర్పడి కొందరు శ్రావణ బహుళ అష్టమినాడు, ఆనాడు నక్షత్రంరాలేదని కొందరు – ఆనక్షత్రం వచ్చే భాద్రపద బహుళాష్టమినాడు జరుపుకొనడం జరుగుతున్నది.

ఈ పద్ధతిని మనదేశంలోని శ్రీవైష్ణవ సంప్రదాయం వారు పాటిస్తున్నారు. వీరు కృష్ణాష్టమిని శ్రీ జయంతి అంటారు. ఒకొకప్పుడు శ్రావణ బహుళ అష్టమినాడు రోహిణీ నక్షత్రం రాదు. అప్పుడు భాద్రపద బహుళంలో రోహిణీ నక్షత్రం బట్టీ శ్రీజయంతి జరుగుతుంది. ఇతర తిథులకూ జయంతీ అనే వ్యవహారం ఉన్నా, ఎక్కువగా వైష్ణవులు జరుపుకొనే కృష్ణాష్టమికే శ్రీజయంతి అనే పేరు రూఢమైంది. అందువల్లనే వేదాంతదేశికుల వారు తమ గోపాలవింశతి ప్రారంభంలో.

వందే బృందావనచరం

వల్లవీజనవల్లభమ్,

జయంతీ సంభవంధామ

వైజయంతీ విభూషణమ్

అని కృష్ణుణ్ని స్తుతించారు. జయంతినాడు ఉదయించిన కాంతివంటివాడు, వైజయంతీ మాలాలంకృతుడు, గొల్లపడుచులకు వల్లభుడు, బృందావన సంచారి అయిన కృష్ణుడికి సమస్కరిస్తున్నాను అని దీని అర్థం. జయంతీ శబ్దానికి సాహిత్యంలో లభిస్తున్న తొలిప్రయోగం వేదాంతదేశికులదే.

జన్మ నక్షత్రాన్నిబట్టి పుట్టిన రోజు పండుగ, జన్మ తిథిని బట్టి మరణ దిన విధులు జరుపుకొనడం అనాదిగా వైష్ణవ సంప్రదాయం. ఇది ప్రతి వైష్ణవ దేవాలయంలోను, భక్తుల ఇళ్లలోను పాటించడం నేడూ ఉంది. ఈ సంప్రదాయ ప్రాబల్యాన్ని బట్టే జయంతి అనగా పెద్దల జన్మదినం అనే రూఢి ఏర్పడింది. దీన్ని సూర్యారాయాంధ్ర నిఘంటువు గ్రహించి పొందుపరచింది.

వర్ధంతీ అనేమాట ఒకటుంది. దీనిని ఉత్తర భారతీయులు జయంతికి పర్యాయపదంగా వాడుతున్నారు. ఇది ఏ ప్రాచీన సంస్కృతకోశాలలోగాని, మోనియర్ విల్లియమ్స్ సంస్కృత నిఘంటువు వంటి ఆధునిక నిఘంటువులలోగాని కానరాదు. ఇది ఉత్తరాది నుంచి మనకు దిగుమతి అయింది. కాని మనకు జయంతి అనే పదం అదివరకే వ్యాప్తిలో ఉంది గనుక ఈ వర్ధంతిని మన మరణ తిథికి వాడుకోడం ప్రారంభించాము. ఈ పదాన్ని ఉత్తర భారత పండితులు ఏ ఆధారంతో రూపొందించారో కూడా అర్థం కాదు.

ఈ వర్ధంతీపదం వృధ్ అనే ధాతువునుంచి పుట్టినట్టు తోస్తుంది గాని, ఈ ధాతువు ఆత్మనే పదం కనుక వర్ధంతీ అనే పదం ఏర్పడడానికి వీలులేదు. సంస్కృతంలో వర్ధాపన అనే మాట ఉంది. దీనికి పుట్టిన శిశువు బొడ్డుకోయడం అని అర్థం. వర్ధాపక=బొడ్డుకోసేవాడు, వర్ధాపన శబ్దానికి ఛేదించడం, ముక్కలు చేయడం, అనే అర్థాలూ ఉన్నాయి. ఈ పని అభివృద్ధికై చేసేపని గనుక శుభకరంగానే గ్రహించారు. దీనినుంచి ఏర్పడివుంటుందేమో వర్ధంతి! దీనిని ఉత్తరాదివారు జయంతికి పర్యాయంగా వాడడానికి అభ్యంతరం లేదు. మరి మనకు మరణ తిథికి ఎలా అయింది?

దీనికి కొంచెం డొంకతిరుగుడుగా ఆలోచించవలసి ఉంటుంది. శ్రాద్ధకర్మ చివర శ్రాద్ధకర్త "అస్మద్గోత్రం వర్ధతాం' మా వంశం వర్ధిల్లుగాక! అని ఒక నీరు నిండిన దొన్నెను బోర్లిస్తాడు. మరణించినవారు పితృదేవతలుగా తమ వంశాన్ని కరుణించాలని దీని అర్థం. బోర్లించడం మరణానికి, నీరు జీవి వంశం కొనసాగడానికి సంకేతం. వర్ధతాం అనేది ఏకవచనం. వర్ధంతాం బహువచనం. ఈ వర్ధతా - వర్ధంతాం అనే మాటలనుంచి వర్ధంతీ పుట్టిందేమోనని నేను భావిస్తున్నాను. దీనిలో అంతమూ, ఆదీ, రెండూ ఉన్నాయి. ఉత్తరాదివారు అంతం తర్వాత కలిగే ఆదిని గ్రహించారు, మనం అంతాన్ని గ్రహించి మరణ తిథికే వాడుతున్నాము.

జయంతీ, వర్ధంతీ పదాలను ఇంతగా వివరించడానికి కారణం వాటి స్వరూపాలు స్పష్టమయినప్పుడు ప్రయోగంలో చిక్కులు ఉండవనడానికే, జయంతీ తెలుగు సంప్రదాయం ప్రకారం హ్రస్వమై జయంతి అయింది. ఒకప్పుడు నిర్దిష్ట దినాలకే వాడుకలో ఉన్నా, ప్రస్తుతం జన్మదినానికే నిర్ణీతమయింది. వర్ధంతి ఉత్తరాదివారు ఎలావాడినా, మనం మరణదినానికే వాడుతున్నాము.

## చారిత్రక - చారిత్రిక

చరిత్ర అనే పదానికి ఇప్పుడు మనం హిస్టరీ అనే ఆంగ్లపదంతో వ్యవహరిస్తున్న అర్థం పూర్వం ఉన్నట్టు కనిపించదు.

చరితం రఘునాథస్య<br>
శతకోటి ప్రవిస్తరమ్,<br>
ఏకైక మక్షరం ప్రోక్తం<br>
మహా పాతక నాశనమ్.

అనే శ్లోకాలలోగాని, హర్షచరితం వంటి కావ్య నామధేయాలలోగాని ఉన్న చరితం అనే పదానికి మొదట్లో నడవడి, చర్య–పని అనే అర్థాలేగాని, ఇతిహాసం, కథ అనే అర్థాలు కానరావు.

చరిత–చరిత్ర పదానికి మోనియర్ విల్లియమ్స్ వెళ్లిన, పొందిన, గతించిన, నడవడి, అభ్యాసం, అలవాటు, అనుష్ఠానం, కృత్యం, సాహసకృత్యం మొదలయిన అర్థాలిచ్చాడు. చరిత్ర అనే పదానికి కూడ దాదాపు ఇవే అర్థాలు ఇచ్చాడు. ఇతిహాస అనే పదానికి కథ, సంప్రదాయం, హిస్టరీ, గడచిన వృత్తాంతాల కథనం అనే అర్థాలిచ్చాడు. 'చరిత్రకారుడు' అనే పదమే లేదు. ఇతిహాసిక అనే పదానికి సాంప్రదాయికమైన, పరంపరాగతమైన, ప్రాచీన కథలకు సంబంధించిన, హిస్టారికల్, హిస్టోరియన్– ఐతిహాసికుడు అనే అర్థాలిచ్చాడు.

గొప్పవ్యక్తుల నడవడి, కృత్యాలు, పద్ధతులు, అనుష్ఠానమూ క్రమంగా సంఘంకథ, దేశంకథ అవుతాయి గనుక శ్రీ మామిడి వెంకయ్య వంటి ఇటీవలి సంస్కృత నిఘంటుకారులు చరిత్ర – చరిత పదానికి ఇతిహాసం అనే అర్థమూ ఇచ్చారు.

కన్నడ నిఘంటుకారుడు చరిత్ర అనే పదానికి హిస్టరీ అనే అర్థమిచ్చి, చరిత్రగా'ఱ' అనేది కూడా గ్రహించి, హిస్టోరియన్ అనే అర్థమిచ్చాడు.

ఏమైనా చరిత–చరిత్ర పదానికి హిస్టరీ అనే అర్థం ఇటీవలిదే. కాలం మార్పుతోపాటు కొన్ని పదాలకు అర్థచ్ఛాయలు ఏర్పడడం, నూతనార్థాలు రావడం భాషా లక్షణం గనుక చరిత్ర అనే పదానికి హిస్టరీ అనే అర్థం కలుగడం సంతోషించదగిందే. దానితో ఏర్పడిన చరిత్రగాఱలాగ చరిత్రకారుడు కూడా తెలుగు నిఘంటువులు గ్రహించవలసింది. ఎందుకు మానుకున్నాయో!

ఈ చరిత్ర పదాన్ని బట్టి దీన్ని తద్ధిత రూపం చారిత్రకుడు, చారిత్రికుడు అని రెండు విధాలుగా వాడుతున్నారు. నేను 1947లో ఆంధ్రప్రభలో చేరినప్పుడు లీడర్‌రైటర్ శ్రీ చల్లా జగన్నాథంగారు చరిత్రకారుల మహాసభపై సంపాదకీయం వ్రాయదలచి, నన్ను పిలిచి చారిత్రకులు, చారిత్రికులు అనే వాటిలో ఏది సాధువు అని ప్రశ్నించారు. పాణినీయం ప్రకారం అయితే ఈ రెండూ పదాలూ కొత్తవండీ – అన్నాను. ఇవి వాడుకలోకి వచ్చాయి, ఈ రెండింటిలో ఏది మనం వ్యాకరణానికి దగ్గరిదని నమ్మవచ్చును? అనడిగారు. ప్రస్తుతానికి చారిత్రికులు అని వాడండి. మీ సంపాదకీయం వ్రాసిన తర్వాత వివరిస్తాను అన్నాను.

ఆ సాయంత్రం దొరికిన కొద్దిపాటి తీరికలో వివరించడానికి పూనుకున్నాను. ఆయన వెంటనే నన్ను ఆపి, నాకు సూత్రాల పంచాయితీ వద్దు. సారాంశం చెప్పండి అన్నారు.

చరిత్ర పదాన్ని దేశ చరిత్రకు ఇటీవల తరచు వాడుతున్నారు. చరిత్రపదం సంబంధంతో చరిత్ర చదువుకున్నవాడు, చరిత్రకు సంబంధించినవారు అనే అర్థాలలో చరిత్ర శబ్దంపై తద్ధిత ప్రత్యయం చేర్చి, అంటే ఇక అనే ప్రత్యయం చేర్చి చారిత్రక, చారిత్రిక అనే ప్రయోగాలు వాడుతున్నారు. పాణిని కాలంలో చరిత్రకు అర్థం ఇదివరకే వివరించాను. అప్పుడు ఇతిహాసం అనే వాడేవారు. దానికి ఇక ప్రత్యయం చేర్చితే ఐతిహాసికుడు అనే రూపం ఏర్పడుతుంది. దీనికి ఇతిహాసజ్ఞుడు, ఇతిహాసానికి సంబంధించినవాడు, ఇతిహాసానికి సంబంధించినది అనే అర్థాలు వస్తాయి. పాణిని సూత్రాలలోని తదధీతే, తద్వేద అనే సూత్రం ప్రకారం, ఫలానా విషయం చదువుతున్నాడు, తెలుసుకుంటున్నాడు అనే అర్థంలో వ్యాకరణం అధ్యయనం చేసిన వాడు వైయాకరణుడు, ఛందస్సు చదివినవాడు ఛాందసుడు మొదలయిన రూపాలు ఏర్పడుతాయి. ఈ విధంగా చరిత్ర చదివినవాడు, తెలుసుకున్న వాడు అనే అర్థంలో చరిత్ర+అణ్ చారిత్ర– చారిత్రుడు అనే రూపం ఏర్పడుతుంది. చారిత్రకుడో, చారిత్రికుడో కాదు. చారిత్రుడు అనే ప్రయోగం లేదు.

మరి చారిత్రకులు అనే రూపానికి గతి ఏమిటి? ఎలా పుట్టింది? చరిత్ర శబ్దంపై అక అనే ప్రత్యయం వస్తే చారిత్రక అనే రూపం ఏర్పడుతుంది. పాణిని కొన్ని పదాలను కలిపి గుంపులు గుంపులుగా చేసి, వాటిని గణాలు అని పేర్కొని గణపాఠం కూడ రచించాడు. ఆయా గణాలలోని పదాలకు ఆయా ప్రత్యయాలు వస్తాయని నిర్ణయించాడు. చరిత్ర అనే పదం, పాణిని అక ప్రత్యయం విధించే ఏ గణంలోను లేదు. కనుక చారిత్రక అనే రూపం పుట్టదు, పాణినీయం ప్రకారం అక ప్రత్యయానికి ఆస్కారం లేదు.

అయితే, ఈ పేచీకోరు చారిత్రకుడు మన కెందుకని? చారిత్రిక అనే రూపమూ వాడుకలో ఉందిగదా, దానికే ప్రచారం ఇద్దాం అని అనుకుంటే ఇందులోను ఒక పేచీ ఉంది. చరిత్ర శబ్దంపై ఇక ప్రత్యయమూ రాదు పాణిని ప్రకారం.

మనపూర్వ పత్రికా సంపాదకులు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారి వంటివారు మహాపండితులు, దేశకాలానుగుణంగా వస్తున్న మార్పులకు అనుగుణంగా ఎన్నో నూతన పదాలను వ్యాకరణావిరోధంగా సృష్టించిన విద్వాంసులు. ఈ పదాలను తప్పని తెలిసి ఎలా వాడారు? అనే సంశయం కలుగుతుంది. వారు పొరబడలేదు పాణిని కాలం

తర్వాత, సాదృశ్యంతో ఎన్నో కొత్త పదాలు పుట్టుకు వచ్చాయి. కాత్యాయనుడు తన కాలంలో పౌరాణిక, ఐతిహాసిక వంటి పదాలు ప్రచారంలో ఉండడం చూచాడు. ఇతిహాసం చదివినవాడు, తెలిసినవాడు, పురాణం చదివినవాడు, తెలిసినవాడు అని అర్థం. ఆఖ్యానాఖ్యాయికేతిహాస పురాణేభ్యః ఠక్ వక్తవ్యః– అని ఒక వార్తికం సవరణ తెచ్చాడు. దానితో పౌరాణిక, ఐతిహాసిక వంటి చాలా పదాలు సాధువులు అయ్యాయి. ఠక్, ఠన్ అంటే ఇక ప్రత్యయం. ఈ వార్తికం ఆధారంగా, చరిత్రపదం పాణిని చెప్పిన గణాలలో లేకపోయినా, పై శబ్దాల సాదృశ్యంతో చారిత్రక – చరిత్ర చదివిన వాళ్లు, చరిత్ర తెలిసినవాళ్లు – అనే శబ్దం సృష్టించుకున్నారు. సాదృశ్యమనేది భాషాభివృద్ధిలో పెద్దసూత్రం. పైన చెప్పిన వార్తికానికి అర్థం ఏమిటంటే, ఆఖ్యాన, ఆఖ్యాయిక, ఇతిహాస, పురాణ శబ్దాలకు కూడా ఇక ప్రత్యయం చెప్పుకోవాలి అని. దీనితో చారిత్రక అనే పదానికి ఒకదారి దొరకింది. ఈ చారిత్రిక వెంట చారిత్రకకూడా తోకవెంబడి నారాయణగా రంగ ప్రవేశం చేసింది. ఇలాగే చారిత్రికం అంటే చరిత్రకు సంబంధించిన అని అర్థం.

చారిత్రక, చారిత్రిక శబ్దాలలో చారిత్రికం వ్యాకరణానికి దగ్గరిదని స్పష్టమయిందికదా! చారిత్రకం అని వాడడానికన్నా చారిత్రికం అని వాడడమే మేలు, చారిత్రకకూడ చాలా ప్రాచుర్యం పొందింది గనుక, దానిని వదలలేనివారు, తప్పు తెలుసుకోడం మంచిది. ఏట్లో పారేసినా ఎంచి పారేయమన్నారు, పైసలను పెద్దలు. తప్పు తెలుసుకుంటే ఎప్పటికయినా సరిదిద్దుకొనే అవకాశం ఉంటుంది.

## కూసు విద్య – అక్కుపక్షి

ఈమధ్య మధురాంతకం రాజారాం గారికి అమెరికాలో ఉన్న అప్పాజోస్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్‌వారు ప్రతిభామూర్తి పురస్కారం అందజేసిన సందర్భంగా జరిగిన ఉత్సవంలో పాల్గొనడానికి బెజవాడ వెళ్లాము.

ఆ సభలో ఒక వక్త ప్రసంగిస్తూ రాజారాంగారు కథానిక రచనను అలవోకగా కొనసాగిస్తారని ప్రశంసిస్తూ, 'కూసువిద్య' అని ప్రయోగించారు. ఎవరికైనా అలవాటయిన పనిని సులభంగా చేసినప్పుడు ఇలాగే అభ్యాసం కూసువిద్య అనే సామెతను వాడుతారు. "అతనికేమండీ, సులభంగా రోజుకొక కథ వ్రాసేస్తాడు. అభ్యాసం కూసువిద్య" అంటారు. ఆ వక్త కూడా అలాగే ఆ సామెతను ప్రయోగించారు.

ఆ ప్రసంగం వింటున్న నా పక్క పెద్ద మనిషి సైన్యంలో పెద్ద ఉద్యోగి. "కూసు విద్య అంటే ఏమిటి సార్?" అని ప్రశ్నించారు నన్ను. 'తినగతినగా వేము తియ్యనుండు' అని అన్నాడండీ వేమన. అలవాటయినవాడికి ఆ పని చాలా సులువు అని అర్థమండీ అని అన్నాను.

"ఆ పద్యం పూర్తిగా చెబుదురూ" అని కోరారు. చెప్పాను.

"అనగననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగతినగ వేము తియ్యనుండు,
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ"

అని, పూర్తిగా చదివి, "అభ్యాసం చేసిన కొద్దీ సంగీతం బాగా పాడగలుగుతాడు. తినగ తినగా వేపాకు తియ్యనిదని అనిపిస్తుంది. ఏ పనైనా సాధన చేయడంవల్ల – అభ్యాసం చేయడం వల్ల చేకూరుతాయి అని అర్థమూ వివరించాను.

"అయితే కూసువిద్య అంటే సులభంగా చేయదగింది అన్నమాట. మరి కూసు అంటే ఏమిటండీ"? అని ప్రశ్నించారు, ఆయన.

కొంచెం ఆలోచనలో పడ్డాను. "రేపు మీరు వస్తారు గదా! రేపు చెపుతాను" అన్నాను ఆయనతో. "అదేమిటి? అంత ఆలోచించవలసిన విషయమా ఇది?" అని కళ్లు పెద్దవి చేశారు ఆయన.

"చిన్న పామునైనా పెద్దకర్రతో కొట్టాలన్నారండీ పెద్దలు. చిన్న విషయమైనా బాగా ఆలోచించి స్పష్టంగా తెలుసుకొని చెప్పడం మంచిది కదా!" అని అన్నాను.

రాత్రి ఆలోచించాను. ఒక పరిష్కారం కుదిరింది. కాని, ఒకసారి నిఘంటువులను తిరగేస్తే మంచిదని నిర్ణయించుకున్నాను. మనం చెబితే వినే వ్యక్తి పెద్ద మిలటరీ అధికారి. ఆయన మనస్సుకు నచ్చాలి గదా మనం చెప్పిన విషయం! కనుక నాసందేహం నివృత్తికి నిఘంటువులు హఠాత్తుగా ఎలా దొరుకుతాయి? ఏదో సభలో పాల్గొనడానికి గ్రంథాలయాల వెంట తిరగడం ఏం మర్యాద? అనుకుని వేరే నెరవు కోసం ఆలోచిస్తున్నాను.

మరునటిదినం అక్కడి ఆకాశవాణి కేంద్రంలో మిత్రులు డాక్టర్ ఆర్.పద్మనాభరావుగారు సంచాలకులుగా ఉన్నారని తెలిసి, ఆయనను నెచ్చెలి చూపుగా చూడ్డానికి వెళ్లాను. ఆ సందర్భంలో ఆకాశవాణి గ్రంథాలయంలో తెలుగు నిఘంటువులను తిరగేశాను.

శబ్దరత్నాకరంలోగాని, సూర్యరాయాంధ్ర నిఘంటువులోగాని 'కూసు' అనే పదంలేదు. 'కూన' అనేపదం ఉంది. దీనికి పిల్ల, బిడ్డ అని అర్థం. దీనికి రూపాంతరం కున్న, కన్నదు=బాలుడు, చిన్నవాడు అని శబ్దరత్నాకరం చెబుతున్నది.

సూర్యరాయాంధ్ర నిఘంటువు కూన, కున్న, కున్నడు అనే పదాలు ఇచ్చి అర్థాలు చెప్పడంతోపాటు మరికొన్ని కూనపదంతో ఏర్పడినవీ వివరించింది. కూన–కున్న=కొంచెము, పశుపక్ష్యాదుల శిశువు. కూనరాగం–కూనిరాగ=సన్ననిరాగం, కూనలమ్మ=సంతతినిచ్చేదేవత, గ్రామదేవత, కూనలమ్మ చీర గళ్లచీర=గళ్లచీర కూనలమ్మ మధ్య యుగంలో తెలుగు నాట వెలసిన ఒక కవయిత్రి.

'కవితారసపు జల్లు

ఖడ్గాల గలగల్లు

కరణాలకే చెల్లు

ఓ కూనలమ్మా!'

అంటూ నిజంగా కవితారసపుజల్లులున్న గేయాలు ఎన్నో పాడింది. వీటికి కూనలమ్మ పదాలని పేరు. ఈ ఒరవడిలోనే మిత్రులు శ్రీ ఆరుద్రగారు కూడా ఇలాంటి గేయాలు మధురమైనవి రచించారు.

ఏమైనా 'కూసు' అనే పదం మన నిఘంటువులలో కానరాలేదు.

సాయంకాలం ఆ మిలటరీ పెద్ద మనిషికి ఏదో చెప్పి నా మానం కాపాడుకోవాలిగదా! చెప్పాను. "అయ్యా! కూసువిద్య అంటే సులభమైన, అలవోకగా, ఎలాంటి శ్రమా లేకుండా చేసే పని అని నిన్ననే చెప్పానుగదా! కూసు అంటే కన్నడంలో శిశువు, అని అర్థం. పసిపాప, కన్య అని అర్థాలు. కూసాట=పిల్లల ఆట, కూసుతన=పిల్లతనం. కూసువిద్య అంటే, అలవాటయిన పని, చిన్నపిల్లల ఆటలాగ చేయదగినంత సుకరమైనది అని అర్థం. విద్య అంటే పని అని ఇక్కడ మనం అనుకోవాలి. పిల్ల వాళ్లు కూడా నేర్వదగినంత సులభతరమైంది, చేయదగినంత సుకరతరమైంది అని అర్థం. కూసు అనే మాట ఈ సామెతలో తప్ప మరెక్కడా కనిపించదు. తెలుగు తోబుట్టువులయిన తమిళ, కన్నడ, మలయాళాది భాషలకు ఉమ్మడిగా ఉన్న పదాలు ఎన్నో కొన్ని భాషలలో మాత్రం మిగిలిపోయి, కొన్ని భాషలలో లుప్తమయిపోయాయి. ఈ కూసుశబ్దం కూడా అలాంటిదే, ఇది కన్నడంలో ఉంది. తమిళ, మలయాళాలలో కుంజు అని రూపాంతరం చెందింది. ఒకప్పుడు వ్యవహారంలో ఉండి ఉంటుంది. క్రమంగా వ్యవహారచ్యుతమై అభ్యాసం కూసువిద్య అనే నానుడిలో మిగిలిపోయింది.

ఇలా లుప్తమైపోయిన మరొక పదబంధం 'అక్కుపక్షి'. ఈ మాట శబ్దరత్నాకరంలో లేదు. సూర్యరాయాంధ్ర నిఘంటువు దీనిని చూపి, బక్కవానికి ఉపమానముగా గ్రహింపబడు

నొకానొక పక్షి అని అర్థం వివరించి, వాడు అక్కు పక్షివలె ఉన్నాడు- అనే వ్యవహారోదాహరణం చూపింది.

"నిజానికి సూర్యరాయాంధ్ర నిఘంటువు చెప్పినట్టు అక్కుపక్షి ఒకానొక పక్షి కాదు. ఒకే అర్థమిచ్చే, ఒకే పదం నుంచి వచ్చిన రెండు పదాలకలయిక. సాధారణంగా మనం చూచే పిచ్చుకలు, కాకులు మొదలయిన పక్షులు ముడుచుకొని కూచున్నట్టు కొమ్మల మీదో, గూళ్లలోనో వాలి ఉంటాయి. ఒంటరిగా ఉన్న వాడినో, ముడుచుకుని దీనంగా కనిపించేవాడినో అక్కుపక్షిలాగ ఉన్నాడని వెక్కిరిస్తారు. ఇది కూడా కన్నడ పదమే. మనకూ వ్యవహారంలో ఉండి, జారిపోయి ఒక్క ఈ పదబంధంలోనే మిగిలిపోయిందనుకుంటాను."

"అక్కుపక్షి ఒకే పదం రెండు రూపాలన్నారే, అదెలా?" అని ఆయన వెంటనే కోర్ట్ మార్షల్ ప్రారంభించారు.

"వినండి సావధానంగా అంటూ ఇలా వివరించాను;" పక్కి అనేది మనకు ప్రాకృతం నుంచి వచ్చిన పదం. పక్షి పక్కి అయింది, హొసగన్నడం (నవీన కన్నడం) ప్రకారం ప-హ-అయి హక్కి అయింది. ఇతర ఉత్తరాపథ భాషలలో పంఖీ, పంఛీ అని రకరకాలయింది. ఈ హక్కి సామాన్య జనుల నోట్లోపడి అక్కి అయింది. పాలీ మొదలయిన ప్రాకృతాల నుంచి వందలకొలది పదాలను సొంతం చేసుకున్న మన తెలుగులోను పక్కి ఉంది. కన్నడం నుంచి వచ్చిన హక్కి – అక్కి కూడ వ్యవహారంలో ఉండి, కొంతకాలానికి మరుగైపోయి ఉంటుంది. ఒక్క అక్కు-పక్షి అనే పదబంధంలో మాత్రం మిగిలిపోయింది. అక్కి అన్నా పక్షే, పక్షి అన్న పక్షే – అక్కి+పక్షి=అక్కిపక్షి క్రమంగా అక్కు పక్షి అయింది. ఒక భాష నుంచి కొత్తగా చేరిన పదాన్ని వివరించడానికి అంతకుముందు వ్యవహారంలో ఉన్న పదం కలిపి వాడడం మన భాషా సంప్రదాయం – గేట్ వాకిలిలాగ, ఈ పద్ధతి ఇతర భాషలలోనూ ఉంది".

నా వివరణ ఆ మిలటరీ ఆఫీసరుకు నచ్చిందో, లేదో ముఖాన్ని బట్టి గ్రహించలేకపోయాను. మిలటరీ అధికారులు తమ భావాలను ముఖంపై కనపడనీరు!

## పేర్లకు పట్టిన పీడ

భారతీయ వర్ణమాలలో విశిష్టత ఉచ్చారణకు 99శాతం దగ్గరగా ఉండడం. మన వర్ణమాలలో ఆంగ్లాదిభాషల ఒకటిరెండు ధ్వనులు తెలిపే వర్ణాలులేక పోవచ్చుకాని, ఉచ్చరించిన దానిని 99 శాతం సరిగ్గా వ్రాయడానికి తగినంత శక్తి ఉంది. కాని, మనం భారతీయ భాషల పదాలను ముఖ్యంగా వ్యక్తుల పేర్లను సరిగా ఉచ్చరించడానికి గాని, వ్రాయడానికిగాని ప్రయత్నించం. మీదు మిక్కిలి వాటిని భ్రష్టు పట్టించడానికి ప్రయత్నిస్తాం.

ఇక ఆంగ్ల ఉచ్చారణను గాని, వ్రాతనుగాని భక్తి శ్రద్ధలతో పాటిస్తాము. నిజానికి ఆంగ్లాది పాశ్చాత్య పదాల వ్రాత ఒకటి, ఉచ్చారణ మరొకటి. అది వాళ్ల సంప్రదాయం. వారికి ఆర్ పలకదు, ట వర్గం పలకదు. ఒక మారు ఆల్ ఇండియా హిస్టరీ కాంగ్రెసులో ఒక పాశ్చాత్యునితో ముఖాముఖి భేటీ కలిగింది. నీ ప్రధాన విషయమేమని ప్రశ్నించాను. "ఈందియన్ హిస్తోరీ" అన్నాడు, నాకు అర్థం చేసుకోడానికి రెండునిమిషాలు పట్టింది. సింగపూర్‌లో ఒక డిపార్ట్‌మెంటల్ స్టోరులో తిరుగుతూ "ఫలానా వస్తువు ఎక్కడ ఉంది?" అనడిగాను "అప్‌స్తార్స్" అని ఒక అమ్మాయి నోరంత తెరిచి చెప్పింది. ఆమె లిప్‌స్టిక్ పెదవులను, చక్కని పలువరుసను చూచి ఆనందించానుగాని ఏమీ అర్థం కాలేదు. మనం అప్‌స్టేర్స్ అంటాము. ఆవిడ స్తాఆ ఆర్స్ అని నోరంత తెరవగా ఏమీ గ్రహించలేకపోయాను. ఆవిడ దయదలచి ఒక కాగితంపై మేడమెట్లు బొమ్మ గీచి చూపింది. అది వారిభాష, వారి ఉచ్చారణ దానిని మనవారు శ్రద్ధగా నేర్చుకుంటారు.

మనం "ఇండియన్ ఇంగ్లీషుతో" ఉచ్చరిస్తామనుకోండి. నవ్వుతారు ఆ పాశ్చాత్యమ్మన్యులు. సర్దార్ పటేల్ ఉప్పుసత్యాగ్రహం కాలంలో మద్రాసు వచ్చి మెరీనా బీచ్‌లో ప్రసంగించారు. 'అవర్ ఫర్స్‌ట్ ప్రయారిటీ ఇజ్ కంప్లీట్ ఫ్రీడమ్" అని అన్నారు. "ఆఫ్టన్ బ్రిటిషర్స్‌సే" అంటూ ఏదో చెప్పారు. ఇంతపెద్ద నాయకుడు, ఇంతపెద్ద న్యాయవాది "ఫర్స్ట్" అని, ఆఫ్టన్ అని అంటాడేమిటి? అని అందరూ ముఖాముఖాలు చూచుకొన్నారు. ఫర్స్‌ట్‌లో ఆర్ సైలెంటని, ఆఫ్టన్‌లో టి సైలెంటని మనకు నేర్పారు చిన్ననాడు. సర్దార్‌పటేలుకు నేర్పలేదో, అలాగే ఉచ్చారణ అన్నారో!

ద్వితీయ ప్రపంచ యుద్ధప్రారంభంలో కెన్యా నాయకుడొకడు మద్రాసు వచ్చాడు. ఆరడుగుల నిలువు ఘటోత్కచునిలాగా ఉన్నాడు. ఉపన్యసిస్తూంటే, విశ్వనాథ సత్యనారాయణగారి 'హాహా హూహూ' నవలలోని గంధర్వుడు మాట్లాడినట్టు ఉంది. అందరూ నవ్వారు. అతడు బల్లను ఒక గుద్దు గుద్దాడు కోపంతో. బల్ల విరిగింది. "నా ఆంగ్లోచ్చారణను మీరు పరిహసిస్తున్నారు. ఇది నా భాష కాదు, మీ భాషాకాదు. పరాయి పాలకుల భాష. నా ఇష్టం ప్రకారం, నా నేర్చిన ఉచ్చారణ ప్రకారం నేను మాట్లాడుతాను. మీరు బానిసలు, మేమూ బానిసలం. పాలకుల భాషను వారి లాగే పలుకడం మరీ బానిసతనం. నా భాష మీకు రాదు గనుక ఆ భాషలో మాట్లాడుతున్నాను. వినండి"'. అని గర్జించాడు. అందరూ కిక్కురుమనకుండా విన్నారు. మనకు ఉన్న భాషా దాస్యం అలాంటిదే అని చెప్పడానికి ఇంతగా వివరించాను.

పరభాషను ఇంతగా భక్తి శ్రద్ధలతో కొలుస్తున్న మనం భారతీయ భాషల విషయంలో ఎందుకు శ్రద్ధ చూపడంలేదు? నాకు ఆంగ్లమంటే అగౌరవమని భావించేరు. కాదు,

ఎన్నటికీ కాదు. కాని, ఆ శ్రద్ధను మన భాషాపదాల ఉచ్చారణకు కొంతకు కొంతయినా చూపకూడదా అని అభ్యర్థన. సత్యజిత్‌రాయ్‌ని, సిద్ధార్థ శంకర్‌రాయ్‌ని, ప్రఫుల్ల చంద్రరాయ్‌ని మనవారు రేరేరే అని దుంపదెంపేశారు. మననోట్లో పడలేక ఇద్దరు చావనేచచ్చారు. మనకు అతిప్రాచీన కాలంనుంచి తర్కశాస్త్రం వల్ల వంగదేశంతో సంబంధం ఉంది కదా, అక్కడి వారి పేర్లను సరిగా ఉచ్చరించడానికి ప్రయత్నించవద్దా? ప్రాచీనకాలం సంగతి వద్దు, ఈ శతాబ్దం మొదటినుంచి, సాంఘికంగా, సాహిత్య సంబంధంతోను వంగదేశం మనకు సన్నిహితమయింది కదా! వంగభాష చదివినవారు ఎందరో ఉన్నారుకదా! మరి తప్పుడు ఉచ్చారణ ఎందుకు? ఆంగ్ల ప్రభావం. ఆర్.ఎ.ఐ=రాయ్ అని భారతీయోచ్చారణ. కాని మనం ఇంగ్లీషు మానసపుత్రులం గనుక 'రే' అనే అంటాం.

కృపలానీ, త్రివేదీ, దుబె పడిన పాట్లు శత్రువులక్కూడా వద్దు. మనకు త్రివేదీ అనే ఆయన గవర్నర్‌గా ఉండేవాడు. త్రివేదీ అంటే మూడువేదాలు చదువుకున్నవారి వంశం వాడన్నమాట. త్రివేడీ, త్రీవేడీ, త్రివేడీ అని యథాశక్తి అపభ్రంశంగా ప్రచురించేవి పత్రికలు. దుబే అంటే రెండు వేదాలు అధ్యయనం చేసిన వంశంవాడు. ద్విశబ్దం ప్రాకృతంలో దు,దు,వీ అని అవుతుంది. ద్విలో రెండు వర్ణాలు ఉన్నాయి. గనుక ఒక భాషవారు ద తీసుకున్నారు, మరొకరు వ తీసుకున్నారు. డుబే, డూబె అని పత్రికలు వ్రాసేవి. ఇక కృపలానీకి రూపాలు కృపాలినీ, కృపాలానీ, కృప్‌లానీ, కృపళానీ - ఇత్యాదిగా. కృపలానీ అని ఒక్కసారన్న సరిగ్గా వ్రాసినట్టు కనిపించదు. సంబంధార్థకంలో వచ్చే 'నీయ' అనే ప్రత్యయంలో భాగం నీ కృపలా అనే వ్యక్తికి సంబంధించిన వంశం వాడు. కృపలా+నీ, వాధ్వా+నీ = వాధ్వానీ, మాలా+నీ =మాలానీ-మాలాణీ.

మన పక్కరాష్ట్రం తమిళనాడు నాయకుల పేర్లు కూడ మనం సరిగా తెలుసుకొని వ్రాయం అన్బళగన్=అంటే ప్రేమసుందరుడు. అన్బు+అళగన్=అన్బళగన్. మనం అంబలగన్ అనే వ్రాస్తాం. ఇంగ్లీషులో వచ్చిన వార్తల అనువాదం మరి! కణ్ణబిరాన్ మనరాష్ట్రంలో హైదరాబాద్‌లో ఉన్న పౌరస్వరక్షణ నాయకులలో ప్రముఖుడు. ఈయన పేరుకు పట్టిన పీడ తలచుకుంటే నాకు ఎంతో బాధ కలుగుతుంది. కణ్ణ+పిరాన్=కణ్ణపిరాన్-కణ్ణబిరాన్. పిరాన్=ప్రభువు. పిరాట్టి=ప్రభ్వి. మనలో పిరాట్ల ఇంటిపేరుగలవారున్నారు. వీరి పూర్వులు తెలుగు ప్రభువులను పెండ్లాడి వచ్చి పిరాట్టుల-రాణుల వెంట అరణంగా వచ్చినవారయి వుంటారు. ఆ పిరాన్ - పిరాట్టి కాలగర్భంలో కలిసిపోయారు. కాని, పిరాట్ల = పిరాట్టికి సంబంధించిన ఇంటిపేరు మాత్రం మిగిలిపోయింది. ఇలాగే పెరుమాళ్ల, ప్రబంధం, ఆలవట్టం మున్నగు ఇంటిపేర్లవారు తమిళదేశం నుంచి మన తెలుగు గడ్డకు వచ్చి స్థిరపడిన వారి వంశాలవారు.

ఈ కణ్ణబిరాన్, కన్నా బిరన్, కణ్ణాపీరన్ ఇత్యాదిగా అష్టావక్రమయింది, అవుతూవుంది. ఆ మహానుభావుడు ఒక పత్రికా రచయిత "ఇష్టాగోష్ఠి" ఏర్పాటు చేసి "అయ్యా, నాపేరు ఇది. ఇలా ఉచ్చరించండి" అని వివరిస్తే బాగుండును.

ఇక అలమేల్ మంగమ్మగతి చెప్పనక్కరలేదు. అలర్+మేల్+మంగై = తామరపూవు మీద ఆసీన అయిన స్త్రీ. అంటే పద్మాసన లక్ష్మి. అలమేలు, అలిమేలు, అలివేలు, అలవేలు, మంగ - ఇలా రకరకాలు. మన భాషా సంప్రదాయం ప్రకారం ఏకారాంతాలను అకారాంతాలుగా - తలై -తల, మలై - మల, కరై - కర గ్రహిస్తాము గనుక మంగై - మంగ అవుతుందిసరే. అలర్‌మేల్ మంగ నుంచి విడదీస్తే మంగ కేవలం స్త్రీయే మరి ఏ పేర్లో మంగమ్మ, మంగయ్య అనేవి? నామైకదేశీనామగ్రహణం అనే సంస్కృత న్యాయాన్ని బట్టి అది సరైందేనని సరిపుచ్చుకుందాము.

పత్రికలపని, రచయితలపని విషయ నివేదనం మాత్రమేకాదు, సాధు శబ్దాలను అందించి, చక్కని శైలిని నేర్పడం కూడా బాధ్యత. అందువల్ల వారు పాశ్చాత్యుల పేర్లను ఉచ్చరించడంలో, వ్రాయడంలో కనబరచే శ్రద్ధను భారతీయ నామధేయాల విషయంలోను చూపాలని నా అభ్యర్థన.

## అధ్వర్యం కాదు - ఆధ్వర్యవం

మానవసంఘ పరిణామం అగ్నితో ముడిపడి ఉంది. అగ్ని - నిప్పు మానవ సంఘాన్ని వివిధ దశలలో వివిధ రీతులుగా కాపాడుతూ, ముందుకు వెళ్లనిస్తూ ఉన్నతికి చేర్చింది. కనుకనే నిప్పు ఆరాధ్యదైవమైంది. మానవుడు ఏది చేసినా, ఏది తలపెట్టినా అగ్నికి నివేదించి, అగ్నిని ప్రార్థించడం ఆచారమైంది. ఇది క్రమంగా యజ్ఞయాగాది క్రతువులకు మూలమయింది, యజ్ఞంనుంచే అన్నీ జనించాయి. యజ్ఞమే సకల జగత్తుకు, సకల సృష్టికీ మూలం అనే విశ్వాసం ఏర్పడిన తర్వాత యజ్ఞాన్ని స్తుతించడం, యజ్ఞాన్ని గురించి గానం చేయడం మొదలయినవి ఏర్పడ్డాయి. ఆ యజ్ఞపురుష మహాత్మ్యగానమే పురుషసూక్తం. పురుషసూక్తం, మనప్రాచీన సంఘ పరిణామానికి ఒక భావుకతా భరితమైన ఇతిహాసరేఖ. వీటన్నిటికీ అగ్నే మూలం గనుక వేదం - ఛందస్సు

అగ్ని మీళే పురోహితమ్

యజ్ఞస్య దేవ మృత్విజమ్

హోతారం రత్నధాతమమ్

అని ప్రారంభమవుతుంది, యజ్ఞానికి పురోహితుడు, అధిదేవత, ఋత్విక్కు, హోత,

రత్నమయకాంతులీనేవాడు అయిన అగ్నిని స్తుతిస్తున్నాను అని ఋక్కు అర్థం.

పూర్వం ఈ యజ్ఞాన్ని అందరూ నిర్వర్తించేవారు. కాని, సంఘం పెరిగినకొద్దీ, వ్యాపకాలూ, అధికారాలు విస్తరించిన కొద్దీ తాను తీరక లేనందున నిర్వర్తించలేనప్పుడు తాను ధనం వెచ్చించి, ఇతరులతో చేయించడం, ధనం వెచ్చించాడు గనుక, సొమ్మతనది గనుక, యజ్ఞఫలం తనది కావడమనే ఆచారం ఏర్పడిన తర్వాత యజ్ఞానికి అవసరమయిన వ్యక్తులను విడివిడిగా నియమించడమనే ఆచారం ప్రారంభమయింది.

అలాంటి యజ్ఞం నిర్వహణకు పురోహితుడు, అధ్వర్యువు, హోత, ఉద్గాత మొదలయినవారు కార్యకర్తలయి, ధనమిచ్చేవాడు యజమానుడయ్యాడు. కనుక అధ్వర్యువు యజ్ఞనిర్వహణలో ఒక వ్యక్తి.

అధ్వర్యుః ఇది ఉకారాంత పుంలింగ శబ్దం, శంభుః, మనుఃలాగ. మన సంస్కృత నిఘంటువులను తిరగవేస్తే అధ్వర్యుః అనే పదానికి యజుర్వేదం తెలిసిన ఋత్విక్కు అనే అర్థం కనిపిస్తుంది. "అధ్వర్యూద్గాతృహోతారో యజుస్సామర్గ్విదః క్రమాత్" అని అమరం. అధ్వర్యుః శబ్దం తెలుగు వ్యాకరణం ప్రకారం తత్సమమై తెలుగులో ప్రయోగార్హత పొందినప్పుడు అధ్వర్యువు అని అవుతుంది. శంభువు, మనువు, విష్ణువు, గురువులాగ.

అధ్వర్యువు అంటే యజుర్వేదం ఎరిగిన ఋత్విక్కు. ఉద్గాత అంటే సామవేదం తెలిసినవాడు. హోత అంటే ఋగ్వేదం తెలిసినవాడు.

వీరితో అధ్వర్యువు అధ్వరం – యజ్ఞం ప్రారంభించేవాడు – అఫిషియేటింగ్ ప్రీస్ట్ ఇతడు యజ్ఞానికి కావలసిన భూమిని సరిచేసి, వేదిక నిర్మించి, పాత్రలు సిద్ధపరచి సమిధలు, నీళ్లు తేవాలి. ఈ పనులన్నీ చేసేటప్పుడు యజుర్వేదం పఠించాలి. ఉద్గాత – సామవేదం గానంచేస్తాడు. హోత – ఋగ్వేదసూక్తాలు ఆయా సందర్భాలలో పఠించేవాడు. వీరందరికీ, సహపాఠకులూ ఉంటారు. ఇదంతా విషయాంతరం.

ప్రస్తుతం మనం చర్చించవలసింది అధ్వర్యం, ఆధ్వర్యం సాధువా, అసాధువా అన్నది మాత్రమే. అధ్వర్యు శబ్దం ఉకారాంతమని తెలుసుకున్నాము గదా. ఉకారాంత శబ్దాలకు సంబంధించిన, మొదలయిన అర్థాలలో అణ్ అనే ప్రత్యయం వస్తుంది. ఇది అవ అని మారి, అధ్వర్యు+అవ ఆధ్వర్యవం అని అవుతుంది. శంభు+అవ=శాంభవం, గురు+అవ=గౌరవంలాగ.

యజ్ఞంలో అధ్వర్యువు యజ్ఞానికి కావలసిన అన్నిపనులూ చేసే వాడు గనుక ముఖ్యుడు. దీనిని మనవారు ఇప్పుడు అధ్యక్షుడు అనే అర్థంలో వాడుతున్నారు. ఫలానా

వారి అధ్యక్షతన ఈ సభ జరిగింది అనడానికి ఫలానా వారి ఆధ్వర్యాన ఈ సభ జరిగింది అని అంటున్నారు. అధ్వర్యం తప్పు, ఆధ్వర్యమన్నాతప్పు. ఆధ్వర్యవంలో జరిగింది అని అనవచ్చుగదా. ఎవరో పండితుడు ఫలానా సభ ఫలానావారి ఆధ్వర్యవంలో జరిగింది అని మొదట ప్రయోగించి ఉంటాడు. దానిని అనుకరించే ఉత్సాహంలో మరొకరు ఆధ్వర్యవం అని స్పష్టంగా అనలేక ఆధ్వర్యంఅనో, అధ్వర్య అనో తప్పుగా వాడి ఉంటారు. నిజంకంటే, అబద్ధానికే సాధువు కంటే అసాధువుకూ ప్రచార ప్రాబల్యం ఎక్కువ గనుక ఈ తప్పు ప్రచారమైపోయింది.

మంచిపదాలు భ్రష్టు పట్టడం సహజం లోకంలో. ఘనపాఠి అంటే ఘనాంత స్వాధ్యాయం చేసిన గొప్ప వేద పండితుడు అని అర్థం. ఈ ఘనపాఠి శబ్దానికి క్రమంగా గొప్పవాడు, సమర్థుడు, నిపుణుడు అనే అర్థాలు ఏర్పడి, ఇప్పుడు చెడ్డ పనులలో, వ్యసనాలలో కూరుకుపోయిన వాడికీ ప్రయోగించే దుర్దశ ఏర్పడింది. "అబ్బో! వాడెక్కడండీ! ఏకంగా పదిబుడ్లు లాగేసే ఘనాపాటీ!" "అతనికేమండీ? పేకాటలో ఘనాపాటీ, రోజుకూ ఎంతలేదన్నా వెయ్యి రూపాయలు రావచ్చు" ఇలా నేను ఆమధ్య ఒక పుస్తకాల దుకాణంలో కొందరు యువకులు ఈ ఘనాపాటీ పదాన్ని ఈ విధంగా ప్రయోగించడం విని చెవులు మూసుకున్నాను. ఆ మాట అలా వాడరాదండీ అని అందామనుకున్నాను, కాని, "అనువుగాని చోట అధికులమనరాదు" అనే వేమన సూక్తి జ్ఞప్తికి వచ్చి నోరునొక్కుకున్నాను.

యువరచయితలారా! మిత్రులారా! అధ్వర్యాన, ఆధ్వర్యాన అని వాడకండి. ఆధ్వర్యవాన అని వాడండి. ఈ మాట బరువని తోస్తే అధ్యక్షతన, ఆధ్యక్ష్యాన అని వాడండి. అంతేగాని తప్పుమాటలు వాడకండి. యువకులు దారిచూపాలి ఇలాంటి విషయాల్లో.

## ఇష్టగోష్ఠా? ఇష్టాగోష్ఠా?

నేను ఆంధ్రప్రభలో చేరిన కొత్తలో సంపాదకులు నన్ను పిలిచి "ఆంధ్రనాటక కళా పరిషత్తు వారు రేపు నాటకాల పోటీ జరుపుతారు. ముందుగా ఈ వేళ పత్రికల ప్రతినిధులతో ఇష్టాగోష్ఠి జరుపుతారు. ఇదిగో ఆహ్వాన పత్రిక. మీరు వెళ్లి ముఖ్యమైన అంశాలు గుర్తుపెట్టుకొనిరండి. రిపోర్టర్‌లాగా మక్కికి మక్కి చెప్పిందంతా వ్రాసుకోనక్కరలేదు" అని అన్నారు.

నేను కొంచెం ఆశ్చర్యం అభినయిస్తూ "ఇష్టాగోష్ఠా?" అనడిగాను. "ఔను. ఏమిటి మీ సందేహం? త్వరగా వెళ్లండి. గంటగంటన్నరలోపల ముఖ్యాంశాలతో తిరిగిరండి. సాయంకాలం ఎడిషనుకు అచ్చుకావాలి గదా!" అని తొందరపెట్టారు.

నేను ఇష్టాగోష్ఠి విషయం వాదించదలచలేదు. అక్కడికి వెళ్ళి చూద్దాం, నాకు ఇష్టురాండ్రు ఎంతమంది వస్తారో అనుకుంటూ బయలుదేరాను. నాటికలపోటీ గదా! ఎవరైనా నాకు ఇష్టమయిన నటీమణులో, గాయనీమణులో ఉండకపోతారా? అని అనుకున్నాను.

అక్కడ – చెన్నపురి ఆంధ్రమహాసభ భవనం చేరిన తర్వాత చూతునుగదా, గోష్ఠిని ఏర్పాటు చేసిన వారిలో నాకు ఇష్టురాలైన ఒక్క మహిళా లేకపోగా, మహిళలే కనిపించలేదు మచ్చుకన్నా! హడావిడిగా తిరుగుతున్న గోష్ఠి నిర్వాహకులలో ఒకరిని సమీపించి, "ఇష్టాగోష్ఠి అని ఆహ్వాన పత్రికలో అచ్చువేశారు, మహిళలెవ్వరూ లేరే నాటకాల పోటీలను గురించి వివరించే వారిలో?" అని అడిగాను. అతడు నా ప్రశ్న అర్థం కాక కళ్ళు పెద్దవి చేసి "మహిళలెందుకండీ ఉంటారు? ఇది లాంఛనంగా జరిగే ఇష్టాగోష్ఠి. రేపు జరిగే పోటీలను గురించి వ్యవస్థాపకులమైన మాలో ఒకరిద్దరు వివరిస్తారు? మీ ప్రశ్న ఏమిటో నాకు అర్థం కావడం లేదు ఆహ్వాన పత్రికలో మా అభిప్రాయం స్పష్టంగానే ఉందే!" అన్నాడు.

"ఇష్టాగోష్ఠి అంటే ఇష్టురాండ్రతో గోష్ఠి అని అర్థం కదా! మీకు ఇష్టమయిన మహిళలో, ప్రేక్షకులకు ఇష్టమయిన మహిళలో వస్తారనుకున్నాను" అన్నాను.

ఆయన నా మాటలకు మరింత ఆశ్చర్యపడి "ఇష్టాగోష్ఠికి మీరు చెప్పిన అర్థం ఎలా వస్తుందండీ? ఇష్టాగోష్ఠిని మేము ఇన్‌ఫార్మల్ మీట్ అనేదానికి పర్యాయంగా వాడుతున్నాం. మీరు పత్రికారంగానికి కొత్తా ఏమిటి? అని నా ముఖంలోకి చూచాడు.

"పత్రికా రంగానికి కొత్తేమీకాదులెండి, ఆంధ్రప్రభకు కొత్త" అన్నాను.

"అలా చెప్పండి. అయినా, మీ పత్రికల వారు వాడుతున్నమాటే గదండీ ఇది. మీకు ఎందుకలా అర్థమయిందో ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు.

"మహానుభావా! పత్రికలు వాడుతున్న పదాలన్నీ సాధుపదాలు, నిర్దుష్టాలు కావు. ఇష్టాగోష్ఠి అనే పదంలో రెండు పదాలు ఇష్ట+గోష్ఠి అనేవి ఉన్నాయి. ఇవి రెండూ సమాసంలో కలిస్తే ఇష్టగోష్ఠి అని అవుతుంది. దానికి అర్థం ఇష్టులతో – మనకు నచ్చినవారితో ముచ్చటించుకోడం అని అర్థం. ఇష్ట అనే మొదటిపదంలో ష్టకు దీర్ఘంరాదు, ఇష్టాగోష్ఠికాదు. ఇష్టగోష్ఠే అవుతుంది. మహిళలతో గోష్ఠి జరుపుతున్నారనుకోండి. అప్పుడు ఇష్టా+గోష్ఠి అని వాడవచ్చు. ఇష్ట అనేది పుంలింగ విశేషణమయితే ఇష్ట అని హ్రస్వంగానే ఉంటుంది. స్త్రీలింగమయితే ఇష్టాఅని దీర్ఘమవుతుంది. ఇష్టురాండ్రతో ముచ్చట్లు అని అర్థం........" అని గబాగబా, ఆయన మాట్లాడడానికి నోరు తెరిచి, చేతులతో ఆగమని సైగచేస్తున్నా ఆగక వ్యుత్పత్త్యర్థం వివరించాను.

ఆయన స్తబ్ధుడయిపోయి "గురూ గారూ! ఇదంతా నాకు తెలీదండీ. ఇష్టాగోష్ఠి అనే వాడుకనుబట్టి అచ్చువేసి పిలిచాము. తమరు మా గోష్ఠివార్తలు దయచేసి ప్రచురించండి. యావదాంధ్రదేశానికీ సంబంధించింది." అని అంటూ, నాకు మరే అవకాశమూ ఈయకుండా బందెలదొడ్డి తెరవగానే పరుగెత్తే వృషభరాజులాగ పడుతూలేస్తూ పరిగెత్తాడు.

గోష్ఠి జరిగింది. వార్త పత్రికలో సకాలానికే పడింది, నాటకకళా పరిషత్తు వారూ సంతోషించారు. కాని, నా చర్చను గోష్ఠి నిర్వాహకులు సంపాదకులకు తెలిపినట్టున్నారు. మరుసటిదినం సంపాదకులు నన్ను పిలిచి "ఏమిటి మీరు నిన్నటి ఇష్టాగోష్ఠివారితో గొడవపడ్డారట!" అన్నారు.

"గొడవేమీ లేదండి. ఇష్టాగోష్ఠి అనే దానిలో ఇష్టా అనేపదం దీర్ఘాంతంగా ఉండడం వల్ల మహిళలు ఎవరైనా ఉన్నారా అని అడిగాను అంతే" అన్నాను.

"ఆయన నవ్వుతూ" మీ వ్యాకరణం వాళ్లకేమర్థమౌతుందండీ? వాడుకలో ఉంది వాడుతున్నారు. ఇంతకూ ఏమిటి తప్పు?" అని అడిగారు.

"పదంలో తప్పులేదండీ. అర్థం చెప్పడం తప్పుకావచ్చు". ఇష్టాగోష్ఠి అనేపదంలో రెండు పదాలున్నాయి. తత్పురుష సమాసమైతే, ఇష్టునితోగాని, ఇష్టులతోగాని గోష్ఠి అని షష్ఠీతత్పురుష సమాసం. ఇష్టమయిన గోష్ఠి అని అనదలచుకుంటే కర్మధారయంతో ఇష్ట+గోష్ఠి అవుతుంది. ఇష్టా అన్నప్పుడు ఆకారాంత స్త్రీలింగం గనుక ఇష్టురాండ్రతో గాని, ఇష్టురాలితోగాని గోష్ఠి అని అర్థమవుతుంది" అన్నాను.

"మరి మనం ఇష్టాగోష్ఠి అని అంటున్నాం కదా! దీనిని సమర్థించడానికి వీలులేదా?" అని అడిగారు ఆయన.

"సంస్కృత భాషావచనంలోనైతే ఇష్టాగోష్ఠిని సమాసంగా కాక, వ్యస్తంగా – విడిగా తీసుకుంటే, ఇష్టమైన గోష్ఠి అనే అర్థంలో ఇష్టాగోష్ఠీ అని ప్రయోగించవచ్చు, గాని ఆ సంప్రదాయం మనది కాదు. మన సంప్రదాయం ప్రకారం ఇష్టాగోష్ఠి అనేది విడిగా వాడరాదు. వాడితే హ్రస్వంగానే వాడవలసి ఉంటుంది. అప్పుడు ఇష్టమైన గోష్ఠి అనే అర్థమే కాని, ఇష్టులతో గోష్ఠి అని కాదండి?" అన్నాను.

"మరి మనం ఇంతకాలంగా వాడుతున్న దీనికి ఏదో కారణం ఉంటుంది గదా!" అన్నారు ఆయన కుతూహలం కనబరుస్తూ.

"దీనికి కారణం ఉత్తరభారత భాషల ముఖ్యంగా హిందీభాషా ప్రయోగాల ప్రభావమండీ. మనం కార్యవర్గం అనే మాటకు హిందీవారు కార్యకారిణీసభా అని

వాడుతారు. ఆ భాషలో కార్యకారిణీ అనే స్త్రీలింగ విశేషణం సభా అనే దానితో అన్వయిస్తుంది గనుక, సంప్రదాయం ప్రకారం సమాసం తప్పుగాదు గనుక, తత్సమీకరణంలో మార్పులు చేయకుండానే సంస్కృత పదాలను యథాతథంగా ప్రయోగిస్తారు గనుక వారికది తప్పుకాదండి. మనకు తప్పండి, ఆ ప్రభావం వల్ల మన భాషలాగా ఇష్టాగోష్ఠి, ప్రేమీమండలి వంటి పదాలెన్నో దూరిపోతున్నాయండి. ఇలాంటివి అరికట్టడానికి మన భాష శాసనభాషగా ఉండాలి." అన్నాను.

"అంతదూరం మనకెందుకు? ఇలాంటి తప్పులు నిదానంగా తొలగించుకుందాం. ఇప్పటికి ఇలాగే పోనీండి" అన్నారు ఆయన.

ఆ విధానం నేనున్నంతవరకు కొనసాగింది. అది ప్రకరణాంతరం.

మిత్రులారా, తప్పును తెలుసుకోవడం ఒకెత్తు. అది మళ్లీ దొర్లకుండా మెలకువతో ఉండడం మరొక ఎత్తు. తప్పు తెలుసుకొన్నదాని ఫలం, దానిని మళ్ళీ చేయకుండా ఉండడం కదా! కనుక ఇష్టాగోష్ఠి, ఇష్టగోష్ఠి అనే పదాలను సమయానుకూలంగా, సందర్భశుద్ధితో వాడండి.

## జగదంబ జగదాంబ ఎలా అయింది?

నా మిత్రుని కుమారుని పెళ్లికి విశాఖపట్నం వెళ్లాను. జగదంబ సర్కిల్ దగ్గరి ఒక కల్యాణ మంటపంలో పెళ్లి. నన్ను కళ్యాణ మంటపం చేర్చడానికి పెళ్లివారు స్టేషనుకు మనుష్యులను పంపారు. నేను వాళ్లను గుర్తు పట్టడం కాలేదు. స్టేషనులోదిగి ప్లాట్‌ఫారం మీద తారట్లాడుతూ బయటికి వచ్చి ఆటో వాడితో బేరం చేస్తున్నాను, జగదంబ సర్కిల్‌కు వస్తావా? అనడిగాను ఆటోడ్రైవరును. జగదంబ సర్కిల్ అనేది విశాఖలోనే లేదండి. జగదాంబ సర్కిల్ ఉందండి. అక్కడికి వెళ్లిన తర్వాత కల్యాణమంటపం కనుక్కోవచ్చునండి అన్నాడు ఆటోడ్రైవరు.

జగదంబ కాదంటావేమిటయ్యా? జగదంబే – అన్నాను అతనితో. కాదుబాబూ జగదాంబండి– అని ఆటోడ్రైవరు మళ్లీ నన్ను సరిదిద్దాడు.

పాణిని కర్మ కాలింది. ఆ కాత్యాయనుడు ఎప్పుడు మొదలుపెట్టాడోగాని విశాఖ కార్మికుడి వరకు వార్తికాలు వెలయించేవారే – అని గొణుక్కుంటూన్నాను. ఆటోడ్రైవరుకు పాణిని అనే పదం పాణి అని వినబడింది కాబోలు! డాక్టర్ పాణిగారింటికాండి వారు జగదాంబ సర్కిల్ దగ్గరే ఉంటారండి. అక్కడికి తీస్కెళ్లుతానండి ఆ మీద పెళ్లి సత్రం వెదుక్కోండి అన్నాడు.

ఇంతలో ఫలానా వారు హైదరాబాద్ నుంచి వచ్చిఉంటే, విచారణ కార్యాలయానికి రావలసింది– అని మైక్‌లో ప్రకటన వినబడింది. బ్రతుకు జీవుడా అనుకుంటూ అక్కడికి వెళ్లాను, ఫలానా అంటూ నన్ను తెలుపుకొన్నాను. వాళ్లు సంతోషంతో నన్ను వేచి ఉన్న కారు వద్దకు తీసుకువెళ్లి 'జగదాంబ సర్కిల్ దాటి పటమటికి కలెక్టర్ ఆఫీసురోడ్డు లేదూ, అక్కడ పెళ్లి సత్రానికి తీసుకువెళ్లు" అని కారుడ్రైవరుతో అన్నారు.

నాకు ఆశ్చర్యమయింది వీళ్లుకూడా జగదాంబా సర్కిల్ అంటున్నారే– అని. ఆటో డ్రైవరు పాండిత్యమే వీళ్లదీ కాబోలు! అనుకుంటూ, "మీరూ. జగదాంబ సర్కిల్ అనే అంటున్నారే. జగదంబ సర్కిల్ కదూ?" అని వారితో అన్నాను. జగదాంబ సర్కిలేనండి అలాగే అంటారండి – అని వారన్నారు, వినయంతో.

మాకారు సర్కిల్ దగ్గరికి వచ్చింది. తాటికాయంత అక్షరాలతో జగదాంబ సర్కిల్ అనే పేరున్న ఫలకం ఒక మూల కనిపించింది. మునిసిపల్ కార్పోరేషన్ వాళ్లు ఇంతలేసి అక్షరాలతో నామధేయఫలకం వేలాడగట్టినప్పుడు పాపం ఆటోడ్రైవరుదీ, తక్కినవారిదీ తప్పేమిటి? అని అనుకుంటూ పెళ్లి సత్రంలోకి వెళ్లాను. పెళ్లి అయిన తర్వాత మునిసిపల్ కార్పోరేషన్ వాళ్లకు ఒక జాబు వ్రాశాను. జగత్+అంబ=జగదంబ అవుతుందిగాని, జగదాంబ కాదని, జగదాంబ అనే రూపం ఏర్పడడానికి జగద–అంబ అనే రెండు పదాలుండాలి, అప్పుడే సవర్ణదీర్ఘసంధి వచ్చి జగదాంబ అవుతుందని, కనక జగదాంబ సర్కిల్ అనే నామఫలకం జగదంబ సర్కిల్ అని మార్చాలని ఆ జాబులో వివరించాను. వారు మార్చారో లేదో తెలీదు. ఇది కొన్నేళ్ల కింది సంగతి, ఇటీవల చాలసార్లు విశాఖ వెళ్లానుగాని, ఆ సంగతి గుర్తులేదు.

మునిసిపల్ కార్పోరేషన్ వారో, మరొక సంస్థో ఎలా ఊరేగినా మనం సరిగా ఉచ్చరిస్తే పోలేదా? అనుకుందామంటే, వీలులేదు. అలాంటి చిరునామా ఉన్న జాబు వెనక్కన్నా వస్తుంది, లేక మృతలేఖ (డెడ్‌లెటర్) కార్యాలయమన్నా చేరిపోతుంది.

ఇలాంటి చిన్న చిన్న తప్పులు ఎలా ప్రచారమవుతాయి? అని ఆలోచించాను. భాషకు సామ్యం–సాదృశ్యం అనేది పెద్ద విస్తరణ సూత్రం ప్రజలు ఒకదాని పోలికతో ఉన్న మరొకదానికి ఆ సాదృశ్యంతో పేరు పెట్టుకుంటారు. శారదాంబ, బాలాంబ, రత్నాంబ, మాణిక్యాంబ, సరళాంబ, శ్యామలాంబ, కమలాంబ, నీలాంబ, పూర్ణాంబ వంటి పేర్లు ప్రచారంలో ఉన్నాయి. వాటి సాదృశ్యంతో జగదాంబ కూడ ప్రచారానికి వచ్చి ఉంటుంది.

ఇలాంటివే రూపావతీ, పద్మావతీ, భోగావతీ లాంటి పేర్లు. రూప+వతీ=రూపావతీ అని అవుతుంది. రూప శబ్దంలోని ప ఎలా దీర్ఘమయిందో! పద్మ+వతీ=పద్మావతీ అని

అవుతుంది, పద్మ శబ్దంలోని ద దీర్ఘం ఎలా అయిందో రూపావతీ ఒక రాణిపేరు. పద్మావతీ చాల ప్రసిద్ధమయినపేరు. పద్మావతీచరణ చారణ చక్రవర్తి మన కందరికీ తెలిసిన భక్త వాగ్గేయకారుడు. పద్మావతమనే రాజ్యముండేది, మృగ+వతీ=మృగవతీ కావాలి, మృగావతి అయింది. మృగావతి పార్వతీదేవి పేరు. మృగావలి మానవల్లి రామకృష్ణకవి గారి కావ్యం పేరుకూడా. రూపవతుడు, రూపావతీ బౌద్ధసాహిత్యంలోని పాత్రలు. ఏ దీర్ఘ మధ్య పదాల సాదృశ్యంతోనో ఇవి వాడుకలోకి వచ్చి ఉంటాయి. ప్రజలలో వాడుకను బట్టి కవులు, పండితులు అలాగే వ్యవహరించి ఉంటారు. అలా రూఢి కలిగి ఉంటుంది.

పాణిని వల్ల సంస్కృతానికి లాభమూ కలిగింది, కొంత నష్టమూ కలిగిందని నా బాధ. పాణిని ఒక గిరిగీచడంవల్ల సంస్కృత భాష ఆ గిరిలోనే గిరగిర తిరిగి గిలగిలలాడింది. ఆ గిరికి వెలిగా ఉన్న కొన్నివేల పదాలకు కాత్యాయన పతంజలులు ధైర్యంతో పాణిని పొగడుతూనే, జన ప్రయోగాలనుబట్టి గతి కల్పించారు.

తర్వాత అంతటి వాళ్లు రాలేదో, ఈ చర్చ మనకెందుకని ఊరుకున్నారో, సంస్కృత ప్రాబల్యం తగ్గి, ప్రాకృతాల ప్రభావం హెచ్చడంవల్లో ఇలా ఉంటే బాగుంటుంది, ఇలా లోకంలో కనిపిస్తున్నది- అని అనలేకపోయారు. పాణిని వ్యాకరణం వల్ల భాష పరిరక్షితమయింది కాని, విస్తృతం కాలేదు. ప్రాకృతాల సంస్కారంతో రూపొందిన భాష సంస్కృత భాష. అది పాణిన్యాదుల కట్టుదిట్టాలు తెంచుకొని దేశభాషల రూపంలో పాయలు పాయలైంది. ఆ వజ్రపంజరం లేకపోతే సంస్కృతమే సరళంగా విస్తరించి ఉండేదేమో!

ఇదంతా ఏమో ఏమో! ఇప్పుడు మన పని వ్యవహారంలో లేని, వాఙ్మయ మాత్రావశిష్టమైన సంస్కృత భాషా పదాలను సాధ్యమయినంతమట్టుకు సాధువులనుగా కాపాడుకోడం. కనుక జగదాంబ సర్కిల్ అని కాక జగదంబ సర్కిల్ అనే అందాం.

## కర్తృ కర్మ క్రియాయోగం

డాక్టర్ పిల్లలమర్రి నాగవెంకట బాలసౌభాగ్య వరలక్ష్మిగారు 1996 ఫిబ్రవరి 20వ యువతలో ప్రకటించిన అభిప్రాయం నాకు ఇద్దరు మిత్రులను స్మరింపజేసింది. వారిలో మొదటివారు పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు. ఈయన ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోను, తర్వాతను శాసనసభ్యుడుగా ఉండి, ఎంతో ప్రజాసేవ చేశారు. కొందరు ఉంటారు, వారు ఏపార్టీలో ఉన్నా, లేకపోయినా గొప్పవారే. పుచ్చలపల్లి సుందరయ్య, తరిమెల నాగిరెడ్డి, మద్దూరు అన్నపూర్ణయ్య, పప్పూరు రామాచార్యులు, కల్లూరు సుబ్బారావు, వావిలాల గోపాలకృష్ణయ్య, ఇందుకూరి రామకృష్ణరాజు వంటివారు ఎప్పుడూ గొప్పవారే. అలాంటివారు పిల్లలమర్రి వేంకటేశ్వర్లుగారు కూడ.

రెండవవారు కొడవటిగంటి కుటుంబరావుగారు. ఈయనే అనుకుంటాను, నామకరణం పైన ఒక కథ వ్రాశారు. ఒక ఇంట్లో నామకరణం జరుగుతూ ఉంటుంది. పిల్లవాడి మాతృపితృ వర్గాలవారు రకరకాల పేర్లు సూచిస్తుంటారు. అప్పటికే పిల్లవాడిపేరు రాయదుర్గం చేంతాడంత అయింది. పొద్దు పన్నెండుగంటలయింది. అప్పుడు తపాల బంట్రౌతు జాబులు ఇవ్వడానికి వస్తాడు. పేర్లతో విసిగిపోయిన పిల్లవాడి తండ్రి "తపాలా బంట్రౌతు మస్తాన్‌సాఇబు ఇరవై యేళ్లుగా శ్రద్ధతో జాబులు అందజేస్తున్నాడు. అతనిపేరు కూడ చేర్చండి" అంటాడు. దానితో, వీర వెంకట శివరామకృష్ణ, వరాహ నరసింహ, సోమేశ్వర వీరాంజనేయ, మస్తాన్‌సాఇబు ప్రసాద్ అనిపేరు నిర్ణయిస్తారు. తల్లీ! వరలక్ష్మిగారూ, మీపేరుతో మరి నాలుగు పేర్లూ కలపండి. అటు ఇటు ఏడుతరాల వారూ స్మృతిపథంలో పరుగిడుతుంటారు.

ఇక కర్త, కర్మ, క్రియల సంగతి. పనిచేసేవాడుకర్త, చేయబడేది కర్మ, ఈ సంబంధాన్ని తెలిపేది క్రియ. కర్తృ వాచకపదం, కర్మ వాచకపదం, క్రియా వాచకపదం – అని అనాలి. కాని, సంగ్రహంగా కర్మ, కర్త, క్రియ అని మనం అంటున్నాము. డాక్టర్ వరలక్ష్మిగారన్నట్టు కార్యంలేనిదే కర్త లేడు, కర్తలేనిదే కార్యం లేదు. కాని కర్త అనగానే దేనికి కర్త అనే ప్రశ్న వస్తుంది. ఫలానాదానికి కర్త అని సమాధానం చెప్పవలసి ఉంటుంది. ఆ కార్యానికి, ఆ కర్మకు కర్త అన్నప్పుడు ఆ కార్యకర్త అవుతాడు. అలాగే కర్మ కర్త, క్రియా కర్త అవుతాడు.

కర్త అంటేనే పనిచేసేవాడు. నిజమే ఉద్దిష్టమయిన పనిని చేసేవాడు అన్నప్పుడు తత్కార్యకర్త అని అనవలసి ఉంటుంది. తత్ అనేది క్రమంగా రాలిపోతుంది. వట్టి కార్యకర్త అని మాత్రమే మిగులుతుంది.

కథా సరిత్సాగరం, బృహత్కథా మంజరి వంటి కథాకావ్యాలు తిరగవేస్తే ఇలాంటి ప్రయోగాలు కో కొల్లలుగా దొరుకుతాయి.

కర్మ+కర=కర్మకర=పనివాడు–అంటే మనం చెప్పినపని మనకోసం చేసేవాడు. దీనికి మరొక రూపం కర్మ+కార. ఇంకొక రూపం కప్రయంతో కర్మ+కారక. కర్మ+కర+ఇన్=కర్మకారిన్–కర్మకారీ–కర్మకారి. దీనికి స్త్రీలింగం కర్మకారిణీ. కర్మ+కర్తా. కర్మ కర్త్రీ. కర్మ కరకు స్త్రీలింగం కర్మకరీ. గాథాసప్తశతిలో కమ్మకరీ ప్రయోగాలున్నాయి. కర్మక్రియాకాండ= సోమశంభువనే ధర్మ శాస్త్రజ్ఞుడు రచించిన గ్రంథం. దీనిలో కర్మ క్రియ రెండూ ఉన్నాయి గనుక పునరుక్తి కాదా? అని ప్రశ్నిస్తే, చేసే పనుల్లో భేదం వల్ల ఈ ప్రయోగం అన్నారు పెద్దలు.

ఇక క్రియా అనే పదానికి చేసేవాడు అనే ప్రత్యయాలు చేరడం వల్ల ఏర్పడే రూపాలు ఇవి. క్రియా+కర=క్రియాకర. క్రియాకర్తా, క్రియాకార= అనే దాని అర్థం మారింది. పనిని నేర్చుకొనడానికి ఆరంభించినవాడు, అప్రెంటీస్ అని అర్థాలు. క్రియావాచిన్, క్రియావాదిన్ = న్యాయస్థానాలలో వ్యాజ్యాలలో మొదటి వాదం ప్రారంభించేవాడు.

కార్యమన్నా పనేగదా! దానిమీద వచ్చిన రూపాలలో అర్థభేదం ఉంటుంది. కార్య+కర=కార్యకర, కార్యకర్తా=కార్యకర్త=శ్రద్ధతో పనిచేసేవాడు. కార్యకర్త్రీ=శ్రద్ధతో పనిచేసే ఆడపని మనిషి. కార్యకారిన్ - కార్యకారీ - కార్యకారి, దీని స్త్రీలింగరూపం కార్యకారిణీ-కార్యకారిణి.

ఇప్పుడు కార్యకర్త అంటే మనకు ఏదో కూలికి కర్తవ్యంగా పనిచేసేవాడు కాక శ్రద్ధతో, తనపని అనే భావంతో పనిచేసేవాడు అనే పాత ప్రయోగాల అర్థం గ్రహిస్తే ఆ పదం ప్రయోజనం సార్థకమవుతుంది.

కార్యం, క్రియ, కర్మ అనే పదాలు ఒకే ధాతువునుంచి వచ్చినా కర్మకు ప్రాధాన్యమిచ్చారు మన పూర్వులు. ఈ కర్మ పూర్వజన్మలనుంచి మనకు అంటుకుంటుందని మన పూర్వుల విశ్వాసం. ఇది ఎప్పుడో ప్రారంభమవుతుందట. ఈ ప్రారబ్ధకర్మ ఎలాగున్నా, వర్తమాన కర్మను గురించే చెప్పారు గీతాచార్యుడు. కర్మ-నీవుచేయవలసిన పనిని చేయి. కాని, దీని ఫలాన్ని ఆశించవద్దు అంటాడు గీతా చార్యుడు. దీనిలోని మనస్తత్వ శాస్త్రానికి సంబంధించిన రహస్యాన్ని పట్టుకున్నాడు అతడు. మనం ఏదో పని చేయకతప్పదు. కొందరు పొట్టకూటికోసం, మరికొందరు ఉన్నదాన్ని పెంచడం కోసం పనిచేస్తారు. దీనివల్ల ఇది అవుతుంది అనే ఆశతో పనిచేస్తే, అది అయితే సంతోషిస్తాం, కాకపోతే బాధపడతాం. మనం పని చేశాం, దాని ఫలితం వస్తే సంతోషం, రాకపోయిందీ ఫరవాలేదు, మరొకసారి ప్రయత్నిద్దాం అనే భావంతో పనిచేస్తామనుకోండి, మనకు ఏ బాధా ఉండదు. చేసిన పని సఫలం కానప్పుడు బాధపడడం మానవ సామాన్య సహజం. దాని వల్ల అతనికి అదనంగా బాధ కలిగి మళ్లీ ప్రయత్నించడానికి ఉత్సాహం కలుగకపోవచ్చు, మరింత కుంగిపోనూవచ్చు. వివేకంతో ఆలోచించి బాధపడడం మానుతాడనుకోండి శరీరానికీ, మనస్సుకూ ఏ మాత్రమూ నలత ఉండదు, మళ్లీ పనికి పూనుకోడానికి ఉత్సాహము కలుగుతుంది. భగవద్గీతలోని వేదాంతం మనకు వద్దనుకుని, దాని సూక్తులను ఆచరణలో పెట్టినా, జీవితం హాయిగా పెద్దమనిషి తరహాగా గడుస్తుంది. భగవద్గీతాసారం వంటిది ఒక హిందీ దోహా ఉంది.

సుఖచాహో ఇస్ సంసార్‌మే

ఛోడోబాతే ( చార్

చోరీ, చుగులీ, జామనీ

ఔర పరాయే నార్.

ఈ ప్రపంచంలో సుఖంగా ఉండదలచుకున్నావా, నాలుగు విషయాలు వదలిపెట్టు, అవి ఏవంటే, దొంగతనం, కొండేలు చెప్పడం, నైచ్యానుసంధానం, పరస్త్రీలపై వ్యామోహం. ఈశావాస్యం చెప్పింది ఇదే. కర్మలో పడి మనం చాలా దూరం వచ్చాం.

కార్యకర్త అంటే ఇప్పుడు స్పష్టమయినట్టేగదా!

ప్రపంచం అంతటా కూడ, జీవి మాతృగర్భంలో ప్రవేశించింది మొదలు మట్టిలో కలిసే వరకు కొన్ని పనులు జరుపుతారు. వీటిని మనవారు పూర్వ కర్మలని సంకేతించుకున్నారు. మరణానంతరం జరిపే పనులకు అపర కర్మలు అని సంకేతించుకున్నారు. ఇవి సంఘంలోనివారు అందరూ చేయవలసినవే. పూర్వం నుంచి మానవుడు ఏవో నమ్మకాలతో ఉండడం వల్ల పూర్వ కర్మలకన్నా, అపర కర్మలను-మరణానంతర కర్మలను భక్తి శ్రద్ధలతో చేస్తాడు. అందువల్ల దానికి శ్రాద్ధం అని పేరు వచ్చింది. నిజానికి శ్రద్ధతో చేసే ఏ పనినైనా శ్రాద్ధం అని అనవచ్చు. కాని, భాష జనం వాడుకలో రూఢి పొందుతుంది. కనుక అపర కర్మకే శ్రాద్ధమంటాము. ఇది పితృమేధంలో భాగం.

మరణించినవారు ఎక్కడో పితృలోకాలకు చేరుకుంటారని ప్రపంచమంతా నమ్మకం ఉంది. ఆ పితృ సంతృప్తికై చేసే కర్మలు కొన్ని దినాలు, కొన్ని వారాలు చేస్తారు గనుక, దినవారాల కార్యాలు గనుక దినాలు, వారాలు, కార్యాలు, కర్మలు అని వ్యవహారంలోకి వచ్చాయి. కొన్ని చోట్ల దివసాలు, దివసం అనే వాడుతారు. స్త్రీల తిట్లలో ఈ దివసాలు, దినాలు దినవారాలు, కర్మల పదాలు మహావేగంగా దొర్లిపోతూంటాయి. ఫలానావాడు మరణించినదినం అనడానికి తత్+దినం=తద్దినం అంటారు. ఇది ఒక్క తెలుగువారి వ్యవహారమే. దేశంలో ఏ భాష వారూ ఇలా వ్యవహరించరు. అలాగే దివసం – దెవిసం అనే మాటను తమిళ, కన్నడులు వాడుతారు.

పితృకర్మను పవిత్రంగా భావించడం వల్ల అన్ని వర్గాలవారూ అపరకర్మ, పితృకర్మ అనడం అలవాటయి, క్రమంగా పూర్వపదం రాలిపోయి, కేవలం కర్మలు, క్రియలు అనే పదాలు రూఢమయ్యాయి.

కొన్ని ప్రాంతాలలో ముఖ్యంగా దక్షిణాదిని కర్మాంతరం అని వ్యవహారం. మరొకకర్మ–శుభంకాని మరొకకర్మ–కర్మాంతరం. అన్యత్+కర్మ=కర్మాంతరం.

డాక్టర్ నాగవెంకట బాల సౌభాగ్య వరలక్ష్మిగారూ ఇవి కర్తృకర్మక్రియలు.

## క్షమార్పణంకాదు – క్షమాపణం

ఇటీవల నా వల్ల ఒక చిన్న పొరపాటు జరిగింది, ఒక మిత్రుని విషయంలో. మన్నించమని కోరుతూ జాబు వ్రాశాను. ఆయన దానికి సమాధానమిస్తూ "మీరుపెద్దలు, క్షమార్పణ కోరడం భావ్యంకాదు. అది చిన్న విషయం" అని వ్రాశాడు. నేను మళ్లీ వ్రాసిన జాబులో "మీ జాబు చేరింది ఈ క్షమార్పణం ఏమిటి"? అని అడిగాను. ఆయనకు నా ప్రశ్న కొంచెం కష్టం కలిగించింది కాబోలు! "క్షమార్పణ తప్పా? అందరూ వ్రాస్తున్నారు. నేనూ వ్రాశాను" అని కొంచెం ఎత్తిపొడుపుగా సమాధానమిచ్చాడు.

అందరూ వ్రాస్తున్నారు. నిజమే ఇది ఎలా ప్రచారానికి వచ్చిందో!

క్షమ్ అనే ధాతువు ఆత్మనేపది. దీని వర్తమాన ప్రథమ పురుష ఏకవచన రూపం క్షమతే–సహిస్తున్నాడు, సహిస్తున్నది అని దీని అర్థం. మన బరువును ఓర్పుతో, సహనంతో మోస్తున్నది గనుక ఈ భూమి – నేల క్షమ. దేనినైనా శీతోష్ణాలను, సుఖదుఃఖాలను సహించేవాడు. క్షమించేవాడు క్షముడు. కనుక క్షమ శబ్దానికి నేల, భూమి, ఓర్పు, మన్నింపు అనే అర్థాలు స్త్రీలింగంలో వచ్చాయి. పుంలింగమయితే, క్షముడు–ఓర్చేవాడు, సహించేవాడు. క్రమంగా దీనికి అన్నిటినీ సహించడం సమర్థత ఉంటేనేగాని కుదురదు గనుక సమర్థుడు అనే అర్థమూ కలిగింది.

క్షమ ధాతువు ప్రాతిపదికగా తెలుగు ప్రత్యయాలు చేరి క్షమ+ఇంచు=క్షమించు, క్షమియించు అనే క్రియలు ఏర్పడ్డాయి. సాధారణంగా తత్సమీకరణకు సంస్కృత మూలధాతువును ప్రాతిపదికగా తీసుకోవడమే తెలుగు వ్యాకరణ సంప్రదాయం. కాని, కొన్ని కొన్ని సందర్భాలలో ఒక శబ్ద ప్రథమావిభక్తి బహువచనరూపమో, ద్వితీయావిభక్తి ప్రథమైక వచనరూపమో ప్రాతిపదిక కావడం విచిత్రం. హను+మత్=హనుమాన్ అని అవుతుంది. దీనికి హనుమ అనే రూపం తెలుగు సాహిత్యంలో ఉన్నా ఎక్కువ ప్రచారంలో ఉండే రూపం హనుమంతుడు. ఇది హనుమంతః–హనుమంతం అనే ప్రథమా బహువచన – ద్వితీయా విభక్తి ఏకవచనం రూపం ప్రాతిపదికగా ఏర్పడినరూపం. హనుమంత+డు=హనుమంతుడు. ధీమంత+డు=ధీమంతుడు. బలవంత + డు = బలవంతుడు. హనుమంతు, మహంతు వంటి రూపాలు ప్రాకృత ప్రభావం వల్ల ఉకారాంతాలుగా ఏర్పడిన రూపాలు ఈ సామ్యం ఇతర భాషల పదాలకు అన్వయించి

కొత్త రూపాలు కొత్త అర్థాలతో ఏర్పరిచారు. దాసుడు అనే పదం చూడండి దాస+డు. సేవకుడు అని అర్థం. రామదాసుడు=రామసేవకుడు. రామదాసు అని రామదాసో అని ప్రాకృతపదంతో ఏర్పడింది. దాసరి–దాసర్లు విష్ణుభక్తులయిన ప్రత్యేకమైనతెగ. దాస శబ్దం కన్నడ, తమిళాలలో దాసరు–దాసర్ అని అయింది, ప్రథమావిభక్తి బహువచనంలో. ఇది మనకు ప్రాతిపదికఅయి దాసర్+దాసరులు, దాసర్లు అయింది. బహువచనంపై మన బహువచన ప్రత్యయం 'లు' చేర్చాము. నిజానికి దీని ఏకవచనం దాసరుడు కావాలి. కాని హరి–హరులు, మతి–మతులు లాగా దాసరులు అనే పదమూ ఇకారాంతమనే భ్రాంతివల్లో, మరే కారణంవల్లో ఏకవచనం దాసరి అయింది. మనకు ఆముక్తమాల్యదలోని మాలదాసరి అనే మహాభక్తుడు తెలుసు.

హనుమాన్ అనే ప్రయోగం తెలుగులో చేయం. భగవానుడులాగా హనుమానుడుగా మార్చుకుంటాం. దీని బహువచనం హనుమానులు, హనుమాండ్లు, ఈ పేరుతో చాలామంది ఆచార్యులు, ఇంటిపేర్లు గల వారు ఉన్నారు. వారిలో మిత్రులు హనుమాండ్ల భూమయ్యగారొకరు.

బహువచనంలో పడి బహుదూరం వచ్చాముకదా!

క్షమమీద ఎన్నో పదాలు ఏర్పడ్డాయి– క్షంతవ్యం, క్షమణీయం=క్షమించదగినది. క్షమీ, క్షమితృ, క్షమితా=క్షమ గలవాడు–క్షమీభావం=క్షాంతి, క్షమ, క్షమక=క్షమించేవాడు. క్షమమాణుడు=క్షమిస్తున్నవాడు.

ఇంతయినా క్షమాపణ శబ్దం విడిగా క్షమాప్ అనే ధాతువు నుంచి ఏర్పడింది. క్షపాప్=అన–అణ=క్షమాపణ, క్షమాప్ ధాతువుపై భావార్థకంలో ల్యుట్ ప్రత్యయం. అది అన–అణ అవుతుంది. క్షమాపణ=అంటే క్షమించమని కోరడం. క్షమాపణ శబ్దాన్ని మోనియర్ విల్లియమ్స్ గ్రహించి భామినీవిలాసం ప్రయోగం చూపాడు. సూర్యరాయాంధ్ర నిఘంటువు

"క్షమాపణైక పదయోః<br>
పదయోః పతతిప్రియే,<br>
శేముఃసరోజనయా<br>
నయనారుణ కాంతయః"

అనే రసమంజరి ప్రయోగం చూపింది. దీనికి అతి ప్రాచీన ప్రయోగాలు ఉన్నట్టు కనిపించదు.

క్షమాప్ ధాతువుపై వచ్చిన క్రియారూపాలు క్షమాపయతి, క్షమాపయతే = క్షమింపగోరుతున్నాడు, క్షమింపగోరుతున్నది అని అర్థం. దీనికి సూర్యరాయనిఘంటువు భాగవత ప్రయోగాన్ని ఉదాహరించింది.

"బ్రహ్మస్వం గచ్ఛ భద్రంతే

నాభాగ తనయంనృపమ్,

క్షమాపయ మహాభాగ

తతశ్శాంతిర్భవిష్యతి"

నాభాగ తనయుణ్ని క్షమించు అనికోరు అని దీని సారాంశం.

ఎంత వెదికినా క్షమార్పణమనే పదం సంస్కృతాంధ్ర నిఘంటువులలోగాని, ప్రాచీన ప్రబంధాలలోగాని కనిపించదు.

ఇంతగా వివరించి ఆ మిత్రునికి మరొక లేఖవ్రాశాను. ఆయనకు నా లేఖ చూడగానే ఆత్మాభిమానం అడ్డువచ్చింది కాబోలు! అతి తీవ్రమయిన అభినివేశంతో "క్షమను అర్పించుట=క్షమార్పణం అని వ్యుత్పత్తి. నేను అలాగే వ్రాస్తాను" అని సమాధానమిచ్చాడు.

"మహానుభావా! కోప్పడకు. క్షమను అర్పించడం క్షమార్పణం అనిఅంటే, మనం ఉద్దేశించిన అర్థం రాదుగదా కనుక మీ విగ్రహవాక్యం సరికాదు" అని వ్రాశాను.

ఆయనకు మొండితనం మరీ ఎక్కువయింది. "నేను అలాగే వ్రాస్తాను" అని జవాబు వ్రాశాడు.

"మొండివాడు మహాదేవుని కంటే బలవంతుడని సామెత. మీ ఇష్టం అలాగే వ్రాసుకోండి, కృష్ణార్పణమ్" అని సమాధానం వ్రాశాను. ఆయన బహుశా రామార్పణం, కృష్ణార్పణంలను చూచి భ్రాంతిపడి క్షమార్పణం అలాంటిదనుకున్నాడేమో పాపం! రామార్పణం, కృష్ణార్పణం రాముని కొరకు, కృష్ణుని కొరకు అర్పణం అని చతుర్థీ తత్పురుష సమాసం. క్షమార్పణం అలాంటిది కాదు. ఇక్కడ క్షమను అర్పించడం కాదు, క్షమని అర్థించడం, కనుక, మిత్రులారా, క్షమార్పణం తప్పు. క్షమార్పణ కోరుకున్నాను, కోరాడు అని వ్రాయకండి. క్షమాపణ కోరాను, కోరాడు–అని వ్రాయండి ప్లీజ్!

## అర్థాలలో మార్పు ఎలా కలుగుతుంది?

మిత్రులు డాక్టర్ ప్రకాశచంద్ర శతపథిగారు గడచిన ఫిబ్రవరి 27 యువతలో "కూటం తెలుగు పదం కాదు" అని వ్రాశారు. అది నేను 1995 డిసెంబరు 30 యువతలో వ్రాసిన కూట శబ్ద విచారానికి జవాబు.

భాష–ప్రవాహిని. ఒకనది దారిలో ఉపనదులు, వంకలు, వాగులు చేరగా పెరుగుతూ పోయినట్టు, ఒక సంఘం అభివృద్ధి అయిన కొద్దీ ఇతర సంఘాలతోనో, పరిస్థితులతోనో సంబంధం కలిగినకొద్దీ కొత్త పదాలను చేర్చుకుంటూ, ఉన్న పదాలకు కొత్త అర్థచ్ఛాయలను పొందుపరచుకుంటూ ముందుకు సాగుతుంది. ఈ విషయం భాషా సంఘ పరిణామ క్రమ వేత్తలకు కరతలామలకమైనట్టిది.

ప్రపంచంలో ఏ భాషా పిడుగుపాటుగా పైనుంచి పడదు, పూవులాగా క్రమంగా వికసిస్తుంది. ఇది వ్యవహారంలో ఉన్న భాషల సంగతి. ఎన్నోజాతులూ, భాషలూ ఇతరులతో సంబంధం లేనందు వల్లనో, మరే కారణాల వల్లనో నశించిపోతాయి. దీనికి కారణం ఆయా జాతి వికాసబలాపచయమో, వికాసన శీలాభావమో కావచ్చు. వ్యవహారంలో లేకపోయినా వాఙ్మయ సంపద్బలంతో కొన్ని భాషలు మూల ధనాలుగా నిలిచిఉంటాయి. అలాంటి భాషలలో ప్రథమగణ్యం సంస్కృతం. సంస్కృతం ఏదోరూపంలో సంఘంలోని కొన్ని వర్గాలకైనా వ్యవహారభాష అయి ఉంటుంది. లేకపోతే ఇంతటి వాఙ్మయభండారం దానికి సంప్రాప్తమై ఉండదు. ధర్మభాషగాను, అధికార భాషగాను అది చాలాకాలం ఉంది గనుక దాని ప్రభావం నేటికీ తగ్గలేదు. కాని, అది నేడు వ్యవహారచ్యుతమై వాఙ్మయమాత్ర నిష్ఠంగా ఉంది.

ప్రాకృతాలూ, వాటి సంస్కరణరూపమైన సంస్కృతమూ వ్యవహార భాషలుగా ఉన్న కాలంలో వాటిని వ్యవహరించే సంఘం ముందుకు సాగిపోతూవచ్చింది. ఇతర సంఘాలతో, ఇతర జాతులతో సంబంధం వల్ల పెక్కు కొత్త పదాలను స్వాయత్తం చేసుకుంది. ఇది వికసనశీలమైన ప్రతిభాషాలక్షణం. అంటే, సంస్కృతం కూడ ఇతర భాషా పదాలను స్వీకరించి తన ముద్ర వేసుకుంది. సజాతీయ, విజాతీయ సంస్కృతుల సమ్మేళనంలో ఏ సంఘమైన, ఆ సంఘాశ్రితమై ఏ భాష అయినా ఈ పరిణామానికి గురి కాకతప్పదు. ఒక పదానికి పూర్వం ఉన్న అర్థం ఇతర సంఘ సంబంధంతో కొంత మారడమో, ఆ అర్థంతోపాటు మరొక అర్థం ఏర్పడడమో సంభవిస్తుంది. ఒక్కొక్కమారు పూర్వం ఉన్న అర్థం పూర్తిగా లుప్తం కావడమో, విపరీతార్థం ఏర్పడడమో జరుగుతుంది.

కూటం కూడ ఇలాంటి పదమని నా విశ్వాసం, కూటశబ్దం సంస్కృతంలో లేదని నేననలేదు. ఉదాహరణాలు ఎన్నో ఇచ్చాను. కూట శబ్దానికి సమూహమనే అర్థం ఇతర విజాతీయ భాషల సంబంధంతో ఏర్పడిందని నేను భావిస్తున్నాను. దీనికి కారణాలు వివరించడం అవసరం కదా!

కూట్–కూడ్ అనే సంస్కృత ధాతువులకు ఉన్న అర్థాలివిః కూటయతి=కాల్చు, బాధించు, దుఃఖపడు, సలహాయిచ్చు, కూడ్–కూడయతి, కూడయతే, కాల్చు, దహించు,

బూడిదచేయు, (ఋగ్వేదం). అకూటయత్=దహించివేశాడు (ఐతరేయ బ్రాహ్మణం) ఇదంతా నా ప్రజ్ఞ కాదు, పెద్దలు, నిఘంటువులు చెప్పినవే.

దహనార్థంలో, వినాశార్థంలో ఉన్న కూట్-కూడ్ ధాతువులతో ఏర్పడిన పదాల అర్థాలు వేదకాలం తర్వాత, బ్రాహ్మణాల కాలానికి, మహా భారతకాలానికి మారాయి. భాష ప్రవాహినిగదా! మారక తప్పదుగదా! కూట=నొసటి ఎముక(ఋగ్వేదం) అధర్వవేదం, (ఐతరేయ బ్రాహ్మణం) ఒకరకం పాత్ర, ఉపకరణం (కౌశీతకీ బ్రాహ్మణం) ముందుకు వచ్చిన, శిఖరం (మహాభారతం) గుంపు, (మహాభారతం). వల, జింకను పట్టే బోను, ఒరలో దాచిన ఆయుధం, కత్తి, మోసం, మాయ, సమస్య, చిక్కు, ఒక రకం హాలు, నీటిపాత్ర, ఒక రకం మొక్క, ఒక రకం యిల్లు అగస్త్యుడు, విష్ణుశత్రువు.

కూటీకృ=గుంపుచేయు (మహాభారతం) దాహార్థకంలో ఉన్నది సమూహీకరణార్థంలో ఎలామారిందో చూచారా?

కూటస్థ=ఉన్నతపదాధిరూఢుడు (శతపథ బ్రాహ్మణవ్యాఖ్య డా. శతపథిగారు ఈ శాఖవారే) మారని, ఏకరీతి, ఆత్మ.

కూటాగారం=పైగది, ఇంటిపై అంతస్తు (రామాయణం, మృచ్ఛకటకం)

ఇలా అర్థంలో మార్పులు క్రమంగా ఏర్పడ్డాయి. కూట శబ్దానికి పూర్వం దాహ, నాశార్థాలే, క్రమంగా అర్థాలలో మార్పు వచ్చింది.

సంస్కృతేతరమైన తెలుగుతోబుట్టువులలో కూట శబ్దానికి మొదటినుంచి చేరిక, గుంపు, అనే అర్థాలే ఉన్నాయి. ఈ భాషల సాహచర్యంతో కూట శబ్దానికి గుంపు వంటి అర్థాలు క్రమంగా సంస్కృతానికీ ఎక్కి ఉంటాయి.

కూడం-కూటం = అందరూ కలిసే మండువా, హాలు. ఇలా కూట శబ్దం అర్థాలు, అర్థచ్ఛాయలు మూలార్థానికి విరోధం లేకుండా మారాయి మారడం అనడం కంటే పరిణమించాయి అందాం.

కూటశబ్దం సంస్కృతంలోను, తెలుగులోను ఉన్నా, సమూహమనే, కలయిక, కలిసే చోట అనే అర్థాలు తెలుగులోను, తెలుగుతోబుట్టువులలోను మొదటినుంచీ ఉన్నాయని, సంస్కృతంలో తర్వాత చేరి ఉంటాయని ఊహించడానికి అవకాశం ఉంది.

## కూసు-కూచి

శ్రీ పురుషోత్తమాచార్యులుగారు 1996మార్చి 12 యువతలో 'కూసు కన్నడంకాదు' అన్నారు. ఒక కుటుంబానికి చెందిన భాషలలోను కొన్ని మూలపదాలు కొన్నిటిలో

మరుగైపోతుంటాయి. కొన్నిటిలో సాహిత్యంలో ఏదో రూపంలో మిగిలిఉంటాయి. కొన్నిటిలో నేటికీ వాడుకలో ఉంటాయి. అలాంటి పదం కూసు. కూసు ప్రస్తుతం నిరంతరమూ కన్నడ కుటుంబాలలో వాడుకలో ఉన్నపదం. ఇది కూచిగా తెలుగులో మారి మిగిలింది. దీనిని సూచించినందుకు శ్రీ పురుషోత్తమాచార్యుల వారికి కృతజ్ఞతలు.

కూచి అనే పదానికి వాడి అనే అర్థం ఉన్నా పనిని సులభంగా చేయడం, అలవోకగా చేయడం, త్వరగా చేయడం సహజక్రియలుగాని, వాడిగా–పదునుగా చేయడం వ్యవహారం కాదు.

ఇతర భాషలలో ఈ నానుడికి సమానమైనవి కనిపిస్తున్నాయి. బాయే హాథ్ కా ఖేల్, బచ్చోంకా ఖేల్ వంటివి. అంటే ఎడమచేతితో అలవోకగా, అవలీలగా చేయదగినది, పిల్లలు కూడా సులభంగా, ఆడుతూ పాడుతూ చేయదగినది అని అర్థం. కనుక కూసువిద్య అంటే పిల్లలు అవలీలగా, సులభంగా చేయదగిన అనే అర్థమే సముచితమని భావిస్తున్నాను. కూసు శబ్దం తెలుగులో వ్యవహార భ్రష్టమై అమ్మకూచి, ఎలకూచి, గోడగూచి వంటి పదాలలో కొంత మార్పుతో మిగిలిందని, కూసు ఏ మార్పు లేక కన్నడంలో యథాతథంగా వ్యవహారంలో ఉందని మరొక మారు మనవి.

## ముగ్గురిదీ ఒకే సమస్య

ఆమధ్య నా మిత్రుడొకడు జాబు వ్రాశాడు– “నేను హైకోర్టులో ఒక కేసు విషయమై వాంగ్మూలం ఇవ్వాలి గనుక హైదరాబాద్‌కు వస్తున్నాను. నీ ఇంట్లో బస చేస్తాను”అని.

నేను జవాబు వ్రాశాను– “నీవు మా ఇంట్లో బసచేయడం సంతోషకరం, నాకుగాని, తక్కినవాళ్లకుగాని, ఎలాంటి ఆక్షేపణాలేదు. కాని నీ వాంగ్మూలమే నాకు కొంచెం కష్టం కలిగించింది” అని.

“అదేమిటి? నేను వాంగ్మూలం ఇవ్వడానికేకదా రావడం. నీకేం కష్టం కలిగించింది? నాకు అర్థం కాలేదు. ఎలాగూ వస్తున్నాను గదా! సమక్షంలో మాట్లాడుదాము? అని జవాబు వచ్చింది.

“నీ జాబు చేరింది. నీవు నా జవాబును సరిగా అర్థం చేసుకోలేదు. నీవు కోర్టులో ఏమి చేసుకుంటావో నాకు అనవసరం. నీ “వాంగ్మూలమే నాకు కష్టం కలిగించింది” అని మళ్లీ వ్రాశాను.

ఈలోగా మరొక మిత్రుడినుంచి ఒక లేఖ వచ్చింది. ప్రాకృత వాంగ్మయం గురించి కొన్ని సందేహాలున్నాయట, ఆయన గారికి, వస్తున్నాడట. సరే రమ్మని వ్రాశాను.

ఈ వాంగ్మూలం, వాంగ్మయం ఏమిటి? ఎలా పట్టుకున్నారు వీటిని? అని ఆలోచిస్తుండగా, మరొక ఉత్తరం ఒక అపరిచిత వ్యక్తి నుంచి “అయ్యా, నమస్కారాలు

నాకు మీతో పరిచయం సాహిత్యంతోనే. నేను 'వాంగ్మాల' అనే కవితా సంకలనాన్ని, 'వాంగ్మౌక్తికాలు' అనే సుభాషితాల సంకలనాన్ని రచించాను. ఒకదానికి మున్నుడి, మరొక దానికి పిన్నుడి (అభిప్రాయం) మీరు వ్రాయాలని కోరుతున్నాను."

నేను చాలా ఆనందించాను. వాంగ్మూలం, వాంగ్మయం, వాంగ్మాల, వాంగ్మౌక్తికాలు. బలే ఉన్నాయి మాటలు. వీరికి నా సహాయం వాంగ్మాత్రం! నా అదృష్టం! ముగ్గురూ ఒకే దినం దిగారు. ఉదయం తీరిక ఉండదు. ప్రతి నగరవాసికీ జీవికకోసం ఉరుకులు పరుగులు. సాయంకాలం ఏవో పనులు. "రాత్రి భోజనానంతరం తీరికగా మాట్లాడుకుందాం" అని నేను వారితో అన్నాను.

నా మిత్రుడు హైకోర్టుకు వెళ్లి తన వాంగ్మూలం ఇచ్చి వచ్చాడు. ఎంతో బరువుదించుకున్నట్టుగా హాయిగా ఉన్నాడు. ముఖం తేటగా ఉంది. తక్కిన ఇద్దరూ నా అభిప్రాయం కోసం ఎదురుచూస్తున్నారు. భోజనం ముగించుకొని డాబా మీదికి వెళ్లాం. కార్తిక మాసం, వెన్నెల విరగగాస్తూంది. ఆ వెన్నెల హాయిలో నాకు అనిపించింది. "ఎంత బాగుందీ వెన్నెల, మహాపురుషుల మనస్సులాగ, మహాకవుల కావ్యాలలాగ, కల్లాకపటం లేని కసుకందుల నవ్వులాగ!" అప్రయత్నంగా

ఇద మాంధంతమః కృత్స్నం
జాయేత భువన త్రయమ్,
యది శబ్దాహ్వయం జ్యోతిః
ఆ సంసారాన్న దీప్యతే.

శబ్దమనే జ్యోతి వెలుగకపోతే, మూడులోకాలూ చీకటిలో మునిగిపోయేవి.

ఆదిరాజ యశోబింబమ్
ఆదర్శం ప్రాప్యవాఙ్మయమ్,
తేషా మసన్నిధానేపి
నస్వయ పశ్యనశ్యతి

(ఎంత విచిత్రం! మహానుభావులయిన పూర్వ రాజుల కీర్తిబింబమనే అద్దంలో ప్రతి ఫలించిన వాఙ్మయం వారు కను మరుగయి పోయినా నశించడంలేదు. చూచావా?) అనేశ్లోకాలు జ్ఞప్తికి వచ్చాయి.

"ఏమిటోయ్! వెన్నెలలను విరుచుకు తింటున్నట్టు ఆనందించిపోతున్నావు! నా వాంగ్మూలం గురించి ఏదో అన్నావే. ఏమిటి చెప్పు. నేను వాంగ్మూలం ఇవ్వడం తప్పంటావా? వ్యవహారమంతా నా వాంగ్మూలంపైనే ఆధారపడిందోయ్ నీ ఆక్షేపణ ఏమిటో నాకు అర్థం కాలేదు" అని సంభాషణ ప్రారంభించాడు నా మిత్రుడు.

"గురూగారూ! మా సంగతికూడ కొంచెం చూడండి. రేపు సెలవు గనుక, సాయంకాలంలోగా మీ అభిప్రాయం తీసుకొని, ఎల్లుండి ఉదయానికల్లా ఊరు చేరుకోవాలి, రిజర్వేషన్ కూడా అయిపోయింది". అన్నారు తక్కిన ఇద్దరు.

"మీ ముగ్గురిదీ ఒకే సమస్య" అన్నాను నేను.

ముగ్గురూ ఉలికిపడ్డారు. నా మిత్రుడు వెంటనే అందుకుని, "అదేమిటోయ్! నాదేమో కోర్టులో వాంగ్మూలమాయె. వారి సంగతి నాకు తెలియదు" అన్నాడు.

"నేను ప్రాకృత వాంగ్మయంలో సందేహాలకోసం వచ్చానండీ, ముగ్గురిదీ ఒకే సమస్య ఎలా గురుగారూ!" అన్నాడు ప్రాకృతం ఆయన.

"నేను కోర్టు వ్యవహారం కోసం రాలేదు సార్. నా వాంగ్మాల, వాంగ్మౌక్తికాలు వినిపించడానికి వచ్చాను. ముగ్గురి సమస్యా ఒకటేనంటున్నారు. నాకు బోధపడడంలేదు" అన్నాడు కవిపుంగవుడు.

నేను గొంతుసవరించుకొని "మీ అందరి సమస్యా నాకు ఒక్కటే, ముగ్గురూ తప్పులు వ్రాశారు. తప్పు ముగ్గురికీ సాధారణ ధర్మం– కనుక, ముగ్గురి సమస్యా ఒక్కటే అని అన్నాను. ఆ తప్పేమిటో వివరించాలి గదా" అన్నాను.

ముగ్గురి ముఖాలూ కొంచెం ఎరుపెక్కాయి. విడివిడిగా పిలిచి తప్పేమిటో చెబితే బాగుండేది కదా, ఏదో పెద్దమనిషికదా అని వస్తే, బహిరంగంగా మానం తీస్తున్నాడే ఈయన అనే భావం తారట్లాడింది ఆ ముఖరాగంలో.

"గాభరా పడకండి అవమానిస్తున్నానని అసలే అపోహపడవద్దు. నా మిత్రుడు వాంగ్మూలం అని వ్రాశాడు. వాఙ్మూలం అని ఉండాలి. ఈ ప్రాకృతాభిమాని ప్రాకృత వాంగ్మయం అని వ్రాశారు. ప్రాకృత వాఙ్మయం అని వ్రాయాలి. ఈ కవిగారు వాంగ్మాల అని వాంగ్మౌక్తికాలు అని వ్రాశారు. వాఙ్మాల, వాఙ్మౌక్తికాలు అని వ్రాయాలి. ఇదీ మీ ముగ్గురి ఉమ్మడి తప్పు" అన్నాను.

"అబ్బ! ఇదా సంగతి. ఎంత ఆందోళనలో, సందేహంలో పెట్టారు గురువుగారూ!" అన్నారు అపరిచితులిద్దరూ. "చంపేశావోయ్! నేను కోర్టుకెక్కడం తప్పేమో అని

భయపడిపోయాననుకో" అని మిత్రుడు ఒక నవ్వు నవ్వాడు.

కొన్ని క్షణాలు గడిచాయి. "మరి ఎందుకు తప్పో? ఇంతకాలంగా వ్రాస్తున్నామే!" అన్నారు ముగ్గురూ ఏక కాలంలోనే నేను వివరించాను, ఏదో గహనాతిగహనమైన విషయాన్ని, రహస్యాన్ని చెబుతున్నట్టు.

వాంగ్మూలం ఎందుకు తప్పు? ఈ సమాసంలో వాక్+మూలం అని రెండు పదాలున్నాయి. సంస్కృత వ్యాకరణం ప్రకారం వాక్ అనే మాట పక్కన మూలం అనే అనునాసికమయిన మ ఉన్నప్పుడు వెనుక ఉన్న కకారం అనునాసికమైపోతుంది. అంటే, క వర్గంలోని అనునాసికమైన ఙ కారంగా మారుతుంది. అప్పుడు వాకౌ-వాఙ్+మూలం=వాఙ్మూలం, వాఙ్మూలం అనే రూపం ఏర్పడుతుంది. వాం+గ్+మూలం కాదు. గకారం వచ్చే ప్రసక్తే లేదు.

అలాగే వాక్+మయం అన్నప్పుడు, వాక్‌లోని క మ పక్కన ఉన్నందున ఙ కారమయి వాక్-ఙ్+మయం=వాఙ్మయం-వాఙ్మయం అవుతుంది.

అలాగే, వాక్+మాల=వాఙ్మాల అని, వాక్+మౌక్తికాలు = వాఙ్ + మౌక్తికాలు - వాఙ్మౌక్తికాలు అని అవుతాయి. ఈ సంధి చాలా చిన్న సంగతి.

వారు నా మాటలు శ్రద్ధగా విన్నారు. తప్పు సవరించుకుంటామన్నారు. నేను మళ్లీ అన్నాను.

"మీకు మరికొన్ని తమాషా పదాలు చెబుతాను. మూడు+నాళ్లు=మూన్నాళ్లు అవుతుంది. మూడులోని డు పక్కన ఉన్న న కార ప్రభావంతో తాను న అయిపోయి మూన్నాళ్లలో చేరిపోతుంది. వేడి+నీళ్లు=వేన్నీళ్లు. వేడిలోనిడి పక్కన ఉన్న నీ సాహసంతో ని అయి కలిసిపోతుంది. వేన్నీళ్లు అయింది. అనునాసిక బలం అలాంటిది అన్నాను.

వెన్నెల హాయికి ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియలేదు. పక్కన ఉన్న సముద్రపు తరంగాలు వాఙ్మయం, వాఙ్మయం అంటున్నట్టు వినిపించి మేల్కొన్నాము.

## ప్రదానం - ప్రధానం

తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిభా - ధర్మనిధి పురస్కారాల బహూకరణోత్సవం మొన్న మార్చి మూడవ వారంలో కాబోలు జరిగింది. పదిమంది మిత్రులు పురస్కారం గ్రహిస్తున్నారు. చూచి ఆనందించి అభినందిద్దాం బాగుంటుంది - అని బయలుదేరి విశ్వవిద్యాలయం ఎదట బస్సుదిగాను.

"ప్రతిభా – ధర్మనిధి పురస్కార ప్రధానోత్సవం" అని తాటికాయంత అక్షరాలతో వస్త్రపట్టిక ఆవరణ తలుపుపైన వ్రేలాడుతూంది. రెండు నిమిషాలు చూస్తూ ఆశ్చర్యపోతూ నిలబడ్డాను.

నాలాంటి ప్రేక్షకుడే కాబోలు, మరొక పెద్దమనిషి, "ఏమిటి సార్ అంతగా చూస్తూ నిలబడిపోయారు?" అని ప్రశ్నించారు.

"ఆ! ఏమీలేదు. ప్రధానోత్సవం అని ఉంది. ఇది పురస్కార ప్రదానం కదా! ప్రధానం అంటే ప్రాంతానికొక అర్థం ఉంది. కొన్నిచోట్ల వివాహం తాంబూలాలు పుచ్చుకోడానికీ, కొన్ని చోట్ల ఏకంగా గర్భాదానానికీ ప్రధానం అని వ్యవహరిస్తారు. ఈ ప్రధానం ఈ రెండింటిలో ఏదా అని ఆలోచిస్తూ నిలబడ్డాను" అన్నాను.

"ఆయ్! చంపేశారండీ. ఇది ఆ రెండూ కాదండీ, బహూకరణాలు ఇవ్వడం" అని ఆయన నాకు వివరించాడు.

"అలా అయితే ప్రదానం అని ఉండాలి కదా! మరి...." అని నీళ్లు నమిలాను.

"మహానుభావా! ఎవరో అక్షరాలు మాత్రం తెలిసిన పెయింటర్ వ్రాస్తాడు, వ్రాసి ఉంటాడు. ఈ చిన్న విషయం పట్టించుకుంటే ఎట్లా?" అని ఆయన నేనేదో తప్పు చేసినట్టుగా చెప్పాడు.

నాకు కష్టమనిపించింది, తప్పు చేసింది విశ్వవిద్యాలయం వారు. ఈయన ఎవరో ముక్కుమొగం తెలీని పెద్దమనిషి నన్ను దెప్పడమా అని నొచ్చుకుంటూ, "సరేనండీ, మీరన్నదీ బాగుందికాని, విద్యాశిక్షణపీఠం, తప్పొప్పులు వివరించే ఆచార్యస్థానం అయిన విశ్వవిద్యాలయమే ఇలాంటి తప్పులు వ్రాస్తే, సగటు మనిషి ఏమవుతాడు? తప్పులే వ్రాస్తాడు" అని అంటూ విసురుగా లోపలికి వచ్చేశాను. అతడు ఏమయితే నాకేం?

విశ్వవిద్యాలయం సభాశాలలో కూర్చున్నాను. నలుగురితో మాట్లాడుతూ యథాలాపంగా తలెత్తి ఎదుట వేదికను చూచాను. ఇరవై ఇరవైఅయిదు కుర్చీలు అందంగా అమర్చినారు. వెనుక ఎర్రటి గుడ్డపై తెలుగు విశ్వవిద్యాలయం అని పైవరుస. రెండవ వరుసలో ప్రతిభా–ధర్మనిధి పురస్కారాల ప్రధానోత్సవం అని పెద్ద పెద్ద అక్షరాలు. ఈసారి నిజంగానే ఒళ్లు మండింది. చుట్టుపట్లా, వరండాలోను విశ్వవిద్యాలయం ఆచార్యులు, అధికారులూ తిరుగుతున్నారు. వారిలో పౌర సంబంధ ప్రచారాధికారి చెన్నయ్యగారూ ఉన్నారు. ఆయన సహృదయుడు. ఇది తప్పుఅని చెబితే సవరించుకోడానికి ప్రయత్నిస్తాడు. ఆయన్ను పిలిచి "ఇదేమిటండీ! వేదిక మీదా ప్రదానోత్సవం అనడానికి మీరు ప్రధానోత్సవం అని ఉంది. ధాలోని పొక్కిలి గీతను తుడిపించండి" అనికోరాను.

ఆయన నన్ను ఎగాదిగా చూస్తూ "నిజంగానా? నేను గమనించలేదండీ. పెయింటర్ పొరపాటు చేసి ఉంటాడు" అన్నారు.

"పొరపాటు ఎవరు చేసినా, పర్యవేక్షణాధికారులు మీరేకదా! మీపైనే పడుతుంది, ఇంకా ఐదునిమిషాలుంది సభాప్రారంభానికి తుడిపించండి వెంటనే" అని అభ్యర్థించాను. ఆయన పరుగులమీద వేదికపైకి వెళ్లి పెయింటర్ను పిలిపించి తుడిపించాడు.

ఇదంతా చూస్తున్న ద్వారంలో మొదట కలుసుకున్న పెద్దమనిషి "బలే హంగామా చేశారు సార్! ఇంతకూ పొక్కిలిలో గీత ఉంటే, అంతకొంప మునిగిందేముంది?" అని ప్రశ్నించాడు.

"అయితే వినండి ఉండ్రాళ్లుతే – అనడానికి మారు గుండ్రాళ్లుతే అంటాననుకోండి. మీరు ఊరుకుంటారా?" అని ప్రశ్నించాను. ఆయన ఊరుకోనన్నాడు. "మరి ఇదీ అలాంటిదే. ఒక పదానికి ఒక స్పష్టమయిన అర్థం ఉంటుంది. కనుక ఆ పదాన్ని స్పష్టంగా పలుక్కపోతే, ఆ అర్థం రాదు. 'కు' 'గు'కు కొంచెమే కదా తేడా. సరిపెట్టుకోవచ్చుగదా అంటే ఎలా?" అన్నాను.

"అయితే ప్రదాన ప్రధానాలు సంగతి వివరిద్దురూ?" అని కోరాడు ఆయన. "ఇప్పుడా?" అన్నాను.

"ఇప్పుడుగాదండీ మీ తీరిక వేళల్లో వ్రాయండి" అన్నాడు. ఆయన కోరినందుకే ఈవ్రాత.

దా, ధా అనేవి రెండు విడి ధాతువులు. మొదటి దానిని సంస్కృత సంప్రదాయం ప్రకారం డు దాఞ్+దానే అని, రెండవ దానిని డు ధా ఞ్ ధారణ పోషణయోః అని ధాతు పాఠజ్ఞులు అంటారు. మనం అలాంటి పరిభాష జోలికి పోక దా–ధా ధాతువులు అని అందాం.

దా ధాతువుకు ఇవ్వడం, కన్యాదానం చేయడం, వదిలిపెట్టడం, బోధించడం, చేర్చడం, అనుగ్రహించడం, ఆహుతి ఇవ్వడం, తిరిగి ఇవ్వడం, ఉదారంగా ఉండడం, ఏదైనా ఇవ్వజూపడం, లంచం ఇంకా ఎన్నో అర్థాలున్నాయి.

దానం అనే పదం ఈ దా ధాతువు నుంచి వచ్చింది – దా+అన=దాన. ఈ దాన పదంతో ఎన్నో సమస్తపదాలు పుట్టాయి. దాన+కామ=ఏదైనా ఇద్దామనే ఆశ కలవాడు. దాన+చ్యుతు=ఔదార్యంలేని వాడు. దాన+ధర్మ=ఔదార్యమనే కర్తవ్యం. దాన+పతి=ఔదార్యదేవత. దాన+పత్ర=దానమిచ్చినట్టు సూచించే ఆకు–కాయితం. దాన+పర=ఎల్లప్పుడూ దానం చేసేవాడు. దాన+వర్మ=దానమే కవచంగా గలవాడు,

దాన+వీర=ధైర్యంగా దానంచేసేవాడు–దానవీరుడు. దాన+శూర=దానశూరుడు. దాన+శీల=దానం చేసే స్వభావం గలవాడు, ఎప్పుడూ దానం చేసేవాడు. దాన+హీన=ఔదార్యంలేనివాడు. దానవిక=దానసంబంధి, దాన + నీయు = దానంచేయదగింది. దాను=దాని–ఇలా ఎన్నో.

దా–అన్నప్పుడు అల్పప్రాణం. ధానం చేసేవాడు, ధానం=ఇవ్వడం అని మహాప్రాణంగా పలుకరాదు, వ్రాయరాదు.

ఇక ధా ధాతువుకు ఉంచు, చేయు, సృష్టించు, కలిగించు, స్వీకరించు, పట్టుకొను, ఆనందించు, చూపు, ప్రదర్శించు, పొందు, అనుభవించు, ప్రతిష్ఠించు, గ్రహించు, ధరించు, పైనవేసుకొను, అంకితం చేయు, పంపివేయు ఇత్యాదిగా ఎన్నో అర్థాలున్నాయి.

దాన శబ్దానికి వెనుక 'ప్ర' అనే ఉపసర్గ చేర్చితే ప్ర+దాన=ప్రదాన. విశేషంగా ఇవ్వడం, బహూకరించడం, హోమం చేయడం, బహూకృతి, సూత్రసమన్వయం, కళ్లు తిప్పడం, (ఏదైనా పని) చేయడం, శపించడం, ప్రకటించడం మొదలయిన అర్థాలున్నాయి.

ధాన శబ్దానికి వెనుక ప్ర అనే ఉపసర్గ చేర్చితే, ప్ర+ధాన అయి ఎన్నో నూతనార్థాలు పొందుతుంది. ప్ర+ధానం ముఖ్యుడు, అతిముఖ్యుడు, ప్రథముడు, మొట్టమొదటివాడు, ముఖ్యఅధికారి, మూలపురుషుడు, ముఖ్యబిందు, బుద్ధి, అవబోధ, రాజుగారి మొదటి సహచరుడు, మొదటి సేవకుడు, ఆత్మ, మావటి, ఉత్తముడు, నపుంసక లింగమయితే, ముఖ్యమైనది, మొదలయిన అర్థాలు.

ఈ ప్రధాన శబ్దం మీద ఏర్పడే సమస్త పదాలు కోకొల్లలు. ప్రధాన+కర్మ, ప్రధాన+కార్య=ముఖ్యమయినపని. ప్రధాన కరణవాద, ప్రధాన తమ, ప్రధానతర. ఇలా ఎన్నయినా చెప్పవచ్చు.

ప్రదాన, ప్రధాన అనే వేరే వేరే పదాలు, దా, ధా అనే వేర్వేరు ధాతువుల నుంచి ఏర్పడ్డాయి, మహాప్రాణ, అల్పప్రాణాల నుంచి ఏర్పడ్డాయి, మహాప్రాణ, అల్పప్రాణాల సామీప్యాన్ని బట్టి పరస్పరం మార్చి పలకడానికి, వ్రాయడానికీ అవకాశం ఉంది గనుక జాగరూకతతో ఉండాలనడానికే ఇంతగా వివరించవలసివచ్చింది. ప్రభావం అంటేనే దానం, ప్రధానం అంటే దానం కాదు, ఉంచడం, పెట్టడం మొదలయినవి.

ప్రధాన అంటేనే ముఖ్యుడు, రాజుగారి మొదటి సహచరుడు, అధికారి అన్నామగదా. శివాజీ తర్వాత మహారాష్ట్ర సామ్రాజ్యంలో అష్టప్రధాన్‌లు – ఎనమండుగురు

ముఖ్య అధికారులు, మంత్రులు ఉండేవారు. తర్వాత ఆ సామ్రాజ్యం ఎనిమిది చీలికలయింది. అది వేరేగాథ

ప్రధాన శబ్దంతో మన తెలుగువారు తృప్తి పడక నను నీ చేసి ప్రధాని అంటున్నారు – అవధాని, రాజధానిలాగ. దీనికి కారణం ప్రధాన+మంత్రి=ప్రధానమంత్రిగదా. ప్రధాన శబ్దంలోని నకు మంత్రి శబ్దంలోని ఈని తగిలించాడు. ఎవడో మేధావి, ప్రధాని అన్నాడు. తప్పులంటే మనకు లడ్లు, జిలేబీలు గదా! పట్టుకున్నాం. ప్రధాని రాక, ప్రధాని కథనం, ప్రధాని ఉవాచ ఇలా మొదలు పెట్టాం దీనికి ఈ అర్థమేలేదు.

ప్రధాని అంటే సంస్కృత వ్యాకరణం ప్రకారం ప్రధానులు–ముఖ్యులు ఎందరో కలవాడు అని అర్థం. అతను ప్రధానమంత్రికాదు, అతనిపైనో, కిందో ఎందరో ప్రధానులు ఉన్నవాడు అని అర్థం. ప్రధానాః సంతిఅస్య=ప్రధాన+ఇన్=ప్రధానిన్. ఈ దెబ్బతో ప్రధాని అంటే, మనదేశంలోనే కాదు, ప్రపంచంలో ఎక్కడా ఎవడూ ప్రధానమంత్రి కాదు.

ప్రధానమంత్రిని ప్రధాని అని తప్పుగా వాడడానికి మరొకకారణమూ ఉంటుందేమో! ప్రధాన శబ్దానికి, ప్రధాని శబ్దానికి బహువచనం ప్రధానులు. ప్రధానుడు–ప్రధానులు, ప్రధాని–ప్రధానులు. ఈ బహువచన భ్రమలో ప్రధాని పదం – ప్రధానులు అనే బహువచనానికి ప్రధాని అనే ఏకవచనపదం – ఏర్పడిందేమో!

ఏమైనా, ప్రధాని అంటే ప్రధానమంత్రి మాత్రం కాదు. ఇంత చర్చా జరిగిం తరువాత మోనియర్ విల్లియమ్స్ సంస్కృత నిఘంటువు తిరగవేశాను. ప్రధాని అనే పదానికి ఇచ్చు, బహూకరించు అనే అర్థాలకు ఋగ్వేద ప్రయోగం చూపించాడు ఒక్కగానొక్కటి. గతుక్కుమన్నది గుండె. సరే, వేదకాలంలో సకృత్తుగా ఆ అర్థం ఉందేమో ఇతిహాసపురాణ కావ్యనాటిక సాహిత్య ప్రపంచంలో లేదు. కనుక మనం దానార్థంలో ప్రదానం అని వాడడమే ఉచితం అని భావించాను.

## హత్య – హంతకుడు

ఏ పత్రికనన్నా అలవోకగా తీసుకొని తిరగవేయండి పుటలను – అది దినపత్రిక అయినా, వారపత్రిక అయినా, మాసపత్రిక అయినా మరేదైనా పుటకొక హత్య, హంతకులు పరారుకావడం కనిపిస్తాయి. వాళ్లకోసం పోలీసుల గాలింపులు, వేలిముద్రల నిపుణులరాక, ఇలాంటి దురంతాలు జరిగిన స్థలాలకు వెళ్లి వేలిముద్రలు తీసుకోడం, చంపినవారు వదలిన వస్తువులకోసం అన్వేషణ మొదలయినది వేరే రంగం.

ఈ హత్య, హంతకుడు అనేవి ఎంత తప్పుడు పనులో ఈ పదాలూ అంత తప్పుడు పదాలని ఎవరికీ తోచదు. గొర్రెదాటుగా ప్రయోగిస్తున్నారు.

అదేమిటి గో హత్య, బ్రహ్మహత్య అనే ప్రయోగాలు. వేల సంవత్సరాల శిలాతామ్రశాసనాలలో కనిపిస్తుంటే, తప్పుఎలా అనే ప్రశ్న ఎవరైనా వేస్తారు. శబ్దరత్నాకరంలోను, మోనియర్ విల్లియమ్స్ సంస్కృతాంధ్ర నిఘంటువు, శబ్దార్థకల్పద్రుమంలోను, మరికొన్ని నిఘంటువులలోను హత్య అనే పదానికి హననం అనే అర్థమిచ్చి, ఇది ఆకారాంత స్త్రీలింగమని స్పష్టంగా లింగవచనాలు ఇచ్చిఉండగా తప్పు ఎలా అని గద్దిస్తారుకూడ. ఇదిఎలా తప్పో వివరణ అవసరం మరి!

హత్య అనే పదం హన అనే ధాతువునుంచి ఏర్పడింది. ఈ ధాతువుకు హింసించడం, వెళ్లడం అనే అర్థాలున్నాయి. హన్ ధాతువుకు భావార్థకంలో క్యప్ ప్రత్యయమూ, హన్‌లోని నాకారానికి తకారమూ రావడంవల్ల హత్య అనే రూపం ఏర్పడింది. హన్+క్యప్–హన్+య–హత్+య+ఆ హత్యా.

ఈ హత్యా అనే పదాన్ని విడిగా వాడరాదని వ్యాకరణ నియమం. దీని వెనుక ఒక సుబంత పదం ఉన్నప్పుడే హత్యఅనే రూపం ఏర్పడుతుంది. ఉదాహరణ–గోహత్య, బ్రహ్మహత్య, అశ్వహత్య హనస్తచ–అని పాణిని సూత్రం. సనం, ఆలంభం, పింజం, విశరం, ఘాతం, ఉన్మాథం, ఉన్మాధం, వధం – అని 30 పర్యాయాలు ఇచ్చాడు. హత్యకు విడిగా ప్రయోగం లేనందున హత్య అనే ప్రయోగం ఇవ్వలేదు. స్పష్టతకోసం అమరంలోని పదాలన్నీ ఏకరువు పెట్టాను. కనుక విడిగా ప్రయోగించదలచినప్పుడు వధ అనే ప్రయోగించాలి.

హంతకుడు మరీ వింత. ఎలా దూరాడో సాహిత్యంలో హంతక అనే పదాన్ని చంపేవాడు అనే అర్థంలో విరివిగా వాడుతున్నారు. కాని ఈ పదం ఏర్పడడానికే అవకాశంలేదు. హన్‌ధాతువుపై కర్త్రర్థకంలో అక అని మారే ణ్వుల్ ప్రత్యయం వచ్చి హంతక అని కావచ్చుగదా అని ప్రశ్నించవచ్చు. కాని, హనధాతువుకు ణ్వుల్ ప్రత్యయం వచ్చినప్పుడు, హన్‌ధాతువులోని నకారం తకారమవుతుంది. హకారం ఘగా మారి ఆదివృద్ధివచ్చి ఘా గా మారి, ఘాతక అనే రూపం ఏర్పడుతుంది. హన్+ణ్వుల్–హన్+అక–హత్+అక హన్ ధాతువుకు ఉపసర్గం కాని సుబంతం ఉపపదంగా ఉన్నప్పుడు క్యప్ అనే ప్రత్యయమూ, నకారానికి తకారమూ వస్తాయి అని ఈ సూత్రం అర్థం. వెనక పదం లేనప్పుడు హన్ అనే దానికి వధ్ అనేది ఆదేశమయి వధ్+అ=వధ అనే రూపం ఏర్పడుతుంది. కనక విడిగా వాడేటప్పుడు వధ అనే పదమే

వాడాలి, వెనక నామవాచకమైన పదం ఉన్నప్పుడు హత్యఅని వాడాలి.

అర్వాచీన నిఘంటువులలో హత్యా అనేపదం వధార్థంలో ఉన్నా అమరసింహుడు వధ శబ్దం పేర్కొన్నాడేకాని, హత్యా అనే పదాన్ని విడిగా పేర్కొనలేదు. అమరసింహుడు చంపడం అనే అర్థంలో ఇచ్చిన పదాలు చూడండి; ప్రమాపణం, నిబర్హణం, నికారణం, నిశారణం, ప్రవాసనం, పరాసనం, నిఘాదనం, నహింసనం, నిర్వాపణం, సంజ్ఞపనం, నిర్గ్రంధనం, అహననం, నిస్తరణం, నిహననం, క్షణనం, హరివర్జనం, నిర్వాసనం, విశసనం, మారణం, ప్రతిఘాతనం, ఉద్వాసనం, ప్రమథనం, క్రథనం, ఉజ్జాహత్+అక–ఘత్+అక–ఘాత్+అక=ఘాతక. కనుక పాణినీయం ప్రకారమూ, మరేవ్యాకరణ ప్రకారమూ, హంతకుడు కాదు, ఘాతకుడు అనే అవుతుంది.

హంతకుడు కాదుగాని, హంత అవుతుంది – హన్‌ధాతువుపై కర్త్రర్థంలో తృచ్ ప్రత్యయం రావడంవల్ల. దీని వల్ల హంతృ అనే రూపం ఏర్పడి, దీని ప్రథమా విభక్తి ఏకవచనరూపం హంతా అని అవుతుంది. ఈ హంత పదంపై క ప్రత్యయం విధిస్తే హంతకకావచ్చు గదా అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. కప్రత్యయం హంతృఅనే ప్రాతిపదికకు వస్తుందిగాని, ప్రథమావిభక్తి ఏకవచనం మీద రాదు. అలా వచ్చినప్పుడు హంతృక అనే రూపం ఏర్పడుతుంది, దాన్ని తత్సమంగా వాడినప్పుడు హంతృకుడు అని అవుతుంది. హంతకుడు కానేకాదు. అందువల్ల చంపేవాడు అనే అర్థంలో హంత, హంతృకుడు, ఘాతకుడు అనే ప్రయోగించాలి, హంతకుడు అనికాదు. మనకు హంతృకుడు ఉన్నాడేగాని హతకుడు లేడు.

అయితే, ఇంత తప్పయిన హంత కపదం ఇంతవ్యాప్తి చెందడానికి ఏమిటి కారణం? అని ఆలోచిస్తే, అంత+ర=అంతక అనే పదం హంతకుడుగా మారి ఉండవచ్చునని తోస్తుంది అంత+క అనే శబ్దానికి అంతం కలిగించేవాడు అనే అర్థం ఉంది. అకారహకారాల పుట్టుక స్థానం కంఠం. కనుక అంతక అనే పదాన్ని కోపంతోనో, కసితోనో, నిరసనతోనో ఒత్తి పలికేటప్పుడు అంతకఅనే పదాదిలో ఉన్న అకారం హకారంగా మారి హంతక అనే రూపం ఏర్పడి ఉంటుంది. రెండు పదాల అర్థమూ ఒక్కటే. అకారహకారాల వ్యత్యయంతో ఏర్పడిన పదాలు తెలుగులో చాలానే ఉన్నాయి– అడపము–హడపము, హట్టం–అట్టం, అరణం–హరణం, అరిగోలు–హరిగోలు, హింగు–ఇంగువ, ఇంగుది–హింగుది.

## ప్రతిష్ఠానికి కాదు ప్రతిష్ఠతకు లేదా ప్రతిష్ఠత్వానికి అనాలి

"కాంగ్రెస్ ప్రతిష్ఠానికి అధిష్ఠానం చర్యలు" అని ఒక పత్రిక పతాక శీర్షిక. ఇక్కడ ప్రతిష్ఠ అనేది విశేష్యనిఘ్నం. అంటే విశేషణపదం. విశేషణపదం విశేష్యపదం ప్రత్యేకతను తెలుపడమో, ప్రత్యేకతను ఆపాదించడమో చేయాలి. ఈ వాక్యంలో కాంగ్రెస్‌ను శక్తిమంతంగా, దృఢంగా చేయడం అని ఉద్దేశం. దానికి ప్రతిష్ఠ అనే విశేషణ పదాన్ని వాడారు. కాని ఈ వాక్యంలో కాంగ్రెస్ అనే విశేష్యనామ వాచకం ప్రతిష్ఠానికి అనే విశేషణంతో అన్వయించదు. ప్రతిష్ఠంచేయడానికి అని అన్నప్పుడే ఆ అర్థం వస్తుంది. ప్రతిష్ఠీకరణం ఉద్దేశమయినప్పుడు ప్రతిష్ఠం+చేయడం అనే అర్థం వచ్చే పదప్రయోగం ఉండాలి. కాంగ్రెస్ ప్రతిష్ఠానికి అన్నప్పుడు ఆ అర్థం రాదు. కాంగ్రెస్‌ను ప్రతిష్ఠం చేయడానికి అనిగాని, కాంగ్రెస్ పటుత్వానికి అనిగాని, కాంగ్రెస్ ప్రతిష్ఠం కావడానికి అని గాని ప్రయోగించాలి. ప్రతిష్ఠం విశేషణం గనుక ప్రతిష్ఠమైన కాంగ్రెస్ ఏర్పడడానికి, రూపొందడానికి అని కూడా కావచ్చు. కనుక కాంగ్రెస్ ప్రతిష్ఠానికి అనేవాక్యం ఏ విధంగా చూచినా సాధువుకాదు. కాంగ్రెస్‌ను ప్రతిష్ఠం చేయడానికి అని స్పష్టంగా వ్రాయవచ్చుగదా! లేనిపోని పాండిత్యాలకు పోవడం ఎందుకు?

"కాంగ్రెస్ బలోపేతానికి" అన్నది కూడా పైలాంటిదే. బలోపేతానికి అన్న సమాసంలో బల+పేత అనే రెండు పదాలున్నాయి. ఇవి చేరి బలోపేత అయింది. బలోపేతం అంటే బలంతో కూడిన అని అర్థం. బలోపేత అనేది కూడ ప్రతిష్ఠలాగే విశేషణం. విశేష్యమయిన నామవాచకం గుణగణాలు తెలిపేదో, తెలుపబోయేదో.

బలోపేతానికి అంటే బలోపేతం చేయడానికి అనే అర్థంలో వాడడానికి ఈ పదానికి శక్తి లేదు. బలోపేతం చేయడానికి కాంగ్రెస్‌ను బలోపేతం చేయడానికి అనో, కాంగ్రెస్ బలోపేతం కావడానికి అనో వ్రాయాలి. కాంగ్రెస్ అనే పదం బలోపేత అనే విశేషణంతో అన్వయిస్తుంది, దానితో దాని శక్తి పూర్తవుతుంది. బలోపేతం కావడానికి, బలోపేతం చేయడానికి అనే పనులు చేయడానికి సూచించే పదాలు బలోపేతంలో లేవు. కనుక బలోపేతం చేయడం, బలోపేతం కావడం అనే అర్థాన్ని బలోపేతానికి అనే పదం ఇవ్వజాలదు. మన భావాన్ని ఎదుటివాడికి తెలుపడానికే మన వాగ్వ్యాపార ప్రయత్నమంతా గనుక, బలోపేతం కావడానికి, బలోపేతం చేయడానికి అని స్పష్టంగా ఉండాలి.

మరొక విచిత్ర ప్రయోగం "పార్టీని ప్రతిష్ఠవంతంగా చేయడానికి" అనేది. దీని ఉద్దేశం పార్టీని ప్రతిష్ఠం చేయడం– శక్తిమంతం చేయడం అయితే ఈ వాక్యం తప్పు. ప్రతిష్ఠ అంటే బలం కలది. బలంకలిగినవాడు. అలాంటి ప్రతిష్ఠమైన–బలంకలిగిన– వ్యక్తులుగాని, వర్గాలుగాని పార్టీలో ఉండడం అనేది ఉద్దేశమైనప్పుడు తప్పుగాదు.

పటిష్ఠ అనే శబ్దంపై కలవాడు–కలది అనే అర్థంలో మతుప్ అనే ప్రత్యయంవచ్చి, మకారం వకారమై పటిష్ఠవాన్ – పటిష్ఠవత్ అనే రూపాలు ఏర్పడుతాయి. వీటికి పటిష్ఠులు–శక్తిమంతులు కలవాడు – కలది అని అర్థం. పటిష్ఠవత్ అనే పదాన్ని తత్సమీకరించుంటే, పటిష్ఠవంతం అని అవుతుంది. దీని అర్థం పటిష్ఠులు–బలవంతులు కలది, లేక బలవంతమైన వర్గాలు గలది అని.

కనుక పార్టీని శక్తిమంతంగా చేయడం ఉద్దేశం గనుక పార్టీని పటిష్ఠంగా అని మాత్రమే వ్రాయాలి. పటిష్ఠవంతంగా అని ప్రయోగిస్తే పటిష్ఠులయినవారు కలదిగా చేయడం అనే అర్థం ఏర్పడి ఆ ఉద్దేశాన్ని స్పష్టీకరించదు.

పటిష్ఠవంతం లాంటిదే సమర్థవంతంగా అనే పదమూను, ఈ సమర్థవంతాన్ని ఇది వరకే వ్రాశాను. గనుక మరొకమారు సంగ్రహంగా తెలుపుతాను.

సమర్థుడు, సమర్థవంతుడు, సమర్థంగా, సమర్థవంతంగా– ఈ పదాలు వ్యాకరణరీతిగా తప్పుకాదు. అన్నీ సాధు పదాలే. కాని, మనవారు వీటి అర్థభేదం తెలియక వాడడం వల్ల తప్పులు ఏర్పడుతున్నాయి. సమర్థ అంటే శక్తిగలవాడు, తగినవాడు, అర్హుడు అనే అర్థాలున్నాయి. ఇలాంటివాళ్లు కొందరు ఒక వ్యక్తి దగ్గర వుంటారనుకోండి. అతడు సమర్థవంతుడు అవుతాడు. సమర్థ అనే శబ్దం మీద కలవాడు, కలది అనే అర్థంలో మాతుప్ అనే ప్రత్యయం వచ్చి, అంటే మ వచ్చి అది వకారమై సమర్థ+మ–వ=సమర్థవాన్, సమర్థవత్ అనే రూపాలు ఏర్పడుతాయి. అంటే చాలామంది సమర్థులను తన అధీనంలోనో, కొలువులోనో పెట్టుకొన్నవ్యక్తి, పెట్టుకొన్న సంస్థ– సమర్థవాన్–సమర్థవత్. ఇది తత్సమీకరణ ప్రక్రియతో సమర్థవంతుడు, సమర్థవంతం అని అవుతుంది తెలుగులో. ఇక్కడ ఉద్దేశం కేవలం సమర్థుడు అనో, సమర్థమైనది అనో, సమర్థంగా అనో చెప్పడం అయినప్పుడు సమర్థవంతుడు, సమర్థవంతం, సమర్థవంతంగా అని వాడడం ఉచితం కాదు.

పటిష్ఠం అనేది, బలోపేతం అనేది విశేషణాలని, పటిష్ఠత, పటిష్ఠత్వం, బలోపేత, బలోపేతత్వం అనేవి గుణవాచకాలని ఇప్పుడు తెలుసుకొన్నారుగదా! కాంగ్రెస్ పటిష్ఠతకు, కాంగ్రెస్ పటిష్ఠత్వానికి అని అనవచ్చు. కాంగ్రెస్ బలోపేతత్వానికి, కాంగ్రెస్ బలోపేతతకు అని అనవచ్చు. ఎందుకంటే కాంగ్రెస్ యొక్క పటిష్ఠతకు, కాంగ్రెస్ యొక్క బలోపేతత్వానికి అని సరైన షష్ఠీతత్పురుష సమాసం అవుతుంది. గుణవాచకం వాడడానికి మారు విశేషణం వాడడం ఉచితం కాదుగదా!

కాంగ్రెస్ పటిష్ఠానికి, కాంగ్రెస్ బలోపేతానికి ఎలా తప్పో ఇప్పుడు స్పష్టమయిందనుకుంటాను.

# ఎవరీ ఔత్సాహికులు?

అర్ధశతాబ్దంనాటి సంగతి. మద్రాసులో ఉన్న చెన్నపురి ఆంధ్రమహాసభలో ఏవోనాటకాల పోటీలు జరుగుతున్నాయి. నేను నా అర్ధాంగితోపాటు ఆ పోటీలను చూడడానికి వెళ్లుదామనుకున్నాను. ఇంతలో నాకొక ఉత్తరం వచ్చింది టపాలో. దానితోపాటే ఒక పెద్ద మనిషీ మా అద్దెఇల్లు వెదుక్కుంటూ వచ్చాడు.

"అయ్యా! ఔత్సాహిక నాటక సంఘాల నాటకనాటిక పోటీలు జరుగుతాయి రేపటి నుంచి తమరు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించాలి, మీకు మరిద్దరు తోడ్పడుతారు, నాటకాలు ముగియగానే మిమ్ముల్ను కారులో ఇంట్లో దింపుతాము" అని వచ్చిన ఆ పెద్దమనిషి అన్నాడు నాతో. రాకపోకలకు కారు అనగానే నా అర్ధాంగి ఉత్సాహంతో "ఒప్పుకోండి" అని లోపలి గది నుంచి సైగ చేసింది, నేను కొంచెంసేపు పని ఉందనీ, వ్రాయవలసిన వ్యాసాలు చాలా ఉన్నాయని బెట్టుచేసి, ఆయనతో నాలుగైదుసార్లు బ్రతిమాలించుకొని, ఆముదం తాగిన మొగంపెట్టి ఒప్పుకొన్నాను. టపాలో వచ్చిన ఉత్తరం సారాంశమూ ఇదే.

ఔత్సాహిక నాటక సంఘాల పోటీఏమిటండీ? అని ఆ పెద్దమనిషిని అడుగుదామనుకున్నాను గాని, అతడు ఏదో వ్యవస్థాపకుడేగాని, పెద్దసాహిత్య ప్రవేశం ఉన్నవాడుగా కనపడలేదు. కనుక అడగడం మానుకున్నాను.

ఆపెద్దమనిషి మాట ప్రకారమే ఇంటికి కారు పంపారు. తమ పనులు చేయించుకొనడానికి కొన్ని సంస్థలు ఎంతయినా మర్యాద చూపుతాయి. అదిన్నీ దమ్మిడీ ఖర్చు లేకుండా న్యాయనిర్ణేత దొరికినప్పుడు నేను చెన్నపురి ఆంధ్ర మహాసభ చేరుకోగానే అక్కడ పెద్దపెద్ద అక్షరాలతో "ఔత్సాహిక నాటక సంఘాల నాటక నాటికల పోటీలు అనే పటపట్టికలు వ్రేలాడుతున్నాయి. ఔత్సాహిక శబ్ద సాధుత్వా సాధుత్వ చర్చ అప్పుడు రామాయణంలో పిటకలవేటలాగ ఉంటుందని ఎవరితోను చర్చించలేదు."

"పోటీలు ముగిశాయి. బహుమాన ప్రదానం, పరస్పర ప్రశంసావర్షాలు సమాప్తమయ్యాయి. నటులూ నాటక కర్తలూ నా చుట్టూముట్టి న్యాయనిర్ణేతగా నేను చేసిన నిష్పక్షపాతకృషిని కొనియాడారు. అప్పుడడిగాను ఒక ప్రముఖ నాటక నాటికా కర్తను "ఔత్సాహిక నాటకాల పోటీ అంటే ఏమిటండీ?" అని.

"అదేం గురుగారూ? వారం రోజులపాటు ఇన్ని నాటక నాటికలు చూచారు. న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. దీనికి అర్థం అడుగుతున్నారేమిటి?" అని అందరూ కనుబొమలెగురవేశారు.

"నాటకాలూ, నాటికలూ చూచాను బాగున్నవాటికి మార్కులిచ్చాను. వాటిలో తరతమాలకు బహుమానాలు నిర్ణయించాను, ఔత్సాహిక అనేపదం అర్థం తెలియకపోవడం నా పని కేమీ అడ్డుతగులలేదు" అన్నాను.

"అదేమిటిసార్! అమెచ్యూర్ (Ameture) అనే ఆంగ్ల పదానికి ఔత్సాహిక అని వాడుతున్నాము. తెలియనట్టు మమ్మల్ను ఆటపట్టిస్తున్నారు మీరు" అని కొందరు అన్నారు.

"అబ్బే! అలాంటిదేమీలేదండీ. పెద్దమనుష్యులయిన మీ పిలుపుతో వచ్చినవాడిని, మీకు అవమానకరంగా అసభ్యంగా ప్రవర్తిస్తానా?" అన్నాను.

వాళ్లు కొంచెం నొచ్చుకొని, "అదికాదు మాస్టారూ? ఔత్సాహిక అనే పదం మీకు అర్థం కాకపోవడమేమిటి? అమెచ్యూర్ అనే పదానికి సరైన అనువాదం" అన్నారు భాష బాగా తెలుసునన్న విశ్వాసం గల ఒక నాటక కర్త.

"అమెచ్యూర్ అంటే, అభిలాష, ఉత్సుకుడు ఆసక్తి కలవాడు అనే అర్థాలున్నాయని నాకు తెలుసునండీ ఔత్సాహిక అనే అర్థం లేదు. అందుకే అడిగాను" అన్నాను.

"అదేం గురూగారూ, ఉత్సుకుడు అన్నా, ఉత్సాహి అన్నా, ఔత్సాహికుడు అన్నా ఒకటే కదా!" అన్నాడు వారిలో ఒక భాషావేత్త.

"చూచారా! ఆ భ్రాంతితోనే ఈ పొరపాటు జరిగింది, ఔత్సాహిక అంటే అమెచ్యూర్ అనే ఆంగ్లపదానికికున్న అర్థం ఇవ్వదు. కనుకే అడిగాను" అన్నాను.

"ఎలా తప్పో తెలపండి గురూగారూ? వివరిస్తే తప్పు దిద్దుకుంటాము" అన్నారు మూకుమ్మడిగా అందరూ. నేను, అదేదో సృష్టి రహస్యాన్ని వివరిస్తున్న తత్త్వవేత్తలాగ ప్రారంభించాను.

ఔత్సాహిక అనే పదాన్ని అమెచ్యూర్ పదానికి పర్యాయంగా వాడుక చేసిన మహానుభావుడు ఎవరోగాని, బలేపదం బనాయించి నాటకాల వారిపై రుద్దాడు. దానిని కడుక్కోలేకకొందరూ, కడిగినా పోక కొందరూ సతమతమవుతున్నారు. అమెచ్యూర్ అనే పదానికి ఉన్న అర్థాలు ఇదివరకే మీకు తెలుసు. నాటకాలలో నటించడం వృత్తి కాక, మరొక వృత్తిలో వుంటూ కేవలం ఆసక్తితో, ప్రవృత్తితో నాటకాలలో నటించేవాడు అమెచ్యూర్. నాటికలే కానక్కరలేదు ఒక వృత్తిలో వుంటూ మరొక పనికి ఆసక్తితో పూనుకొనేవారంతా అమెచ్యూర్లే. వీరిని మనం ఉత్సుకులు, అభిలాషులు, ఉత్సాహులు, ఉత్సాహకులు, అభిలాషకులు అనడం ఉచితం. అభిలాషి-అభిలాషులు, ఉత్సాహి-

ఉత్సాహులు. ఉత్సాహకుడు–ఉత్సాహకులు. అభిలాషుకుడు–అభిలాషుకులు. ఇన్ని పదాలుండగా, ఔత్సాహిక అనే పదాన్ని వీరు ఎందుకు పట్టుకొన్నారో!

"మన రాష్ట్రంలో అర్ధ శతాబ్దం క్రింత ప్రముఖులుగా ఉన్న నటులంతా ఉత్సాహకులే. దశరథ, రాజరాజనరేంద్రాది పాత్రలకే వన్నె తెచ్చిన అద్దంకి శ్రీరామమూర్తిగారు మొదట ఉపాధ్యాయుడు. మెట్రిక్యులేషన్ అయిన తర్వాత, సెకండరీ గ్రేడు టీచర్స్ ట్రెయినింగ్ అయి, ఉపాధ్యాయుడుగా చేరారు. నాటకాల ప్రవృత్తి బలపడిన తర్వాత, నటవృత్తి స్వీకరించారు. బందా కనకలింగేశ్వరరావు గారిది న్యాయవాదవృత్తి. ప్రవృత్తితో నటులు. బళ్లారి రాఘవవృత్తి వకాల్తా. ఆంధ్రనాటకపితామహులయిన ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు న్యాయవాదులే. ఆ వృత్తిలో వుంటూ గొప్పకీర్తి, ధనమూ సంపాదిస్తూనే నాటక సంఘాలు నిర్వహించారు, నటులుగానూ గొప్ప పేరు ప్రతిష్ఠలు పొందారు. అప్పటి నటులు చాలామంది వృత్తిరీత్యా నటులు కానందున, వేరే వృత్తులలో వున్నందున కాంట్రాక్ట్ నాటకాలు, కిరాయి నాటకాలు పుట్టుకువచ్చాయి. అది విషయాంతరం.

"ప్రస్తుతం మన వివక్ష ఔత్సాహికులు అనేది తప్పు. ఎందుకంటారా? మీరు చెప్పదలచుకొన్నది ఉత్సాహం కలవారు అనికదా! ఉత్సాహ అనే శబ్దంపై ఇక (ఠక్)అనేది ఆదేశంగా వస్తే ఉత్సాహ+ఇక=ఔత్సాహిక అనేరూపం ఏర్పడుతుంది. కాని, అప్పుడు దీని అర్థం ఉత్సాహానికి సంబంధించిన అనే అర్థం వస్తుంది. ఉత్సాహం కలవారు ఉత్సాహవంతులు అని గదా మీ ఉద్దేశం! ఆ అర్థంలో ఇక ప్రత్యయం రాదు. ఉత్సాహానికి సంబంధమైన అనే అర్థం వస్తుంది. ఉత్సాహానికి సంబంధించిన వాళ్లు ఉత్సాహవంతులు ఎలా అవుతారు? ఉత్సాహవంతులు అనిగాని, ఉత్సాహులు అనిగాని, ప్రయోగించవలసి వుంటుంది. అప్పుడు ఉత్సాహవత్–నాటక సంఘం అని అనవలసి వుంటుంది. ఇది చెవికి ఇంపుగా లేదు కదూ! అలాంటప్పుడు ఉత్సాహి నాటక సంఘం అని అనవచ్చు. ఇది చెవికి ఎబ్బెట్టుగానూ లేదు. ఇంతవరకూ ఔత్సాహిక నాటక సంఘాలు అనే పదం అలవాటు కావడం వల్ల, ఉత్సాహినాటక సంఘం అని అనడానికో, వ్రాయడానికో మనసురాదు, ఏదో పోగొట్టుకొన్నట్టు తేలికగా ఉంటుంది. 'ఔత్సాహిక' అనే తప్పు బాగా అలవాటయిపోయింది. అలవాటును వదలడం – అందులోను దశాబ్దాలుగా అలవాటులో వున్న దానిని వదలడం కష్టం జనానికి, కనుక మరొక మంచిపదం, ఔత్సాహిక, అనే పదానికి దగ్గరిదీ, సులభంగా వాడదగినదీ అయిన పదం ఉత్సాహక అనేది.

"ఈ పదం ఔత్సాహికకు దగ్గరగాను ఉంది, సరైన అర్థం కలదని, ఉత్సాహక శబ్దం యాజకాది గణంలో పాణిని చేర్చాడని మోనియర్ విల్లియమ్స్ నిఘంటువు

ఉదాహరించి ఉత్సాహంగా అనే అర్థం చెప్పింది. ఉత్సాహక సాధుపదం, సరైన అర్థం ఇచ్చేది, అలవాటయిన అసాధుపదానికి దగ్గరిదీని. కనుక త్వరగా అలవాటు చేసుకోవచ్చు. ఉత్సాహక నాటక సంఘాలు– ఉత్సాహక=ఉత్సాహం గల. ఉత్సాహక క్రీడాకార సంఘాలు, ఉత్సాహక సాహిత్య సంఘాలు– ఇలా వాడుక చేయండి."

"మిత్రులారా! అభిలాషితార్థం తెలుపని ఔత్సాహిక అనే పదం వాడడం మానండి, ఔత్సాహికకు దగ్గరగా ఉన్న ఉత్సాహక అనే సాధుపదాన్ని వాడండి. కాఫీ మానదలచుకొన్నవారు మొదట్లో ఆ రంగు కొంతకు కొంత ఉన్న ధనియాల కషాయం కాఫీని తాగుతూ, రంగయినా ఉందని సంతృప్తిపడుతూ కాఫీని క్రమంగా మానివేసినట్టు, ఔత్సాహిక పదానికి దగ్గరగా ఉన్న ఉత్సాహకర పదం వాడండి, ఔత్సాహిక పదం మానివేయండి.

ఇదంతా చెప్పి దశాబ్దాలుగడిచాయి. వాళ్లు మానారా? ఏమో? తక్కిన సంఘాలు మానినట్టు సాక్ష్యంలేదు.

***

# తిరుమల రామచంద్ర జీవిత సాహిత్య విశేషాలు

అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా రాఘవం పల్లెలో 17 జూన్, 1913 (ప్రమాది జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి జ్యేష్ఠ నక్షత్రం) న తిరుమల శేషాచార్యులు, శ్రీమతి జానకమ్మలకు తిరుమల రామచంద్ర జన్మించారు.

## విద్యార్హతలు

ఆలిగఢ్ ఆయుర్వేద విద్యాపీఠం నుండి ఆయుర్వేదభూషణ (1933), మద్రాసు విశ్వవిద్యాలయం నుండి తెలుగు - సంస్కృతంలలో విద్వాన్ (1936), పంజాబ్ విశ్వవిద్యాలయం నుండి హిందీ ప్రభాకర (1941) పూర్తి చేసిన వీరు లాహోర్‌లో బి.ఏ., చదువుకు వెళ్లారు కాని పూర్తి చేయలేకపోయారు. సంస్కృత, ప్రాకృత, తెలుగు, కన్నడ, హిందీ, తమిళ, ఆంగ్లభాషల్లో గాఢమైన ప్రవేశం ఉంది.

## స్వాతంత్ర్య సమరయోధుడు

ఉప్పు సత్యాగ్రహంలోను, వైయక్తిక సత్యాగ్రహంలోను పాల్గొని 12 నెలల కఠిన కారాగారశిక్షణు అనుభవించారు (1930-32). స్వాతంత్ర్య సేనానిగా సమ్మానం అందుకున్నారు. హైదరాబాద్. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, భారతి, పరిశోధన, ఆంధ్రభూమి, హిందూస్థాన్ సమాచార్ మొ॥ పత్రికల్లో వివిధ హోదాలలో పనిచేశారు.

## నిర్వహించిన శీర్షికలు

ఆంధ్రప్రభ వారపత్రికలో నుడి-నానుడి, తెలుగుతల్లి, మరపురాని మనీషి, శీర్షికలను, ఆంధ్రసచిత్ర వారపత్రికలో హైదరాబాద్ నోట్‌బుక్, తెలుగు వెలుగులు శీర్షికలను, భారతిలో సాహితీ సుగతుని స్వగతం, మనవిమాటలు; ప్రజాతంత్రలో ఇదీ మన హైదరాబాద్, ఆంధ్రప్రదేశ్‌లో రాజధాని విశేషాలు; పల్లకిలో ప్రాచీనాంధ్ర గాథలు; పరిశోధనలో చరిత్రకెక్కని చరితార్థులు, తెలుగు తోబుట్టువులు; ఉదయం దినపత్రికలో మరో ప్రపంచం; ఆంధ్రప్రభ దినపత్రికలో మాండలికాలు, పలుకుబడి అన్న శీర్షికలను నిర్వహించారు.

## ప్రచురణలు

సంస్కృతంలో సత్యాగ్రహ విజయః, నాటకం (1930), సుమతిశతకమ్ (1932), హిందీలో ఆంధ్ర కే కుఛ్ త్యోహార్ రచనల చేశారు. తెలుగులో: రూట్ మార్చ్ (సైన్యం కథలు) (1945), వీరగాథలు (1952), దక్షిణాంధ్రవీరులు (1953), లాల్‌బహదూర్‌శాస్త్రి (1953), కాటమరాజు (1955), హిందువుల పండుగలు - పర్వాలు (1957), మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు (1957), ధర్మదీక్ష (1958), శశాంకవతి (బృహత్కథ ఆధారంగా

నవల) (1960), తెలుగు వెలుగులు (1962), నుడి నానుడి (1963), సాహితీ సుగతుని స్వగతం (1970), నూరేళ్ళ తెలుగు వ్యాసం (1975), మరపురాని మనీషి (లేఖినీ చిత్రాలు) (1975), నాగలాపురం – దాని పరిసరాలు (చరిత్ర పరిశోధనం) (1975), గాథాసప్తశతిలో తెలుగు పదాలు (1980), మూడు వాఙ్మయ శిఖరాలు (1988), తెలుగు పత్రికల సాహిత్యసే (1989), ప్రాకృత వాఙ్మయంలో రామకథ (1992), మనవి మాటలు (1992), బుద్ధుణ్ణి బళ్లో వేసిన కథ (1993), బృహదారణ్యకం (1993), అహం భో అభివాదయే (లేఖినీ చిత్రాలు) (1995), హాలుని గాథలు – తెలుగు కథలు, నాలుగు చరిత్ర స్తంభాలు, హంపీ నుంచి హరప్పాదాక. మనోరమా వాచకాలు, వివేకానంద వాచకాలు, ఆనంద వాచకాలు (1954–1956), వేయికి పైగా వ్యాసాలు, వందలలో పుస్తక సమీక్షలు చేశారు. దాదాపు 17 కలం పేర్లతో పత్రికలలో రచనలు చేశారు.

**అనువాదాలు**

అవధాన కల్పలత (1960), బృహత్కథామంజరి (1964), లలిత విస్తర మహాపురాణం (సం–ప్రా) (1969), హరమేఖల (ప్రా) (1989), లీలావయీ కహా (ప్రా) (1994–1995), శాంతల నవల (కె.వి.అయ్యర్ (సా.అ.ఢిల్లీ) (1960), మరల సేద్యానికి (నవల) – శివరామకారంత్ – (సా.అ.ఢిల్లీ), మరణానంతరం (నవల) శివరామకారంత్ (సా.అ.ఢిల్లీ), గ్రామాయణం (నవల) రావ్ బహాదుర్ – (నేషనల్ బుక్ ట్రస్ట్, ఢిల్లీ), కన్నడ వ్యాస సంకలనం (సా.అ.ఢిల్లీ), కొన్ని కన్నడ నాటికలు (సౌతిండియన్ బుక్ ట్రస్ట్, మద్రాసు), చిరస్మరణ (నవల) (విశాలాంధ్ర, హైదరాబాద్), కామరాజనాడార్ రష్యా పర్యటన–ఆంధ్రపత్రిక (1970), రాజాజీ కథలు (1970), గాంధీజీ కారావాస కథ – సుశీల నయ్యర్ – ఆంధ్రప్రభ (1905). కేవలం ఆంగ్లం నుంచి 30 గ్రంథాలు తెనిగించారు.

**కొన్ని బిరుదులు, సన్మానాలు :**

సాహితీసుగతుని స్వగతానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్ (1970), పత్రకార్ శిరోమణి, కలకత్తా సర్వభాష పత్రకార్ సమ్మేళన్ (1976), "మహామహోపాధ్యాయ" బిరుదం, అఖిలభారత విద్వత్పరిషత్తు, వారాణాసి (1978), 'గాథాసప్తశతిలో తెలుగు పదాలు'కు రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్. (1980), గౌరవ డాక్టరేట్ బిరుదు, సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్ (1988), రాజా లక్ష్మీ అవార్డు, మద్రాసు (1989), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం విశిష్ట పురస్కారం (1993), "హంపీ నుంచి హరప్పా"దాకా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు (1999), హంపీ నుంచి హరప్పాదాకా "కేంద్ర సాహిత్యా అకాడమీ" అవార్డు (2001), తన జీవితాన్ని సాహిత్య సృజనకే అంకితం చేసిన తిరుమల రామచంద్ర 12, అక్టోబరు 1997న హైదరాబాదులో పరమపదించారు.

# <u>అక్షర సేద్యం</u>

ఆరుపదుల వయసుదాటినా అలుపు సొలుపులేక ముప్ఫదేళ్ళ ప్రాయం ఉత్సాహంతో వయోధిక పాత్రికేయ సంఘు సభ్యులు ఉరకలెత్తుతున్నారు. వృత్తికి , ఉద్యోగానికి వ్యత్యాసం ఎంతో ఉంది. ఉద్యోగానికి కట్టుబాట్లు, పరిమితులు, వృత్తి ప్రవృత్తికి సంబంధించిన అంశం. ఒకవైద్యుడు, ఒక న్యాయవాది, ఒక ఉపాధ్యాయుడు, ఒక పాత్రికేయుడు ఊపిరున్నంత వరకూ అడుగులు వేస్తునే ఉంటారు. పాత్రికేయవృత్తిలో చేయితిరిగి, తల పండిన వ్యక్తులు తమ అనుభవం, నేర్చుకున్న విజ్ఞానం రంగరించి వృత్తి ప్రయోజనాలు, ధర్మాలు పరిరక్షించుకుంటూ వర్గ సంక్షేమం, పని మెలకువలను సానబెట్టే మహాయజ్ఞాన్ని చేపట్టారు. అందులో భాగమే ఎనిమిది పుస్తకాల ప్రచురణ. వీటిని సాధారణ అచ్చుపుస్తకాలు అనుకుంటే పొరబాటే. అనుభవాల సారాన్ని మధించి రూపొందించిన గ్రంథాలే ఇప్పటివరకూ వచ్చిన ఏడు ప్రచురణలు.

<u>మన పాత్రికేయ వెలుగులు</u> – <u>Our Legends of the Fourth Estate</u>

వయోధిక పాత్రికేయ సంఘుం చేపట్టిన తొలియజ్ఞం "మనపాత్రికేయ వెలుగులు", "Our Legends of the Fourth Estate" ప్రచురణలు. పత్రికారంగమే ప్రాణపదంగా, ప్రపంచంగా భావించి వృత్తికి అంకితమైన మహామహుల నుంచి నేటితరం వరకు అందరినీ స్పృశించిన గ్రంథం "మన పాత్రికేయ వెలుగులు". కందుకూరి వీరేశలింగం నుంచి టి. లక్ష్మీపతివరకు (1818 నుంచి 2004 వరకు) పత్రికా రంగానికి సేవలందించి పరమపదించిన 300 వందలమంది వైతాళికులు, కీర్తిశేషుల సంక్షిప్త పరిచయం రెండు విభాగాలుగా తీర్చిదిద్దారు. అదే విధంగా మూడోభాగంలో 'ప్రముఖులు'గా పరిచయం చేస్తూ పాత్రికేయ రంగ వికాసానికి కృషి చేస్తున్న ఈతరం కలాలను వివరించారు. అదేమాదిరి రెండు దశాబ్దాల అనుభవంతో పత్రికా రచయితలుగా నిలదొక్కుకున్న వారి ఫొటోలను నాలుగో భాగంగా తీర్చిదిద్దారు. జర్నలిస్టుల విధి నిర్వహణలో ప్రముఖ ఘట్టాలతో 'చిరస్మరణీయ చిత్రాలు' పొందు పరచారు వీటిని తెలుగు, ఆంగ్లభాషల్లో ప్రచురించారు. తెలుగునాట వెలువడిన పురాతన పత్రికల ప్రతులను వండి వడ్డించారు కూడా. తెలుగు పత్రికా ప్రముఖులతో కూడిన పూర్తి సమాచారంతో రాష్ట్రంలో వెలువడిన గ్రంథాలుగా ఈ రెండింటిని పేర్కొనవచ్చు.

### మార్పుచూసిన కళ్ళు

తెలుగు పత్రికారంగంలో కాలుపెట్టి అచిర కాలంలో ఆకాశవాణి వార్తావిభాగంలో చేరి రాష్ట్ర, దేశ, ప్రపంచ వ్యాప్త వార్తా విశేషాలను శ్రోతలకు గుదిగుచ్చి సమర్పించిన భండారు శ్రీనివాసరావు "మాస్కో అనుభవాలు" వ.పా.సం. ప్రచురణే! 1987లో అప్పటి సోవియట్ యూనియన్ రాజధాని మాస్కోలో, రేడియోమాస్కో తెలుగున్యూస్ రీడర్‌గా నాలుగున్నరేళ్ల అనుభవం రంగరించి అందించిన "మార్పు చూసిన కళ్ళు", ఆదేశంలో గడిపిన కాలపు చరిత్ర. వృత్తిరీత్యా పదవీ విరమణ చేసినా ప్రవృత్తిరీత్యా అక్షర సన్యాసం చేయని విలక్షణ, హాస్య, చతుర సంభాషకుడు భండారును ఆవిష్కరించే పుస్తకం ఇది. 'చందమామ' కథలా సాఫీగా సాగుతాయి ఆ అనుభవాలు.

### జర్నలిజం ఇన్ ఆంధ్రప్రదేశ్ (Journalism in Andhra Pradesh)

1943లో హైదరాబాద్‌లో జన్మించి జర్నలిజంలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసి 'డైలీన్యూస్' ఆంగ్లపత్రికలో ఉపసంపాదకునిగా పత్రికారంగంలో కాలూని అప్రతిహతంగా 2005 వరకు ఆంగ్లపత్రికా రంగంలో మెట్లెక్కుతూ 'ద హిందూ' హైదరాబాద్ కేంద్రంలో డిప్యూటి ఎడిటర్ హోదాకు చేరి పదవీ విరమణ చేసిన దాసు కేశవరావు అందించిన విశేషాల సమాహారం 'జర్నలిజం ఇన్ ఆంధ్రప్రదేశ్' ఇంగ్లీషు పుస్తకరూపం. తెలుగునేలపై పత్రికాప్రపంచం ప్రసరింప జేసిన వెలుగు జిలుగులను. కాలానుగుణంగా వచ్చి మార్పులను, సాధించిన ప్రగతిని, వ్యక్తుల వికాసాన్ని, సంఘటనలు, చోటుచేసుకున్న మార్పులకు సాక్షీభూతంగా నిలుస్తుందీ పుస్తకం. ప్రతి పాత్రికేయుడూ తప్పక చదవవలసిన చరిత్ర ఇది.

### తెలుగు పత్రికలు – తీరు తెన్నులు

వయోధిక పాత్రికేయ సంఘం ప్రచురణల్లో మణిమకుటం ఈ గ్రంథం. తెలుగు పత్రికారంగంలో ఆచార్య స్థానం అలంకరించి జర్నలిజానికి కొత్త ఒరవడి తీర్చిదిద్ది, చరిత్రను, భాషను, పదప్రయోగాన్ని 'కరతలామలకం' చేసిన ప్రసిద్ధ పాత్రికేయులు డాక్టర్ జి.యస్.వరదాచారి. సంఘటనలు, సంచలనాలు, పరిణామాలు పాఠకులకు అందించే కర్తవ్య పరాయణులైన వార్తా రచయితలు పాటించవలసిన సూత్రాలు, ధర్మాలు, సత్యనిష్ఠను సునిశిత భాషలో వివరించిన క్రియారూపమే "తెలుగు పత్రికలు – తీరుతెన్నులు". విషయాన్ని నాలుగు భాగాలు చేసి అర్థం, పరమార్థం వివరించారు. గురుపీఠంపై కూర్చుని

పాఠాలు చెప్పినట్లు కాకుండా మిత్రవాక్యంగా తేటతెలుగులో అందించిన వ్యాసాల సమాహారం ఈ పుస్తకం, నైతిక సూత్రావళి, దిద్దుబాటుగా విభజించారుర రచయిత వరదాచారి ఇందులో!

### శత వసంతోత్సవం

వ.పా.సం. ప్రచురణల్లో మరొక కలికితురాయి ఈ విశేషపుస్తకం. ఆంధ్రోద్యమానికి పునాదులు వేసింది. వంద సంవత్సరాల కిందట 1913లో బాపట్ల అనే చిన్న పట్టణంలో. ఇది ఆ పట్టణ ప్రజల అదృష్టమని చెప్పి తీరాల్సిందే. బాపట్లలో ఆంధ్రోద్యమానికి ఊపిరిపోసింది "ప్రథమాంధ్ర మహాసభ". వంద సంవత్సరాల మధురస్మృతిని వేడుకగా చేసుకుంటూ పురప్రముఖులు 2013 మే నెలలో శతాబ్ది ఉత్సవాలు నిర్వహించిన సుమూహూర్తంలో వ.పా.సం. ఉద్యమ విశేషాలను, వరుసన కన్నులకు గట్టినట్లు చిత్రీకరించిన ఘట్టమే "శతవసంతోత్సవం". స్మృతిపథంలో నాటి ఉద్యమవార్తలు - వ్యాఖ్యాలు - సంపాదకీయాల ముత్యాలసరం ఈ విలువైన పుస్తకం. దేశంలోని వేర్వేరు నగరాల్లో జరిగిన ఆంధ్ర్యోద్యమం, ఆంధ్ర మహాసభ, సహదక్షిణాఫ్రికా ఆంధ్రమహాసభ వివరాలు పునర్ముద్రించి పునశ్చరణచేశారు. 40 పుటల సంక్షిప్త చరిత్ర ఈ ప్రచురణ. తప్పక దాచి ఉంచుకోవలసిన సంపద ఇది.

### పండిత పాత్రికేయులు - బహుభాషాకోవిదులు

సరళమైన, సలక్షణమైన, సహజమాధుర్యమైన తెలుగు భాషకు పట్టంకట్టి, భావితరాలకు ముఖ్యంగా పత్రికారచయితలకు మార్గదర్శకులుగా వెలుగొందిన తిరుమల రామచంద్రకు చంద్రునికో నూలుపోగులా సమర్పించిన చిరుపుస్తకం "పండితపాత్రికేయులు - బహుభాషాకోవిదులు - తిరుమల రామచంద్ర''. ఆ మహనీయుని శతజయంతి సంవత్సర తరుణాన అక్షరనివాళి సమర్పించే రీతిలో ఆయనను కీర్తిస్తూ పలువురు ప్రముఖులు రాసిన వ్యాసాల సమ్మేళన మీపుస్తకం. రామచంద్ర వరిష్ఠ పత్రికా రచయిత మాత్రమే కాదు, పండితుడు, పరిశోధకుడు, విమర్శకుడు, బహుభాషావేత్త, బహుగ్రంథకర్త. ఎన్ని పురస్కారాలు లభించినా, "పత్రికార్ శిరోమణి" బిరుదును మాత్రమే పేరుముందు చెప్పుకోవడానికి ఇష్టపడిన భాషాసేవకుడామహనీయుడు. ఆయన వివరాలే ఈ పుస్తక విషయం.

*







# ఆడపిల్లకు ప్రతి ఏటా ప్రభుత్వ సాయం.
# బంగారు తల్లులు
# అవుతారు తల్లిదండ్రులకు వరం.




| బంగారు తల్లి | | |
|---|---|---|
| వయస్సు | దశ | మొత్తం (రూ.) |
| పుట్టగానే | జనన నమోదు సమయంలో | 2,500 |
| 1 నుండి 2వ సం॥ల వరకు | టీకాల నిమిత్తము | సం॥నికి 1,000 |
| 3 నుండి 5వ సం॥ల వరకు | అంగన్‌వాడి | సం॥నికి 1,500 |
| 6 నుండి 10వ సం॥ల వరకు | 1 నుండి 5వ తరగతి వరకు | సం॥నికి 2,000 |
| 11 నుండి 13వ సం॥ల వరకు | 6 నుండి 8వ తరగతి వరకు | సం॥నికి 2,500 |
| 14 నుండి 15వ సం॥ల వరకు | 9 నుండి 10వ తరగతి వరకు | సం॥నికి 3,000 |
| 16 నుండి 17వ సం॥ల వరకు | 11 నుండి 12వ తరగతి వరకు | సం॥నికి 3,500 |
| 18 నుండి 21వ సం॥ల వరకు | గ్రాడ్యుయేషన్ - 1 నుండి 4వ సం॥ల వరకు | సం॥నికి 4,000 |
| 18 సం॥లకు - ఇంటర్మీడియేట్ తరువాత రూ.50,000, గ్రాడ్యుయేషన్ తరువాత రూ. 1 లక్ష | | |

**మొత్తం రూ.2,16,000**



## ఆడపిల్లల ఉజ్వల భవిష్యత్తుకు ప్రభుత్వ భరోసా

ఆడపిల్ల పుట్టినప్పుడు, ఇంటికి లక్ష్మీదేవి వచ్చిందంటారు. దురదృష్టవశాత్తు ఇది మాటలకే పరిమితమైపోయింది. ఆడపిల్ల జననం కుటుంబానికే భారమని తల్లిదండ్రులు భాదపడుతుంటారు. ఈ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ముఖ్యమంత్రి శ్రీ నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి నాయకత్వంలోని మన రాష్ట్ర ప్రభుత్వం **"బంగారు తల్లి"** పథకం తీసుకొచ్చింది.

ఈ పథకం కింద ఆడపిల్ల జననం నుండి డిగ్రీ వరకు ప్రభుత్వం ఏడాదికి కొంత మొత్తాన్ని అందిస్తుంది - మొత్తం రూ.2,16,000 లు అందజేస్తుంది. ఆడపిల్లల కొరకు ఇప్పటికే ప్రభుత్వం అమలు చేస్తున్న పథకాలకు అదనంగా, ఈ పథకం రాష్ట్రంలోని తెల్లకార్డుదారులందరికి వర్తిస్తుంది!



**గౌ॥ శ్రీమతి సునీతా లక్ష్మారెడ్డి**
ఇందిరాక్రాంతి పథం, పెన్షన్లు,
స్వయం సహాయక గ్రూపులు,
మహిళా, శిశు సంక్షేమ శాఖామాత్యులు



**శ్రీమతి డి. కె. అరుణ**
సమాచార, పౌర సంబంధాల
శాఖామాత్యులు




జారీ చేసినవారు: సమాచార, పౌర సంబంధాల శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
Release Order No. 505/Sou/Advt.I/2013-14, D: 29.11.2013

